




# ఓ ముద్దరాలి వెచ్చటి కన్నీటి కథ

'మా పువ్వులనె త్తురే మీ మేనికి అత్తరు' అంటూ మానవజాతికి తన విలాపాన్ని వినిపించిందో పుష్పబాలిక! సృష్టిలోని ప్రతి పువ్వుని ఆ భగవంతుడే పూయించినప్పుడు అందులో కొన్ని పువ్వులు పూజకి ఎందుకు అర్హం కావడంలేదు?

ఈ ప్రశ్నని సృష్టికర్త భగవంతుణ్ణి అడగాలా? లేక అర్హతలు నిర్ణయించే మానవుణ్ణి అడగాలా? ఎవర్నీ అడగొద్దు. పూజకు పనికిరాని పువ్వుగా పిలవబడ్డ శ్రీదేవి జీవితాన్ని చదివితే మీ తెలుస్తుంది. హింసతో నలిగిపోతున మనిషికి సానుభూతి చూపించే మ దేవుడిలా కనిపిస్తాడన్న సత్యా గ్రహించిన లాయర్ రాజశేఖర్ తండ్రి ఇంట్లో పెనుబాధలు పడుత సీతమీద సానుభూతిఅనే సమ్మోహనా ప్రయోగించి, గర్భవతిని చేసి, ఆ త నీకూ నాకూ సంబంధం లేదంటూ పోయిన అగ్గిపుల్లని అవతలకి వి





నట్లుగా ఆమెను గెంటివేశాడు. ఇది ఓ న్యాయవాది తన విషయంలో పాటించిన న్యాయ విధానం.

ఆత్మహత్య చేసుకోబోతున్న సీతని ఆపుచేసి, నీ జీవితానికి న్యాయం జరిపిస్తాం అంటూనే ఓ ఇన్‌స్పెక్టరుగారు తనకి కంచుకోటలాంటి పోలీస్ స్టేషన్లో ఆమె మీద అత్యాచారంచేసి బయటకి నెట్టేడు. ఇది ఓ పోలీసు ఇన్‌స్పెక్టరుగారి అధికార ప్రదర్శనకి నిదర్శనం.

ఒడ్డున పడిన చేపని వండుకు తిన డానికి ఎవరికైనా హక్కువుందంటూ రిక్షా నర్సిగాడు సీతని ఓ వ్యభిచార గృహంలో అమ్మేస్తే-ఆనాటినించి సీతాదేవి శ్రీదేవిగా మారింది. అమాయకురాలు అంగడిబొమ్మై నిలిచింది. శెలవుల్లేని రైలుబండిలాంటి వ్యభిచార జీవితంలో ఎందరో ప్రయాణి కులు...ఎన్నెన్నో అనుభవాలు. విష వలయంలో వింత అనుభవాలమధ్య, "నీ కోసం నేనున్నానంటూ" అభయ హస్తం అందించిన అమృతమూర్తి కాని స్టేబుల్ రాజు ఆమెకు దేవుడిచ్చినవరంలా కనిపించినా "నేనో పూజకు పనికిరాని పువ్వుని. భగవంతుడిలాంటి మీకు భక్తు

రాలిగాతప్ప భార్యగావుండటానికితగనూ" అంటూ సంస్కారం ప్రదర్శిస్తూ నమస్కారం చేసింది శ్రీదేవి.

ప్రాణంగా చూసుకునేతమ్ముడు అర్థాంతరంగా చనిపోయినా తమాయించుకుంది. కరువు ప్రాంతాలు పర్యటించడానికొచ్చిన మంత్రిగారి కొడుకు చేతుల్లో నలిగిపోతూ, తన తమ్ముడి చివరిక్షణాల్లో నోట్లో ఇన్ని నీళ్లు పోసే ప్రాప్తానికి నోచుకోకపోయినా సహించింది, భరించింది. కానీ–తన సహచరిణి గిరిజ నికృష్టమరణంతోచలించింది. ఆ జీవితంనుంచి బయటపడాలని తెగించింది.

అయితే....వ్యభిచారం అనేది ఈ సమాజం వెన్నుమీద లేచిన రాచపుండు, దాన్ని నిర్మూలించాలి – అంటూ అవుట్ డోర్ డైలాగు చెప్పినా, "వ్యభిచారం అనేది మా సరదాకోసం మేం పెంచుకుంటున్న పువ్వుంమొక్క! దానికి నీరుపోసి పూలు పూయించకపోతే మా జీవితాలకు గుబాళింపు ఉండదు!" అంటూ ఇన్ డోరు డైలాగ్ చెప్పే ఎమ్మెల్యేగారు;



అధికారంవుందని, అడిగేవాడు లేడని అమానుష చర్యల్నే నిత్యకృత్యాలు! ఆచరించే ఇన్‌స్పెక్టరు పరమేశ్వరం; వల కొరికి చేపలు పారిపోతే, సముద్రానికే నిప్పు పెట్టేస్తాననే బ్రోతల్ కంపెనీ యజమాని; దేశంలో ఎవడూ ఏతప్పు చెయ్యకపోతే పోలీసులెలా బతకాలి?

మా ప్రభుత్వం ఎందుకుండాలి? అని ప్రశ్నించే మంత్రివర్యులు; సరదాగాచూసే స్థలాల్లో కరువు ప్రాంతాల్ని కూడా కలుపుకుని, సరదాగా పర్యటించి, సరదాగా వ్యభిచారంచేసి, సరదా తీర్చిన అధికారులకి ప్రమోషన్లు ఏర్పాటుచేసే మంత్రిగారి కొడుకులు ఉన్న ఈ సమాజంలో — రాజులాంటి ఉత్తముడి అండ

దండల్తో కొత్తదారి తొక్కిన శ్రీదేవి తదితరులకి ఆ దారిలో నడిచే అవకాశం లభించిందా? కాదు! విషవలయంనించి అమృతసదనానికి చేరుకున్న శ్రీదేవిని మళ్ళీ కత్తుల బోనులోకిలాగి, నిప్పుల



వానల్లో నడిపించారు. అభయమిచ్చిన రాజుని అంతమొందించారు...! ఆ తర్వాత ఏమయింది? బాగా ఎండిపోయిన పుల్లలు అమితవేగంగా అంటుకుని మండినట్లు, అనేక కష్టనష్టాల కోర్చిన సీత-కాళీమాత యింది! శ్రీదేవి దుర్గాదేవిలా గర్జించింది. కలకంఠికంట కన్నీరొలికితే ఎలాంటి అరిష్టాలు జరుగుతాయో మహాకవులు చెప్పేరు కానీ...జీవితంలో విసిగివేసారిన ఓ వ్యభిచారికంట నెత్తుటిబొట్లు చిందినవేళ ఏ మహా దారుణం జరుగుతుందో...మీరే చూడండి.

ఇది ఒక పూజకు పనికిరాని పువ్వు కథ! ఓ జీవన్మృతురాలు చూపించిన ఓ నిప్పుల నవ్వుకథ!

వెరసి జీవనమరణ పోరాటంలో నలిగి నాశనమైన ఓ ముద్దరాలి వెచ్చటి కన్నీటి వ్యథ.

ఈ కథకి నడకలు నేర్పి, వెండితెర మీద నర్తింపజేసిన దర్శకుడు ఎ. మోహన్ గాంధి. పూజకు పనికిరాని పువ్వులకే నోరొస్తే ఏమవుతుందని ఆలోచించి, వినిపింపజేసిన కథ, మాటల రచయిత కాశీ విశ్వనాథ్, అమాయకురాలి దగ్గర్నించి అగ్నిపర్వతంగా మారేవరకూ హృద్యంగా




ఎ. మోహనగాంధి


ఎస్. కాశీవిశ్వనాథ్


డి. ప్రసాద్ బాబు


వేటూరి సుందరరామమూర్తి


చక్రవర్తి


గౌతంరాజు


భాస్కరరాజు


శేషు


ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం


ఎస్. జానకి


అట్లూరి రామారావు

చూపించిన ఛాయాగ్రాహకుడు డి. ప్రసాద్ బాబు, సరస హృదయాలకు నవరస గీతాంజలి ఘటించిన ఘనాపాటి వేటూరి సుందరరామమూర్తి, పూలగుండెల మధురిమతోపాటు, జ్వలిత జ్వాలల్లోని వేడిమిని గూడా తన సంగీతంలో పలికించిన చక్రవర్తి, ప్రేక్షకుల ఓర్పు, చిత్రాలకు వారిచ్చే తీర్పు గ్రహించి, నేర్పుగా కూర్పు చేసిన గౌతమ్‌రాజు ఈ చిత్రానికి ముఖ్య సాంకేతిక సారధులుకాగా శేఖర్ సుమన్ ('ఉత్సవ్' హిందీ చిత్రం ఫేం), నూతన్ ప్రసాద్, చలపతిరావు, కోట శ్రీనివాసరావు, సాక్షిరంగారావు, హరిప్రసాద్, పొట్టిప్రసాద్, బాలాజీ, మిఠాయిచిట్టి, శాస్త్రి, చిడతల అప్పారావు, తులసి, ప్రమీల, వై. విజయ, రాజ్యలక్ష్మి, జయశీల, మహీజా, రేఖ, బిందుమాధవి, అతిథి పాత్రల్లో వేలు, రాళ్ళపల్లి, వీరభద్రరావు, ఈ చిత్రంలోని తారాగణం. వీరందరి సమ్మేళనతో సవినయంగా ఈ చిత్రాన్ని సమర్పిస్తోంది ఉషాకిరణ్ మూవీస్.

నిర్వహణ: అట్లూరి రామారావు.

నిర్మాత: రామోజీరావు.

మయూరి ద్వారా విడుదల





ఉషాకిరణ్ మూవీస్

# పూజకు పనికిరాని పువ్వు

కథ·మాటలు: కాశీ విశ్వనాథ్
సంగీతం: చక్రవర్తి
కెమెరా: డి.ప్రసాద్‌బాబు
కూర్పు: గౌతంరాజు

నిర్మాత
రామోజీరావు

దర్శకత్వం
ఎ.మోహనగాంధి

IIA

# చతుర

సంపుటి: 9 జనవరి 1987 సంచిక: 12

## ఈ నెల సమగ్ర నవల

"ఈ దారుణానికి వెనుకనున్న దౌర్భాగ్యులందర్నీ బయటకులాగాలి సార్! పోలీసులు కనీసం ఒక్కరినైనా అరెస్టుచేస్తారనే నమ్మకంలేదు నాకు. వాళ్లు చేసేదల్లా కేవలం శవాన్ని స్వాధీనం చేసుకొని మార్చురీకి పంపటం వరకే...అంతే!" అన్నాడా పత్రికా విలేఖరి ఆగ్రహంతో కంపించిపోతూ. ఓ యువతి దారుణంగా సామూహిక మానభంగానికి గురయింది. ఆ తర్వాత హత్య!.. మరి నీతి, నిజాయితీ, వృత్తిపట్ల గౌరవం, బాధ్యతగల ఓ యువ రిపోర్టర్ ఆ సందర్భంగా చేయవలసిందీ, చేయగలిగిందీ, చేసిందీ ఏమిటి? పత్రికా రంగంలో ఇన్వెస్టిగేటివ్ రిపోర్టింగ్‌కు ప్రాధాన్యం పెరిగిన ఈ కాలంలో వార్తల వెనుకనున్న...

# నిజం

...బయటకులాగాలంటే ఎదురయ్యే కష్టనష్టాలెలాంటివి? అందుకు సిద్ధపడిన నిజాయితీపరునికి ఎదురయిన ప్రమాదాలేమిటి?

## సత్యంవోలు సుందరసాయి

సమకాలీన పత్రికారంగం, జర్నలిస్టులు, వారిచుట్టూ పేరుకుపోయిన అవలక్షణాలను సోదాహరణంగా చిత్రించిన వినూతన నవల "నిజం" ఈనెల "చతుర" సమగ్రనవల.

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: సురేష్ చంద్ర బచావత్

1987 ఫిబ్రవరి

# చతుర

## జన్మదిన సంచిక

తెలుగు పత్రికా రంగానికి గర్వకారణమైన, అసంఖ్యాక పాఠకుల అభిమాన విపుల, చతుర మాసపత్రికలు 1987 ఫిబ్రవరి సంచికతో తొమ్మిదేళ్ల సుదీర్ఘ సాహితీ సేవ పూర్తి చేసుకుని పదవఏట అడుగు పెడుతున్నాయి.

1986 మేలో 100వ సంచికలు వెలువడిన సందర్భంగా భారతీయ భాషా పత్రికా చరిత్రలోనే అపురూపమైన రీతిలో లక్షరూపాయల బహుమతులతో ప్రకటించిన కథలు, నవలల పోటీలో నెగ్గిన రచనల ప్రచురణ ఈ సంచికలతోనే ఆరంభ మవనున్నది.

రు : 10,000/- బహుమతి పొందిన తెలుగు నవలను 'చతుర' పాఠకులు ఈసంచిక లోనే చదువనున్నారు. ప్రధమ బహుమతులు పొందిన తెలుగు, తెలుగేతర భాషా విశిష్ట కధానికలతో విపుల సాహితీ జనమనోభి రామంగా వెలువడనున్నది. అనేక ఇతర ప్రత్యేకతలతో సర్వాంగ సుందరంగా వెలువడనున్న ఈ జన్మదిన సంచికల ధరమాత్రం మామూలే!



చతుర




## పీడకలలకు స్వస్తి

నిద్రలో కలలు రావడం చాలా సహజం. ఆరోగ్యంగా ఉన్న మనిషికి సాధారణంగా ఒక రాత్రికి మొత్తం రెండు గంటలపాటు కలలు వస్తూ ఉంటాయి. కలకంటున్నవారి కళ్ళలోతప్ప మిగితా శరీరంలో ఏమాత్రం కదలికఉండదు. కలలు మనం అనుకొన్నట్టుగా ఒక క్షణంలో ఏదోమెరుపులారావు. కలలో వచ్చిన సంఘటన నిజంగా జరిగితే ఎంత సమయం పడుతుందో కలలో కూడా అంతే సమయం పడుతుంది. సాధారణంగా మనకు వచ్చే కలలోని సంఘటనలు ఒకదానితో ఒకటికి పొంతనలేకుండా అర్థరహితంగా అనిపిస్తాయి. కలపూర్తిగా గుర్తులేకపోయినా కలనుబట్టి ఒక్కోసారి మెలుకువవచ్చాక కూడా అశాంతికరమైన లేదా ఆహ్లాదకరమైన అనుభూతి ఉంటుంది. కలలను మనం ఏమాత్రం అదుపులో ఉంచలేమనే అభిప్రాయం ఇప్పటివరకూ ఉండేది. అయితే ప్రఖ్యాత మానసిక శాస్త్రవేత్త 'కైత్‌హెర్నె' కలల గురించి అనేక పరిశోధనలు జరిపి, మనకు వచ్చే కలలను మనం శాసించవచ్చని అంటున్నారు.

కలలను మన అదుపులో ఉంచడానికి మొదట ఎటువంటి కల కనాలను కొంటున్నామో నిర్ణయించుకోవాలి. మెలుకువ వచ్చిన వెంటనే కలగుర్తున్నంత వరకు ఒక కాగితం మీదరాసి ఉంచుకోవాలి. అలా ప్రతిరోజూ చేస్తుంటే క్రమంగా కల మొత్తం గుర్తుపెట్టుకోవడం అలవాటవుతుంది. తరువాత కలలో మూసిఉన్న తలుపులోనుండి వెళ్ళిపోవడం లేదా, గోడలోంచి వెళ్ళిపోవడంవంటి అవాస్తవిక సంఘటనలువస్తే వెంటనే అవి గుర్తుపట్టి ఇది 'కల' అని నిద్రలోనే గ్రహించే నైపుణ్యం సంపాదించాలి. అప్పుడు కలను మన ఇష్ట ప్రకారం నడపగలుగుతాం. పీడకలల వంటివి వస్తే వాటిని ఆపవచ్చు లేదా మెలుకువ తెచ్చుకోవచ్చు. ఈ 'ట్రిక్' తెలుసుకొంటే కావాలనుకున్నప్పుడల్లా అందమైన పంచరంగుల కలలు కనవచ్చు.

## సంగీతంతో స్వస్థత

వైజ్ఞానిక రంగంలో శాస్త్రజ్ఞులు ఎన్నో విజయాలు సాధించి, అనివార్యమైనవి అనుకొన్న ఎన్నో రకాల వ్యాధులకు చికిత్స చేయగలుగుతున్నారు. అయితే వైద్యులకు అంతుపట్టని కొత్త జబ్బులు కూడా రోజురోజుకూ పెరిగిపోతున్నాయి. దీంతో కొత్తరకమైన చికిత్సలు, మందుల అవసరం ఏర్పడుతోంది. సాధ్యమైనంతవరకు మందుల అవసరం లేకుండానే జబ్బు నయంచేయడానికి వైద్యరంగ నిపుణులు ఇటీవల అనేక పరిశోధనలు జరిపారు. ఆ పరిశోధనల్లో 'సంగీతం'తో జబ్బులు నయం చేయవచ్చుననే విషయం వారు గుర్తించారు.

నిజానికి సంగీతంతో రోగనివారణ చేయవచ్చుననే విషయం కొన్ని వందల సంవత్సరాల క్రితమే శుశ్రుతుడు, చరకుడు, వాగభట్టు వంటి మన ప్రాచీన వైద్యులు తెలియజేశారు. నేటి నవీన వైద్యశాస్త్రానికి మూలపురుషుడనతగ్గ 'హిప్పోక్రాటస్' కూడా సంగీతంతో వ్యాధినివారణ సాధ్యమేనని అన్నాడు. ప్రఖ్యాతి చెందిన రష్యా దేశపు తత్వశాస్త్రవేత్త, వైద్యుడు అయిన 'బెక్‌ట్రేవ్' సంగీతం అనేక రకాలయిన మానసిక రుగ్మతలను నరాల అస్వస్థతను నివారించగలదని నిరూపించాడు. ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు, వైద్యుడు అయిన 'ఎడ్వర్డ్ బోదలోస్కి' సంగీతాన్ని ఉపయోగించి హానికరమైన సూక్ష్మక్రిములను శరీరంలో ప్రవేశించకుండా నివారించగలిగాడు.

శ్రావ్యమైన సంగీతాన్ని వింటున్నప్పుడు గుండె క్రమబద్ధంగా స్పందించి మనిషిలో ఒక విధమైన ప్రశాంతత ఏర్పడుతుంది. క్రమంతప్పకుండా సంగీతాన్ని వినడంవల్ల గుండెకు అలసట, ఒత్తిడితగ్గి ఆరోగ్యవంతంగా తయారవడమే గాకుండా కంటిచూపుకూడా వృద్ధి చెందుతుంది. దీనివల్ల రక్తపోటు క్రమబద్ధంగా ఉండి ఊపిరితిత్తులు బాగా పనిచే



యగలుగుతాయి. ఎటువంటి మందులూ వాడకుండా కేవలం వివిధ రకాలయిన సంగీతం వినిపించి అన్నవాహికలో ఉన్న 'అల్సర్'ను నయంచేయవచ్చు.

ఈమధ్య విదేశాలలో పంటి జబ్బులు, నరాల రుగ్మత, పురిటినొప్పులకు కూడా 'సంగీత వైద్యాన్నే' ఉపయోగిస్తున్నారు. శస్త్రచికిత్స జరిగే సమయంలో సాధారణంగా రోగికి మత్తుమందు ఇస్తూ ఉంటారు. కొంతమందికి 'క్లోరోఫామ్' పడకపోవడంవల్ల అనేక ఇబ్బందులు ఎదురవుతాయి. అటువంటి వారికి మత్తుమందు బదులుగా శ్రావ్యమైన సంగీతాన్ని వినిపించడంవల్ల ఎటువంటి ఇబ్బందీ ఉండదు. కొన్ని రకాల జబ్బులను సంగీతం ద్వారా నయం చేయలేకపోయినా, అవి ఎక్కువ కాకుండా చేయవచ్చు. కొన్నిరకాలయిన సంగీతం వినటం ద్వారా మనిషి అనవసరంగా భయపడటం, అధైర్యపడటం వంటి లక్షణాలు తగ్గి ఆత్మస్థైర్యాన్ని పెంచుకోగలుగుతాడు. 'సంగీతం' ద్వారా జబ్బును నయం చేయవచ్చుననడానికి, రాంపూర్ నవాబు ఒక చక్కని ఉదాహరణ.

రాంపూర్ నవాబు చాలా ఏళ్లుగా కీళ్ళవాతంతో బాధపడేవాడు. దానికి ఆయన మనదేశంలోనేగాక, విదేశాలలో కూడా పేరుపొందిన అనేకమంది వైద్యులచేత వైద్యం చేయించుకొన్నారు. కానీ లాభం లేకపోయింది. ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు 'ఉస్తాద్ సూరత్ ఖాన్' మందులేమీ వాడకుండానే సంగీతంతో నవాబుగారి జబ్బు నయంచేయగలనని అన్నాడు. అతని మాటపై ఎవరికీ నమ్మకం కలగకపోయినా నవాబుమాత్రం ఆఖరి ప్రయత్నంగా దానికి అంగీకరించాడు. సూరత్‌ఖాన్ జయజయవంతి రాగాన్ని ఆలాపించి ఆరు నెలల్లో నవాబు కీళ్లవాతాన్ని తగ్గించగలిగాడు.

తోడి, భైరవి, హిందోళ, మాల్కోస్‌వంటి రాగాలతో అనేకరకాల జబ్బులు నయం చేయవచ్చునని సంగీత విద్వాంసుల అభిప్రాయం. అమెరికావంటి దేశాల్లో సంగీతానికి వైద్యరంగంలో తగిన గుర్తింపు లభించి "మ్యూజికల్ థెరపి క్లినిక్స్"ను కూడా ప్రారంభించారు. అక్కడ మామూలు ఆస్పత్రులలో ఇచ్చినట్లు మందులు ఇంజక్షన్లు ఇవ్వకుండా కేవలం సంగీతంతో వ్యాధిని నయంచేస్తారు.

# పెళ్ళి దుస్తులు

రాజుగారు తలచుకొంటే దెబ్బలకేకాదు దేనికీ కొదవుండదు. అటువంటప్పుడు జీవితంలో అతి ముఖ్యమయిన 'పెళ్ళి' మాత్రం వారు అంద

రిలా సాదా సీదాగా చేసుకుంటారా? ఇంగ్లండ్ రాజకుటుంబాల్లోని పెళ్ళిళ్ళు అత్యంత వైభవంగా జరుగుతాయి. పెళ్ళి సమయాల్లో రాజకుమార్తెలు ధరించవలసిన దుస్తుల విషయంలో కొన్ని సంప్రదాయాలు పాటించవలసి ఉన్నప్పటికీ తమ దుస్తుల విషయంలో వారికెప్పుడూ ఖచ్చితమైన నిర్ణయాలు ఉంటాయి. ముఖ్యంగా పెళ్ళి కూతురు ధరించే 'పెళ్లిగౌను' కూ చాలా ప్రాముఖ్యతనిస్తారు. అందరి దృష్టి దానిమీదే ఉంటుంది. దాని అలంకరణ గురించి అందరూ ముందే ఊహాగానాలు చేస్తూ ఉంటారు. ఒక్కో రాజకుమారి పెళ్లి దుస్తులకు ఒక్కో ప్రత్యేకత ఉంటుంది.

1613లో మొదటి జేమ్స్ చక్రవర్తి కుమార్తె 'ఎలిజబెత్' రాజకుమారి వివాహం జరిగింది. ఆమె పెళ్లిలో తన పొడుగాటి జుట్టును, బంగారు, వజ్రాలు, ముత్యాలతో అలంకరించుకుంది. ఆమె ధరించిన 'ట్రైన్' అంటే గౌను వెనక భాగంలో పైనుండి కిందికి వేళ్ళాడుతూ ఉండే పొడుగాటి బట్టను వెండి జరీతో చేశారు. దాని ఖరీదు ఆ రోజుల్లోనే దాదాపు రెండువేల మూడు వందల రూపాయలు. ఆమె పెళ్లికి అయిన మొత్తం తొమ్మిది లక్షల రూపాయల ఖర్చు చూసి ఆమె తండ్రికి ఠారెత్తింది. ఆ సొమ్మును ప్రజల నుండి రాబట్టడానికి 'పెళ్లిపన్ను' ను ఎక్కువచేశాడా మహాశయుడు. అయితే ఆయన చేసిన పని నచ్చని ప్రజలు విసుక్కుంటూ మూడు లక్షల నలభైవేలు మాత్రమే చెల్లించగలిగారు.

1558లో స్కాట్‌లాండ్ రాకుమార్తె 'మేరి' ఫ్రాన్సు యువరాజు 'డాఫిన్' ను పెళ్ళి చేసుకున్నప్పుడు తెల్లటి గౌను వేసుకొంది. తెలుపు రంగు ఆమె దేహఛాయకు, ఎర్రటి జుట్టుకు బాగానప్పుతాయనుకొంది. అయితే ఆ కాలంలో ఫ్రెంచి రాణులు తెల్లటి దుస్తులను సంతాపసూచకంగా ధరించేవారు. ఆ విధంగా ఆమె అత్తగారింటి ఆచారాన్ని ధిక్కరించింది. 1783లో రెండవ జ్జార్ పెద్ద కుమార్తె 'యాన్' ప్రిన్స్ ఆఫ్ ఆరెంజ్' ను వివాహమాడినప్పుడు తన 'పెళ్లిగౌను'కు చేతులనిండా వజ్రాలు పొదిగించింది.

మొదటి ఛార్లెస్ భార్య 'హెన్రిట్టా మరియా' మాత్రం తన పెళ్లి దుస్తుల ఎంపికలో ఓ పొరపాటు చేసింది. ఆమె 'ట్రైన్' ను మఖమల్ మీద బంగారు నగిషీపనిచేసిన బట్టతో తయారు చేయించింది. ఆ ట్రైన్ ఎంత బరువుగా తయారయిందంటే పెళ్ళి జరుగుతున్నంత సేపూ ప్రత్యేకంగా ఒక మనిషి దాన్ని మోయవలసి వచ్చింది. మూడవ జార్జి పెళ్ళిలో 'చార్లెట్' రాకుమారి వెండి టిష్యూగౌన్ వేసుకొని, వజ్రాలు పొదిగిన ఊదారంగు టోపీనిపెట్టుకొంది. ఆమె వేసుకొన్న గౌను ముందుభాగం విలువే దాదాపు పదిలక్షల



రూపాయలు. 'పెళ్లిగౌను' కోసం చేసిన ఈ మితి మీరిన ఖర్చుకు ఆమెకే కాస్తసిగ్గనిపించిందేమో. తన కూతురి పెళ్ళికి 'పెళ్ళిగౌను' తనే స్వయంగా కుట్టి ఖర్చు తగ్గించింది.

1840లో విక్టోరియా రాణి తన పెళ్ళిలో ఆభరణాలేమీ ధరించకుండా కేవలం ఆరెంజ్ పూవుల హారం మాత్రమే ధరించి నిరాడంబరమైన పద్ధతికి నాంది పలికింది. ఆమె వేసుకొన్న తెల్లటి శాటిన్ గౌను మీద కుట్టిన హానిటన్ లేసును మాత్రం తగినంత పనిలేక మూతబడుతున్న 'డెవేన్' అనే కర్మాగారాన్ని ప్రోత్సహించడానికి తయారు చేయించారు. ఆ లేస్ రెండు వందల మంది పనివాళ్ళకు పని కల్పించింది. ఎంతో పొదుపరి అయిన విక్టోరియా రాణి ఆ పెళ్ళి గౌను పాతబడిపోయాక ఆ లేసును తీసి జాగ్రత్త చేసి దాన్నే ఒక నల్లటి గౌను మీద కుట్టించింది. ఆమె భర్త 'ఆల్‌బర్ట్' చనిపోయాక ఆమె ఒక్కరిపెళ్లికి తప్ప మిగతా తన అందరి పిల్లల పెళ్ళిళ్ళకూ అదే గౌను వేసుకొంది.

1923లో లేడీ ఎలిజబెత్ 'డ్యూక్ ఆఫ్ యొర్క్' ను పెళ్లాడిన సందర్భంలో నిలువుగా ఉండే ఐవరీ షిఫాన్ గౌను ధరించింది. 'కొత్త ఫాషన్స్' ను కనిపెట్టడంలో పేరుపొందిన 'మరీనా' రాకుమార్తె 'పెళ్లిగౌను' ను కుట్టడానికి ప్రత్యేకమైన దర్జీలను నియమించే పద్ధతిని ప్రవేశపెట్టింది. ఆమె తన పెళ్లికి గులాబి రంగులో వెండి, బంగారు జరీ బుటాలున్న గౌనును 'ఎడ్వర్డ్ మాలినెక్స్' చేత కుట్టించింది. 1960 లో ఆమె కూతురు 'అలెగ్జాండ్రా' కోడలు 'కాథరిన్ వోర్స్‌లే' కూడా ఆమెను అనుసరించి తక్కువ ఖర్చుతోనే అత్యంత సుందరమైన గౌన్లను ప్రత్యేకంగా నియమించిన దర్జీల చేత కుట్టించుకొన్నారు.

1960లోనే పెళ్ళి చేసుకొన్న 'మార్గరెట్' రాకుమార్తె పెళ్ళి దుస్తుల కొక ప్రత్యేకత ఉంది. ఆమె మొదటిసారి 'బాల్‌రూమ్ డాన్స్' కు వేసుకొన్న గౌనంటే ఆమె తండ్రి ఆరవ జార్జి చాలా ఇష్టపడేవారు. మార్గరెట్ సరిగ్గా అటువంటి గౌన్లనే 'బ్రైడ్స్ మైడ్స్'— అంటే వధువుతో బాటుగా ఉండే కన్నెపిల్లలకు కుట్టించింది.

1947లో రెండవ ప్రపంచ యుద్ధానంతరం జరిగిన ప్రస్తుత రాణి ఎలిజబెత్, ఫిలిప్స్‌ల పెళ్ళి ఎంతో వైభవంగా జరిగింది. హార్నెట్ డిజైన్ చేసిన ఆమె 'పెళ్లిగౌను'ను ఐవరీడచెస్ శాటిన్ బట్టతో తయారుచేశారు. దానిమీద ముత్యాల గులాబి పువ్వులు, గోధుమవెన్నులు అలంకరించారు. ఆ గౌను కున్న 'ట్రైన్' పొడవు పదిహేను మీటర్లు. ఆ బట్టను తయారుచేయడానికి ముప్పయి లక్షల పట్టుపురుగుల నుండి తయారయిన పట్టును వాడారు. కొన్ని వందల మంది యువతులు దానిమీద ముత్యాలను ఎంతో అందంగా కుట్టారు. ఆ పెళ్లితో యుద్ధకాలంలోని స్తబ్దత అంతా అంతరించి లండన్ నగరం మళ్ళీ ఎప్పటిలా కళకళలాడింది.

ఇక ఈ మధ్య ఎంతో ఆడంబరంగా జరిగిన డయానా, చార్లెస్ పెళ్లికి దాదాపు అరవై లక్షల రూపాయలు ఖర్చయింది.

# శ్రీరస్తు

సాధారణంగా హిందువులు శుభలేఖలు, ఉత్తరాల వంటివి రాసే ముందు పైన 'శ్రీ' 'శ్రీరస్తు' లేదా 'శుభమస్తు' అని రాస్తారు. అదే విధంగా ముస్లిములు '786' అనే అంకె వేసి శుభలేఖలు, ఉత్తరాలు ప్రారంభిస్తారు.

హిందువులు ఏ కార్యాన్ని తలపెట్టినా అది నిర్విఘ్నంగా సాగాలని వినాయకుని ప్రార్థిస్తారు. వారికి "ఓం విఘ్నేశ్వరాయనమః" వంటి మంత్రాలు ఉన్నట్టే ముస్లిములకు "బిస్మిల్లా అర్రహమాన్ నిర్రహీమ్" అనే మంత్రం ఉంది. ముస్లిముల ప్రవక్త మహమ్మదు తన కుమార్తె వివాహానికి ముందు ఈ మంత్రాన్ని జపించి వారి దేవుడి ఆశీర్వాదాన్ని పొందాడు. "సర్వశక్తి సంపన్నుడైన ఓ భగవంతుడా! నీ ఆశీర్వాదంతో ఈ పవిత్రమైన కార్యాన్ని నిర్వర్తించదలచాను. ఏ అంతరాయమూ కలుగకుండా నన్ను కాపాడు." అని ఈ మంత్రం యొక్క అర్థం.

ఈ మంత్రాన్ని పూర్తిగా కాగితం మీదనో లేదా ఏదైనా వస్తువు మీదనో రాస్తే అది ఎక్కడైనా కిందపడినప్పుడు పొరపాటున ఎవరయినా దాన్ని కాలితో తొక్కే ప్రమాదం ఉంది. అది అపచారం. కాబట్టి ఈ మంత్రం యొక్క పవిత్రతను కాపాడడానికి పూర్తి మంత్రం రాయకుండా దాని గుర్తుగా '786' అని మాత్రమే రాస్తూ ఉంటారు.

'బిస్మిల్లా అర్రహమాన్ నిర్రహీమ్'కు గుర్తుగా '786' అంకె వాడటానికి ఒక కారణం ఉంది. ఈ వాక్యంలోని ప్రతి అక్షరానికీ సంఖ్యా శాస్త్రం ప్రకారం ఒక ప్రత్యేకమైన విలువ ఉంది. అరబిక్ భాషలోని



ఈ వాక్యాన్ని నాలుగు పదాలుగా విడదీయవచ్చు. బిస్మి, అల్లా, అర్రహమాన్, ఇర్రహీమ్, మొదట పదంలో ఉన్న బి, సీన్, మీన్, అనే అరబిక్ అక్షరాలకు వరుసగా 2, 60, 40ల విలువ ఉంది. మొత్తం కలిపితే 102 రెండో పదంలో అలీఫ్ 'లామ్, లామ్' హే అనే అక్షరాలు ఉన్నాయి. వీటి విలువ క్రమంగా 1, 30, 30, 5 ఈ అంకెల మొత్తం విలువ 66. ఈ విధంగా లెక్కపెడితే మొత్తం వాక్యంలోని అక్షరాల విలువ 786. అందుకని 'బిస్మిల్లా అర్రహమాన్ నిర్రహీమ్' అనే పూర్తి మంత్రానికి బదులుగా '786' అనే అంకెను వాడతారు.

# క్రీస్తు మొదటి చిత్రపటం

క్రీ.శ. 30వ సంవత్సరంలో అంటే జీసస్‌క్రైస్ట్ శిలువ వేయడానికి ముందుగా మైనర్ ఏషియా రాజుగారు ఆయన్ను తన రాజ్యానికి ఆహ్వానించాడు. కాని ఆ సమయానికి జీసస్ వెళ్ళలేక పోయాడు. అందుకని ఆయన శిష్యులలో ఒకరైన 'సెయింట్‌ల్యూక్' క్రైస్ట్ చిత్రాన్నిగీసి ఆ రాజుకు పంపాడు. అదే 'జీసస్ క్రైస్ట్' మొట్టమొదటి చిత్రపటం.

తరువాత క్రీ.శ. పద్నాలుగో శతాబ్దంలో ఇటలీ దేశాధినేత ఈ దేశంపై దాడి చేసినపుడు 'జీసస్' చిత్రపటాన్ని తనతోబాటు తీసుకెళ్ళిపోయాడు. దాన్ని జెనీవాలోని 'సెయింట్‌బెర్తలోమ్యా చర్చి'లో భద్రపరిచాడు. ఆ చిత్రపటం నేటికీ అక్కడేఉంది.

క్రైస్ట్‌ను శిలువ వేసినప్పుడు రక్తసిక్తమైన ఆయన మొహాన్ని 'సెయింట్ వెరోనికా' ఒక తెల్లటి వస్త్రంతో అద్దింది. ఆ వస్త్రంమీద పడిన 'ముద్ర' జీసస్ రెండో చిత్రం. రెండువేల సంవత్సరాలనాటి ఆ వస్త్రాన్ని 'వాటికన్' నగరంలోని 'సెయింట్ పీటర్' చర్చిలో భద్రపరచిఉంచారు.

'క్రైస్ట్' మరణించిన తరువాత ఒక రోమన్ చక్రవర్తి కూతురుకు క్రైస్ట్ ఎలా ఉండేవాడో తెలుసుకోవాలనే కోరిక పుట్టింది. అపుడు క్రైస్ట్ శిష్యులలో ముఖ్యుడైన సెయింట్ పీటర్ 'జీసస్' చిత్రాన్ని గీసి చూపించాడు. అదే 'జీసస్‌క్రైస్ట్' మూడో చిత్రపటం.

ఇప్పుడు మనకు బజార్లో దొరికే 'జీసస్‌క్రైస్ట్' చిత్రపటాలన్నీ ఈ మూడు చిత్రాల ఆధారంగా తయారు చేసినవే.




నవంబర్ 'చతుర' నవల 'బావి'పై పాఠకుల నుంచి మాకు అందిన 'చతుర 'సమీక్ష' లలో ఉత్తమంగా వున్న మూడింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు! బహుమతులు పొందిన ముగ్గురికీ మా అభినందనలు!

## కొత్తపుంతలలో...

(ప్రథమబహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

నవంబరునెల "చతుర" నవల "బావి" నిస్సందేహంగా కొత్తతరహా నవల! మూసలో పడి కొట్టుకుంటున్న సాహిత్యాన్ని కొత్తపుంతలు తొక్కించడం కోసం సరికొత్త రచయితలకైనా సరే అవకాశాన్నిచ్చి ప్రోత్సహించడం "చతుర" మొదటినుండి నిలుపుకుంటున్న ప్రత్యేకత! ఘండికోట బ్రహ్మాజీరావుగారు పాఠకులకు పాత రచయితే అయినా ఈ రచన ద్వారా "చతుర" పాఠక ప్రపంచంలోకి కొత్తగా వచ్చారు. వంటింటి కథల నుండి ప్రేమకథలకు- ప్రేమ కథల నుండి ఫాంటసీలోకి పయనించిన నేటి నవలను దారి మళ్ళించవలసిన అవసరం ఎంతైనా ఉంది. మన చుట్టూ మనకి సంబంధించిన సమస్యలనేకం ఉన్నా తెలుగు రచయితలు పట్టించుకోకుండా, ఇంగ్లీషు నవలలను అనుసరించటమూ,' యథాతథంగా తెలుగులోకి దించెయ్యడమో చేస్తున్నారు. ఆ వెల్లువలోంచి బయటపడవేసి చల్లని కూపోదకం తాగించిన ఘండికోట వారు అభినందనీయులు.

అయితే- నవలను రచయిత లోపరహితంగా, పకడ్బందీగా మలచుకోలేకపోయారు. ఉదాహరణకి కథ ఎత్తుగడలో హీరోయిన్‌కే ప్రాధాన్యం ఉండేలా కల్పించారు. తీరా లోపలికి వెళ్ళే సరికి హీరో వర్షిప్ మొదలై- చివరికంటా హీరోయే ప్రముఖంగా ఉంటాడు. బ్రహ్మాజీరావుగారు హీరోని మొదట సాధారణమైన మనిషిగా పరిచయం చేశారు. పోను పోను హీరోకి ప్రాధాన్యం పెంచడం కోసం రామన్నపేట సంఘటనల్ని ఉపయోగించారు. గోనెలపాడు నుండి రామన్నపేటకు కేవలం అరగంట ప్రయాణం. అత్యవసర పరిస్థితిలో హీరో అటెండ్ అయినప్పటికీ ఆ తర్వాత డాక్టర్ నిర్మల డెలివరీ కేసయినా కూడా రామన్నపేట వెళ్ళలేదు. ఇలాంటివి కేవలం హీరోని పెంచడం కోసమే!

ఏమైనా- ఘండికోటవారిని ఒకందుకు అభినందించక తప్పదు. నేటి తెలుగు పత్రికలన్నీ అవసరార్థం బూతుని ప్రోదిచేస్తున్నాయి. నగ్న చిత్రాలు- కామసూత్రాలతో అచ్చ తెనుగులో




బూతుని అందిస్తూ పత్రికలను ముంచితేల్చు తున్న ఈ రోజుల్లో- మూలకథకి సెక్సు అవసరమైనప్పటికీ- చాలా సున్నితంగా కథను నడిపించిన ఘండికోట వారు అభినందనీయులు. కొత్తదనాన్ని ప్రోత్సహిస్తున్న "చతుర"ను అభినందించాలి.

—ఎన్.ఆర్.గుండా
పాల్వంచ

# ప్రయోజనకర నవల

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

నవంబరు చతుర 'బావి' విజ్ఞానదాయకంగానూ, ఆసక్తికరంగానూ వుంది. కథ కొంత సాగదీసినట్టు అన్పించినా, తీసికొన్న సబ్జెక్టు కొత్తదవడంవల్లా, శైలి బాగుండడంవల్లా కథలో ఎక్కడా పటుత్వం సడలలేదు. నవల ఇతివృత్తంలో రెండు ప్రధానాంశాలున్నాయి. ధనమదాంధులైన కంట్రాక్టర్లు, దొంగడాక్టర్ల స్వార్థానికి అమాయక గ్రామీణ ప్రజలు ఎలా బలవుతున్నారన్నది ఒకటి, పొల్యూటెడ్ వాటర్ తాగడంవల్ల అది సెక్సువల్ లైఫ్‌ను ఎలా ప్రభావితం చేస్తుంది అన్నది రెండవది.

'బావి'లో నీరు క్లోరినేషన్‌వల్ల కలుషితమవడం, అవి తాగడంవల్ల గ్రామంలోని పురుషులందరూ వంధ్యత్వం పొందడం, సంతానార్హత కోల్పోవడం, దానిమీద యువడాక్టర్లిద్దరి పరిశోధన, చివరకు హీరో బావి విషయం కనుగొని దానికి పరిష్కారం చూపడంతో కూడిన కథను ఆసక్తికరంగా నడపడంలో రచయిత విజయం సాధించారు.

పాత్రల విషయానికొస్తే సిన్సియర్‌గా వర్క్ చేయాలనే మనస్తత్వం కల్గిన డాక్టర్ నిర్మల, మొదట హీరోయిన్ దృష్టిలో విలన్‌గా కనిపించినా చివరకు సమస్యకు పరిష్కారం కనుగొనడంతోనూ, నిర్మల మనసులో స్థానం సంపాదించడంతోనూ హీరోగా మారిన డాక్టర్ గోపీకృష్ణ ఇందులో అందంగా మలచబడిన పాత్రలు. కౌస్తుభం, వరహాలు, ఆనందరావు, వెంకట్రావు, అలమేలు, నరసింహారావుపంతులు లాంటి పాత్రలు సినిమాల్లోని పాత్రల్లా కన్పించినా వాటికి పెద్ద ప్రాధాన్యత ఇవ్వకుండా కథ అంతా డాక్టర్లిద్దరి చుట్టూనే నడపటంలో రచయిత సామర్థ్యం అర్థమవుతోంది.

నవలలో ప్రధానాంశాలైన మేల్ ఇంప్రొడెన్సీ, ఫిమేల్ లిబిడో స్టెరిలిటీలను గురించి రచయిత బాగానే వివరించినా, మరికొన్ని విషయాలకు పూర్తి వివరణ ఇవ్వలేదన్పిస్తూంది. క్లోరినేటెడ్ వాటర్ తాగడంవల్ల నిజంగా మేల్ ఇంపొటెన్సీ, ఇన్‌ఫెర్టిలిటీ సంభవిస్తాయా? అయితే ఆ పొల్యూటెడ్ వాటర్ ఏ విధంగా గొనాడ్స్ మీద లేదా ఏంద్రోజన్లు, ఈస్ట్రోజనులు విడుదలవడం మీద ప్రభావం చూపుతుంది? నాలుగు సంవత్సరాలుగా బావి నీరు తాగి ఇంపొటెంట్స్‌గా మారిన మగవారు కేవలం ఏడురోజులు వేరే ప్రాంతపు బావి నీరు తాగడంవల్ల మామూలుగా మారగలరా?— వంటి కొన్ని అంశాలు సందేహాలుగానే వుండిపోయాయి. అయినా మొత్తం మీద వైరైటీ థీమ్ తీసికొని దాన్ని చివరి వరకూ ఉత్కంఠత కల్గించే విధంగా నడిపించిన 'ఘనత' రచయితకు దక్కుతుంది.

– కె.పద్మావతి
గూడూరు

# చదివించే నవల

**(తృతీయ బహుమతి రు. 50/-**

**పొందిన సమీక్ష)**

**చ**తురలో ప్రచురించిన నవలని సమీక్షించటం అన్నది ఒక విధంగా సాహసమే! సంపాదకులు నవలలో కొత్తదనం లేనిదే ప్రచురించరన్న నిజం చతురను వరుసగా పఠిస్తున్న నాలాంటి ఎంతోమంది పాఠకులకు తెలుసు.

ఈ నవలకు "బావి" అని పేరు పెట్టకుండా మరోపేరు పెట్టినట్లయితే ఒక మంచి సస్పెన్సు నవల రూపొంది ఉండేది. గోనెలపాడు ప్రజలకు ఉన్న సమస్యను రచయిత సెక్స్ సామర్థ్యానికి సంబంధించినదిగా చిత్రించి, సమస్య అంతా బావి నీటిలోనే ఉందని మంచి మలుపు తిప్పి, నవలను ముగించిన వైనం బాగుంది. కానీ, దాదాపు సగం నవల చదవటం పూర్తి అవుతున్న సమయంలో కొంచెం విసుగు పుట్టించింది. నవలలో మొదటి సగం పేజీలు జన్యుశాస్త్ర పదాలతో, సెక్స్ సామర్థ్య వివరణతో, డాక్టరు నిర్మల ట్రీట్‌మెంట్ చేసే విధం, ఆ సందర్భంగా ఆమె ఊరి ప్రజలను వేసే ప్రశ్నలు, డాక్టర్ గోపీకృష్ణ మీద విసుగు ప్రదర్శించటం ఇత్యాదులతోనే సాగింది.

నవలా ప్రారంభాన గోపీకృష్ణని సగటు విద్యార్థిగా, మెరిట్‌లేని వాడిగా చిత్రించి, అతనికి, నిర్మలకి ఊరి ప్రజల ట్రీట్‌మెంట్ సందర్భాన, వారివురి మధ్యా సాగే సంభాషణా పరంపరలో గోపీకృష్ణ చేత మంచి తెలివైన ప్రశ్నలు వేయించారు.

ఆ ఊరి నీటి ప్రభావానికి నిర్మలలాంటి నిగ్రహం ఉన్నవ్యక్తి కూడా పండువెన్నెల రేయిలో, బావి సమీపాన డాక్టర్ గోపీకృష్ణతో సమాగమానికి సిద్ధంఅయింది. ఎంత నీటి ప్రభావానికి గురి అయినా, అంత నిగ్రహం ఉన్న వ్యక్తి గోపీకృష్ణ చేరువకానందుకు ఆ విధంగా అతన్ని అలా నిందించటం, అదికూడా ఏహ్యమయిన పదజాలంతో బాగు అనిపించలేదు.

గోపీకృష్ణ అపుడే బావిలో నీరు పడుతున్న వింత శబ్దానికి సందిగ్ధపడతాడు. ఇక్కడే కథ మంచి మలుపు తిరిగింది. ఇక్కడి నుంచే కథ చకచకా సాగింది. పాఠకులు నవలలో లీనమై చదివింది ఆ తరువాత నుంచే.

మొదట నిర్మల పాత్ర హైలెట్‌గా కనపడ్డా,నవల ముగింపు కొచ్చేసరికి గోపీకృష్ణపాత్రకే రచయిత ప్రాధాన్యత నిచ్చారు. కారణం? రచయిత తను జన్యుశాస్త్రం, కాగితం పరిశ్రమ గురించి సేకరించిన విషయాల్ని నవలలో చక్కగా వాడుకున్నారు. కానీ చదువరులు అందరూ విద్యాధికులు కారు అన్న విషయాన్ని మరిచి కొన్ని పదాల (ఆండ్రోజన్, ఈస్ట్రోజిన్ మొ॥వి) వివరణ సరిగ్గా ఇవ్వలేదు. బావి గురించి దాగిన రహస్యాన్ని ఛేదించటానికి గోపీకృష్ణ చేసిన సాహసం, పరిశోధన రచయిత చాలా కుతూహలంగా రాసారు. నవల ఎత్తుగడ, ముగింపులు వేరువేరు అయినా, రెంటికీ పొంతన బాగా కుదిర్చిన రచయిత నేర్పు స్పష్టంగా కనిపించింది.

ఈ నవలా ప్రయోజనం అన్న మాట అటుంచితే, కొంత జన్యుశాస్త్ర పరిజ్ఞానం, ఒక మంచి సస్పెన్సు నవల చదివాము అన్న తృప్తి పాఠకులకు తప్పనిసరిగా కలుగుతాయి.

—జి. రమేష్ కుమార్
మహబూబ్‌నగర్

# నిజం

## సత్యవోలు సుందరసాయి



ఎదురుగా పాతికేళ్ళ యువతి శవం.

'ఈమర్డరెపుడు జరిగింది?' అడిగాడు ఎస్.పి. రతన్.

ఆ శవం చుట్టూ ఉన్న పోలీసులు ఎస్.పి.ని చూస్తున్నారు. ఎస్.పితో పాటు శవాన్ని పరికిస్తున్న ఎస్.ఐ. మన్‌మోహన్ వక్కకు తిరిగి "తెలియదు సార్" అని వినయంగా చెప్పాడు.

'ఈ బాడీని ఐడెంటిఫై చేశారా?'- ఎస్.పి. కంఠం సీరియస్‌గా మ్రోగింది.

'నో... సార్...' మన్‌మోహన్ మరింత నమ్రతగా చెబుతున్నాడు.

"ఈమర్డర్ బహుశా ఈ తెల్లవారు జామునే అయివుండవచ్చు సార్. బాడీని కానిస్టేబుల్స్ పది గంటలకు చూశారు. అప్పటికి బాడీ మీద ఒక్క గుడ్డపీలిక కూడా లేదుసార్. నేనే పదకొండుగంటల కి ఓ గుడ్డ కప్పించాను సార్. చూడండిసార్. బాడీ మీద సిగరెట్ వాతలు. కొంచెం పైన సార్... ఈ కిందకూడా ఆ వాతలు...."

ఎస్.పి. తన కేసి చూడడంతో ఆగాడు మన్‌మోహన్.

గండిపేట హైదరాబాద్‌కి సమీపగ్రామం. ఆ గ్రామానికి అరమైలు దూరంలో పడిఉందాశవం.

ఎవరిదా శవం?.

ఎవరు ఆ యువతిని చంపారు?

శవం మీద నూలుపోగైనా లేకపోవడానికి కారణం ఏమిటి?

ఎస్.పి.రతన్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

'అయామ్ నిఖిలేష్....ఫ్రం... నిజం'- ఎస్.ఐకి తనకుతాను పరిచయం చేసుకుంటున్న వ్యక్తిని చూశాడు రతన్.

ఎస్.ఐ. ఆవ్యక్తిని ఎస్.పిని కలవమన్నాడు.

మళ్ళీ అదే పరిచయం.

'నిజం.... తెలుగు డైలీ...?' రతన్ అర్థోక్తిగా ఆగాడు.

'యా....'

'ఈ విషయం అపుడే మీకెలా తెలిసింది...?'- రతన్ అడిగాడు. సమాధానంగా నిఖిలేష్ నవ్వాడు. 'ఫోన్‌లో ఎవరో...'

అర్థమయిందన్నట్లు చూశాడు రతన్.

'ఈ మర్డర్ కేను గురించి ఇపుడే విచారణ మొదలుపెట్టాం. మీరూ వచ్చారు. నేను అపుడే ఏం చెప్పలేను. మీరు స్పాట్ డిటైల్స్ రానుకోండి. సాయంత్రం ఫోన్ చేస్తే మిగతా వివరాలు చెబుతాను'- రతన్ పరిస్థితిని వివరించాడు.

'కనీసం మర్డర్ ఎప్పుడైందో....?'

'మిస్టర్ నిఖిలేష్ అదే నేను తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. మీరు ఏమి అడిగినా అచ్చేసినా అది మాకు... అంటే మా దర్యాప్తుకు అవరోధం అవుతుంది.... సారీ... ఏవనుకోవద్దు-' ఇంకేం ప్రశ్నలొద్దు అన్నట్లుగా చూశాడు రతన్!

శవం మీద పోలీసులు కప్పిన గుడ్డ కనీసం ఆ శవం మానాన్ని కూడా దాచలేకపోతోంది. యువతి శవంమీద గాయాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

చిన్నగా ఉన్న ఆ గాయాలు ప్రాణాన్ని హరిస్తాయా?

ఆలోచనలు రేగుతూండగా ఆ స్థలం నుంచి తప్పుకొన్నాడు నిఖిలేష్.

ఆ యువతిని దారుణంగా మానభంగం చేశారు.

ఎవరు? ఎందుకు?

ఎక్కడ ఆ మానభంగం జరిగింది?

శవాన్ని దూరంగా ఎందుకు పారేశారు?

రతన్ ఆలోచనలను అందుకోలేక పోలీసులు అవస్థపడుతున్నారు. ఎస్.ఐ. మన్‌మోహన్ సమాధానాలు రతన్‌కి తృప్తిగా లేవు.

చంపబడిన ఆ యువతిని ఇదివరలో ఎక్కడయినా చూశారా? పోలీసుల్ని ప్రశ్నించాడు.

సమాధానంలేదు.

"ఏదైనా వ్యభిచారం కింద ఎప్పుడైనా పట్టుకున్నారేమో?"

"నో...సార్" మన్‌మోహన్ చెప్పాడు.

"ఈ గండిపేటలోని శృంగార కొంపలకి ఈ అమ్మాయి రావడం ఎవరైనా చూశారేమో వాకబు చేశారా?"

రతన్ ఎస్.పి.హోదాలో ఇన్‌స్పెక్టర్లనూ.. ఎస్.ఐలనూ నిలదీస్తున్నాడు. కాని, ఎన్ని ప్రశ్నలేసినా సాయంత్రం నాలుగు దాటినా పోలీసుల దగ్గర్నుంచి సమాధానాలు మచుకు దొరకలేదు.

ఆ తర్వాత అక్కడ పడిఉన్న శవానికి కదలిక




వచ్చింది. పోలీసుల కస్టడీలో మార్చురీకి తరలించబడింది.

★ ★ ★

నిజం పత్రిక కార్యాలయంలో రెండోషిఫ్టుకి వచ్చిన కంపోజిటర్లూ, ఇంపోజర్లూ 'టీ' తాగి పనికి మళ్ళీ సిద్ధం అయ్యారు.

ప్రూఫ్‌రీడర్లు 'టీ' తాగటానికి బయటకు వస్తున్నారు. టెలిప్రింటర్లు టవటవలాడిస్తూ కాగితాల్ని పైకి వంపిస్తున్నాయి.

టెలిప్రింటర్లనుంచి పైకొచ్చిన ఆ కాగితాల్ని ఎప్పటికప్పుడు చింపుతూ న్యూస్ ఎడిటర్‌కి ఇవ్వడానికి ఆఫీస్‌బాయ్‌లు కంగారు పడుతున్నారు.

న్యూస్ ఎడిటర్ టెలిప్రింటర్లమీద వచ్చిన ఇంగ్లీషు వార్తలను తర్జుమా చెయ్యడానికి సబ్‌ఎడిటర్లకు ఇస్తున్నాడు.

ఎనమండుగురు సబ్‌ఎడిటర్లు పనిచేస్తున్న న్యూస్ డస్క్ అది. వాళ్ళు అప్పటికే రాసిన వార్తలను న్యూస్‌ఎడిటర్ అరవింద్ సమీక్షిస్తున్నాడు. న్యూస్ ఎడిటర్ కూర్చొన్న డస్క్ రూంకి ఎదురుగా కంపోజింగ్ సెక్షన్.

అక్కడ ఇన్‌చార్జిగా ఉన్న ఫోర్‌మేన్ మేటరు కావాలని అరుస్తున్నాడు. కంపోజిటర్లు వార్తలకోసం ఎదురుచూస్తున్నారు.

'డాక్' ఎడిషన్‌కి టైమ్ అవుతోంది. జిల్లాలకు పేపర్లు తీసుకెళ్ళాల్సిన వాహనాలన్నీ వచ్చేశాయి.

ఈ ఆలస్యం ఏమిటంటూ సర్క్యులేషన్ వాళ్ళు గొడవచేస్తున్నారు.

కంపోజింగ్ సెక్షన్‌లో 'డాక్' ఎడిషన్ మొదటిపేజీలో వార్తలు పెట్టిస్తూ పేజీని పూర్తి చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు ఇన్‌చార్జి సబ్‌ఎడిటర్ గోపాల్.

సబ్‌ఎడిటర్లు రాసిన వార్తలు కంపోజింగ్ అయింతర్వాత ప్రూఫ్‌రీడింగ్, కరెక్షన్ జరుగుతాయి. కరెక్షన్‌ని పూర్తి మేటర్‌ను చేసి ఇంపోజిటర్లు పేజిదగ్గరకు తీసుకు వస్తున్నారు.

ఆ'స్టోన్' పనిని నిర్వహిస్తున్న సబ్ ఎడిటర్ వార్తలను ఏరకంగా ఇంపోజ్ చేయించాలో చీఫ్ సబ్‌ఎడిటర్‌ని అడుగుతున్నాడు. న్యూస్ ఎడిటర్ ఇచ్చిన సూచనలను చీఫ్‌సబ్ చెబుతున్నాడు.

ప్రెస్ అంతా ఒకటే హడావిడిగా ఉంది. ఈ హడావిడిలోనే పెద్ద శబ్దం చేస్తూ నిఖిలేష్ మోటార్ సైకిల్ వచ్చి ఆగింది.

ఆఫీసులోకి అడుగుపెడుతూనే నిఖిలేష్ రిసెప్షన్ టేబుల్ దగ్గరకు నడిచాడు. కరుణ కుర్చీలో కూర్చొని టెలిఫోన్ పిబిఎక్స్ మీద తలపెట్టి నిద్రపోతోంది. నిఖిలేష్ తన చేతిలోని పుస్తకంతో పిబిఎక్స్‌ని కొడుతూ చప్పుడు చేశాడు.

'వాట్ .. య్యార్...' అంటూ లేచి రెండుచేతులూ విదిలించి నిద్రమత్తు వదుల్చుకొంటూ నిఖిలేష్‌ని చూసింది కరుణ.

'వాట్ నిఖిల్ ... యు స్పాయిల్డ్ మైస్వీట్ స్లీప్' కరుణ విసుక్కుంటూ చెప్పింది.

ఆ చలిరాత్రిలో స్వెట్టర్‌లో బంధించిన ఆమె ఒళ్ళు విరుపు నిఖిల్‌ని ఓ క్షణం కుదిపింది. ఆ మత్తు చూపులు వేడిరక్తాన్ని జివ్వుమనిపించాయి.

నిఖిల్ కళ్ళకేసి చూస్తూ 'వాట్‌డుయూవాంట్ ...?' అంది.

ఆ మరుక్షణం నిఖిల్ సీరియస్ అయ్యాడు. కళ్ళల్లో భావాలు మారిపోయాయి.

అంతవరకూ మత్తులో మత్తుగా చూసిన కరుణ కంగారుపడింది.

'ఏమయింది నిఖిల్ ...?' కరుణ ఆ కంగారుతోనే అడిగింది.

'రేప్ అండ్ మర్డర్' నిఖిలేష్ ముఖం ఎర్రబడింది.

'వేర్...?..' కరుణ ఒకచెయ్యి గుండెలమీద మరో చెయ్యిని టెలిఫోన్ మధ్యాపెట్టి కళ్ళు పెద్దవి చేసింది.

'బాడీ గండిపేట దగ్గర దొరికింది. ఇట్‌ఇజ్ ఎ మాస్ రేప్‌అండ్ మర్డర్... కనక్ట్ మీ టు రంగారెడ్డి ఎస్.పి' నిఖిల్ కంఠంలో కోపం చోటుచేసుకొంది.

నిశ్శబ్దంగా రెండు క్షణాలు గడిచాయి.

టెలిఫోన్ డయల్ శబ్దమే ఆ నిశ్శబ్దాన్ని చీల్చింది.

'ఆ..ఫోనులో మాట్లాడు..నిఖిల్'

రిసెప్షన్ టేబుల్ మీద మూలగా ఉన్న మరోఫోను చూపించింది కరుణ.

'ఎస్.పి.గారా... నిఖిలేష్... భ్రం.. నిజం.'

'——'

'యా—'

'——'



Cyan, Magenta, Yellow, Black, Sp. Co

'ఆ మర్డర్‌కి సంబంధించి ఒక క్లూ దొరికింది.'

'______'

"యా... సేమ్ మర్డర్‌కేస్"

"...."

"దీన్ని గురించి మీరు ఏదయినా చెబితే- నేను పోలీస్ వెర్షన్ ఇద్దామని".

"...."

"ఆ డెడ్‌బాడీని మార్నింగ్ మీతోపాటే చూశాను. సేమ్‌ఫీచర్స్ ఉన్న ఓ అమ్మాయి తప్పిపోయిందంటూ టి.వి.లో చూపించారు".

"...."

"ఆ... నేను చాలాసార్లు ట్రైచేశాను. మీరు దొరక లేదు".

"...."

"సుమారు ఎనిమిదీముప్పైఅయిదుకి చూపించారు"

"...."

"నేనో...మీరు దొరకలేదు. జస్ట్ మీల్స్‌చేసివద్దామని మా సిస్టర్ ఇంటికెళ్ళాను. శనివారంకదా- మావాళ్ళు సినిమా చూస్తున్నారు."

"...."

"యా- సినిమా అయినవెంటనే చూపించారు."

"...."

"ఎగ్జాట్లీ... సమాచార్ ముందు"

"...."

"నేను వివరాలు కనుక్కొన్నాను."

"...."

"యస్. టి.వి. నుంచే"

"...."

"నిన్న సాయంత్రం మిస్‌అయింది. పేరు సౌమ్య. ఏజ్... ట్వంటీఫోర్"

"...."

"అవునండీ... బన్సీలాల్‌పేట పోలీస్‌స్టేషన్‌లో కంప్లైంట్ చేశారు".

"ఓ.కే.. అదే రాస్తా... రేపు మిమ్మల్ని ఆఫీసులో కలుస్తాను"

టెలిఫోన్ రిసీవర్‌మీద ఉంచి.. రిసెప్షనిస్ట్‌కి 'థేంక్స్' చెప్పి నిఖిలేష్ మెట్లెక్కి పైకి వెళ్ళిపోయాడు. ఆ వివరాలన్నీ సమగ్రంగా రాసి న్యూస్ ఎడిటర్‌కి ఇచ్చాడు.

'పదకొండు దాటింతర్వాత ఇలా మేటర్ ఇస్తే ఎలా నిఖిల్?' ప్రశ్నించాడు అరవింద్.

'ఎస్.పి. ఇప్పుడే దొరికాడు సార్..' అని అన్ని వివరాలు తానే చెప్పాడు.

"పోలీసులు ఎవర్నయినా అరెస్ట్ చేశారా?" అరవింద్ అడిగాడు.

"లేదు సార్" నిఖిలేష్ జవాబు చిరాగ్గా ఉంది.

"పోలీసులు ఇంతవరకూ ఎవర్నీ అరెస్టు చెయ్యలేదంటే.. నాకెందుకో అనుమానంగా ఉందయ్యా.. వీళ్ళెవరో అసాధ్యుల్లా ఉన్నారే..." అనుమానం వ్యక్తంచేశాడు, న్యూస్ ఎడిటర్ అరవింద్.

"ఉండొచ్చు సార్.. ఇది మాస్ రేప్.. ఇలా ఆమెను చిత్రహింసలు పెట్టారంటే వాళ్ళు మనుషులు కాదు" నిఖిలేష్‌లో ఆవేశం పొంగింది.

"నిజమేనయ్యా... ఇంత నీచంగా... ఛీఛీ".. అరవింద్ విసుక్కున్నాడు.

"ఈ దారుణానికి వెనకఉన్న దౌర్భాగ్యులందర్నీ బయటకి లాగాలి సార్.. పోలీసులు ఒక్కడ్ని కూడా అరెస్ట్ చేస్తారనే నమ్మకం నాకులేదు. వ్వాట్ పోలీస్ ఆర్ డూయింగ్.. జస్ట్ వాళ్ళు డెడ్‌బాడీని కలెక్ట్ చేసుకొని మార్చురీకి పంపారు. దట్స్‌ఆల్ దె డిడ్" నిఖిలేష్ కళ్ళల్లో ఎర్రదనం కనబడింది.

"నువ్వు చెయ్యాల్సిన పని చేశావ్. పోలీసులు ఏంచేస్తారో చూద్దాం. ఎస్.పి.కి ఓ క్లూ ఇచ్చావుగా. రేపు ఏమవుతుందోచూసి ఫాలోఅప్ రిపోర్టు రాయవయ్యా" అరవింద్ సలహాఇచ్చాడు.

రాత్రి పదకొండున్నర దాటుతోంది.

భాగ్యనగరంలో మంచు భారీగా కురుస్తోంది. శీతాకాలం ధాటికి తట్టుకోవడానికి ఇళ్లల్లో వరువుల మధ్య ఇరుక్కుని, రగ్గుల మునుగుల్లో జనం వెచ్చదనాన్ని వెతుక్కుంటున్నారు.

రోడ్లమీద జనసంచారమేలేదు.

మంచు కురిసి మసగ్గా తయారైన అద్దాలను మూసుకుని అవ్వుడప్పుడు కార్లు ఆ రోడ్ల మీద కదులుతున్నాయి.

సన్నగా వణికే పెదాలమధ్య సిగరెట్ పెట్టి అంటించాడు నిఖిలేష్. మెదడంతా తాను చూసిన యువతి శవం గురించిన ఆలోచనలు నిండి సెగ

లు రేపుతున్నాయి. ఆ దారుణమే మర్చిపోవాలన్నా పదేపదే గుర్తుకొస్తోంది. వెచ్చని రగ్గు ముసుగు వేసుకుని మంచంలో పడుకొన్నా నిద్ర రావడంలేదు.

మంచంమీద పడుకొనే సిగరెట్ కాలుస్తున్నాడు. ఎంతకీ రాని నిద్రకోసం ఎదురుచూస్తున్నాడు.

★ ★ ★

ఉదయం పదిదాటుతోంది.

ఆలస్యంగా నిద్రలేచిన నిఖిలేష్ కంగారు పడుతూ ఆఫీసుకి వస్తున్నాడు.

బేగంపేట బ్రిడ్జీ దాటుతుండగా ఎవరో నిఖిలేష్ పేరుపెట్టి అరుస్తున్నారు.

నిఖిలేష్ తన మోటార్ సైకిల్‌ని స్లో చేశాడు.

ఆపిలిచిన వ్యక్తి ఓ స్కూటర్‌మీద దగ్గరగావచ్చి మొఖానికి నవ్వు పులుముకొని 'మీతో పనివుంది..' అన్నాడు.

''నాకు ఆఫీసుకి టైమ్ అవుతోంది-ఆఫీసుకు రండి మాట్లాడుకుందాం'' అనిచెప్పి మళ్ళీ నిఖిలేష్ స్పీడ్ అందుకున్నాడు.

పది నిమిషాల్లో ఆఫీసుకిచేరి మొదట న్యూస్ డస్క్‌కి వెళ్ళిన నిఖిలేష్‌కి సీనియర్ సబ్ ఎడిటర్ రామ్మూర్తి కనిపించాడు.

కిందటిరోజు ఆలశ్యంగా వచ్చిన జిల్లా వార్తల్లో మంచి వార్తలుఏరి కంపోజింగ్‌కి ఇస్తున్నాడు రామ్మూర్తి.

జనరల్ షిఫ్ట్‌లో పని చెయ్యడానికి వచ్చిన ఇద్దరు సబ్ ఎడిటర్లు టెలిప్రింటర్స్‌మీద వార్తా సంస్థలు అందిస్తున్న ఇంగ్లీషు వార్తలను ఎప్పటికప్పుడు టెలిప్రింటర్ల నుంచిచింపి చూస్తున్నారు.

మిగతా సబ్ ఎడిటర్లు, రిపోర్టర్లూ ఆరోజు 'నిజం' వార్తలను ఇతర పత్రికల వార్తలతో పోల్చిచూస్తూ వ్యాఖ్యలు చేస్తున్నారు.

సామూహిక మానభంగం, దారుణ హత్య-అనే శీర్షికతో ఆ వార్తను 'నిజం' ప్రముఖంగా ప్రచురించింది. కొన్ని ఇతర పత్రికల్లో ఆవార్త సింగిల్ కాలమ్‌కే పరిమితమైంది. 'నిజం' పత్రికలో ఆరు కాలమ్స్ శీర్షికలో ప్రచురించిన ఆ వార్తకు మరికొన్ని పత్రికల్లో అసలు చోటే దొరకలేదు.

నిఖిలేష్ రామ్మూర్తిని విష్‌చేస్తూ బాగా పరిచయమున్న సబ్ ఎడిటర్ల పక్కన కూర్చొని ఇతర పత్రికల్లోని వార్తలను చూస్తున్నాడు. 'మనం రాసిందే బాగుంది మిగతా వాళ్ళెవరూ ఈ వార్తని పెద్దగా పట్టించుకోలేదనుకొంటా' సబ్ ఎడిటర్ జయరథ్ అన్నాడు.

నిఖిలేష్ జయరథ్ వ్యాఖ్యనివిని మౌనంగా ఉన్నాడు.

''నీ వార్త బాగుందయ్యా నిఖిలేష్...'' మెచ్చుకొన్నాడు రామ్మూర్తి.

'థేంక్యూ సార్'' నిఖిలేష్ బదులిచ్చాడు.

ఈలోగా రోడ్డుమీద అరచి పిలిచిన వ్యక్తివచ్చి డస్క్‌రూమ్‌కి ఎదురుగా నిలబడ్డాడు. ఆ వ్యక్తిని ఎక్కడ చూశాడో నిఖిలేష్‌కి గుర్తు రావడంలేదు. బయటకు వచ్చాడు.

''ప్రేమ్‌కుమార్ మీకు తెలుసుకదా..'' ఆ అపరిచిత వ్యక్తి ప్రశ్నించాడు.

''యా'' ఎందుకన్నట్లు చూశాడు నిఖిలేష్.

''నన్ను మీదగ్గరికి ఆయనే పంపాడు మీకీచీటీ ఇమ్మన్నాడు'' ఆవ్యక్తి ఓ చీటీని అందించాడు.

''డియర్ నిఖిల్, ఈ అబ్బాయి మా బంధువు, ఏ తప్పూలేకుండా పోలీసులు ఇతన్ని పట్టుకున్నారు. కొంచెం సహాయంచెయ్యి. నిన్ను స్వయంగా కలుస్తాను-ప్రేమ్‌కుమార్''-అనిరాసిఉంది ఆ చీటీలో. ''పోలీసులు పట్టుకున్నారా.. మరి మీరు ఇలా ఎలా వచ్చారూ...'' నిఖిలేష్ అడిగాడు.

''ఏంలేదుసార్... ఈ ఉదయం స్కూటర్‌మీద వస్తున్నాను. లక్డీకాపూల్ దగ్గర చిన్నపనుండి రాంగ్ సైడులో వెళ్ళాను. జస్ట్ పది అడుగుల దూరంసార్. పోలీసులు పట్టుకున్నారు. నామీద కేసు రాసేసుకున్నారు. ప్రేమ్‌కుమార్‌కి ఈ విషయం చెప్పాను సార్. మీకు ఆ ట్రాఫిక్ డి.సి.పి. తెలునని చెప్పాడు. ప్లీజ్! ఆయనకు చెప్పండి సార్'' ఆ వ్యక్తి బతిమాలుతున్నాడు.

''మీరెవరో నాకు తెలియదుగానీ ఒక్క విషయం అడుగుతాను సూటిగా జవాబు చెప్పండి-రాంగ్-సైడులో వెళ్ళకూడదని తెలిసి ఎందుకు వెళ్ళారు? మీరు తప్పుచేసి పోలీసులు నేరంచేసినట్లు మాట్లాడుతున్నారు. నాకు ఆ ట్రాఫిక్ డి.సి.పి. తెలుసు. అంతమాత్రాన ఇలా తప్పుచేసిన వాళ్ళని నేను సమర్థిస్తే నా విలువ ఉంటుందా?. అయినా ఇలాంటి విషయాల్లో నేను తలదూర్చను. మీరు డైరెక్టుగా డి.సి.పి.ని కలవండి. క్షమాపణ చెప్పు

కోండి. వార్నింగ్ఇచ్చి వదిలేస్తాడు నిఖిలేష్ సలహా ఇచ్చాడు. "అదికాదుసార్..."

ఆ వ్యక్తి వెంటబడుతుంటే అంతకన్నా నేనేంచెయ్యలేను అంటూ నిఖిలేష్ పేపరు చదవడంలో నిమగ్నమయ్యాడు. ఇంతలో ఇంటర్‌కమ్ మోగింది.

"ప్లీజ్..కమ్" అమరేందర్ పిలిచాడు.

అమరేందర్ నిజం పత్రికలో రిపోర్టర్స్ ఇన్‌చార్జి. ప్రతిరోజూ ఏ రిపోర్టర్ ఏ సమావేశానికి వెళ్ళాలో నిర్ణయించేది అమరేందరే.

టేబుల్‌పైన ఎత్తుగాపేర్చి ఉన్న దినపత్రికలమధ్య రాసుకుంటున్న అమరేందర్ నిఖిల్‌ని నవ్వుతూ పలకరించి కూర్చోమన్నాడు.

అమరేందర్ రాత ఆగలేదు. ఆ టేబుల్‌మీదఉన్న ముందురోజు జాతీయ వార్తా పత్రికలను పరికిస్తున్నాడు నిఖిలేష్

పది నిమిషాలు గడిచింది.

అమరేందర్ అప్రయత్నంగా గడియారంకేసి చూసి కంగారు పడ్డాడు.

'నిఖిల్...మళ్ళీ మర్చిపోతాను... పదకొండు గంటలకి ప్రెస్ క్లబ్‌కి వెళ్ళు. అక్కడ వాచ్ ఫ్యాక్టరీవాళ్ళ కారు ఉంటుంది. ప్రెస్ పార్టీకి ఈ రోజు ఫ్యాక్టరీ చూపిస్తారట. రేపే ఆ ఫ్యాక్టరీ ఇనాగరేషన్. మంచి వార్త రాయాలి. ప్రవీణ్‌వస్తే కూడా తీసుకువెళ్ళు. ఫొటోఉంటే వార్తకి అందం వస్తుంది"-తన పనిని ముగించాడు అమరేందర్.

"వస్తాసార్..." అని లేవబోతున్న నిఖిల్‌ని ఏదో గుర్తుకొచ్చిన వాడిలా "ఆగాగు" అని కూర్చోమన్నాడు అమరేందర్.

"అసలు విషయమే మర్చిపోయాను. సౌమ్య అంటూ ఎవరో అమ్మాయిని రిపోర్టులో ఇరికించావ్...ఎవరా సౌమ్య?"-అమరేందర్ అడిగాడు. "నిన్న తప్పిపోయిందంటూ టీవీలో చూపించారు." నిఖిలేష్ చెప్పాడు.

"రేప్ చేయబడి మర్డరయిన అమ్మాయికీ, సౌమ్యకూ సంబంధం ఏమిటి?" "మర్డరయిన అమ్మాయి డెడ్‌బాడీని నేను చూసానుసార్... సౌమ్య ఫోటోనీ చూశాను. సేమ్ ఒక్కలాగే అనిపించింది..."

"వాళ్ళిద్దరూ ఒక్కరే అని చెప్పడానికి సాక్ష్యం ఉందా...?"

నిఖిలేష్ మౌనం వహించాడు.

"సాక్ష్యం లేకుండా అలా ఊహించి రాసేస్తే మన పత్రిక పరువేం కావాలి? ఇలాంటి సందేహాలు ఎదురైనపుడు మనం సంఘటనను మాత్రంరాసి ఊరుకోవాలి. సరైన సాక్ష్యం, ఆధారంలేకుండా సౌమ్య అనే అమ్మాయిని వార్తలోకి లాగావు. ఇపుడా అమ్మాయేవచ్చి ఏంఇలా రాశారు? మీ ఇష్టం వచ్చినట్లు రాయడమేనా? అనడిగిందనుకో... ఏం చేస్తావయ్యా..?" అమరేందర్ నిఖిలేష్‌ని నిలదీశాడు.

ఆ ప్రశ్నలకు నిఖిలేష్ సుమారు గంటసేపు వివరణ ఇచ్చాడు. ఆ వివరణకు అమరేందర్ ఏమాత్రం తృప్తి పడలేదు.

"ఒకవేళ రేప్ చేయబడిన అమ్మాయి...సౌమ్య ఒకరేకాకపోతే మనం సవరణ ఇవ్వాలి. వార్త అంతా బాగా రాశావ్... కానీ చివర్లో ఈలింకు పెట్టావ్. ఆ కేసు నువ్వే ఫాలోఅప్ చెయ్యి. పోలీసులని కనుక్కొని వాళ్ళ సమాచారం, నువ్వు సేకరించిన వివరాలుకలిపి ఓవార్త రాయాలి. గుర్తుంచుకో..మళ్ళీ మర్చిపోతావేమో... సాయంత్రం కలిసినపుడు ఈ విషయం గుర్తు చెయ్యి" మస్ట్ అన్నట్లు చూశాడు అమరేందర్

"టైమ్ అవుతోంది సార్"-గుర్తు చేశాడు నిఖిలేష్.

"యస్... బయలుదేరు. వాచ్ ఫ్యాక్టరీ రిపోర్టు వచ్చిన వెంటనే డస్కుకి పంపించు. ఆ తర్వాతే నీ సౌమ్య కేసు ఓ.కే"-అమరేందర్ వెళ్ళమన్నట్లుగా చూశాడు.

నిఖిలేష్ బయలుదేరాడు, ఫొటోగ్రాఫర్ ప్రవీణ్‌తో సహా. ప్రెస్‌క్లబ్ ముందు బైక్ ఆగే సరికి పదకొండు దాటింది.

ప్రెస్‌క్లబ్ బయట ఒక మెటాడోర్ వేన్ ఉంది.

మోటార్ బైక్ పార్కుచేసిన నిఖిల్‌కి బ్లూడైమండ్ బార్ దగ్గర్నుంచి ప్రెస్‌క్లబ్ మెట్లదాకా జనం కనిపించారు.

ప్రెస్‌క్లబ్ కింద ఉన్న బ్లూడైమండ్‌బార్ పాన్‌షాపుల దగ్గర ఎవరెవరో ఉన్నారు. అంతమంది ఎందుకొచ్చినట్లు? అర్థం కానట్లు చూశాడు. ప్రవీణ్ వైపు.

ఇంచుమించు అదే స్థితిలో ఉన్నాడు ప్రవీణ్ కూడా! "మీ గురించే చూస్తున్నా నిఖిల్. "నిజం" రాకపోతే ఎలా?" అదోలా మొఖం పెట్టినవ్వడానికి



ప్రయత్నిస్తున్నాడు వాచ్ ఫ్యాక్టరీ పౌరసంబంధాల అధికారి లూథర్

"ఎవరీ జనం"? నిఖిలేష్ అడిగాడు.

"అదే నాకూ అర్థం కావడంలేదు. మీరు పదండి" అంటూ వేన్‌లోకి ఆహ్వానించాడు.

జనంలో కదలిక వచ్చింది. నిఖిల్‌ని కాలు కూడా కదపనీయకుండా ఆ జనం తోసుకొంటూ వేన్‌మీదకు దూసుకువచ్చారు.

పట్టిన వాళ్లు పట్టగా మిగిలిన వాళ్ళంతా "మే మెలా?" అంటూ పి.ఆర్.వో. లూథర్‌ని నిలదీశారు.

లూథర్‌కి చెమటలు పోస్తున్నాయి. తన కంపెనీ వేన్ ఇరవై అయిదు మందికి చోటు ఇవ్వడానికే ఇరుక్కుంటుంది. ఈ జనం సంఖ్య డెబ్భైఅయిదు దాటింది. ఏమి చెయ్యడానికీ పాలుపోవడం లేదు. ఇక గత్యంతరంలేక "సార్ మేము పిలిచింది ఇరవైమందినే. ఇంతమంది వస్తారనుకోలేదు" అమాయకంగా అన్నాడు.

అంతే వ్యాన్‌లోకి తోసుకొని ఎక్కినవాళ్ళు మళ్ళీ గెంటుకొంటూ దిగిపోయారు.

"అందర్నీ తీసుకొని వెళ్ళాల్సిందే-"! "లేకుంటే "బాయ్‌కాట్" అని తేల్చేశారు.

లూథర్ తల తిరిగింది. కళ్ళముందు తన కంపెనీ ఉన్నతాధికారులంతా కనిపించారు. ఫ్యాక్టరీ పబ్లిసిటీ కోసం వాళ్ళు చూసే ఎదురుచూపులు వాడిబాణాల్లా లూథర్‌కి తగిలాయి.

''సారీ... సారీ...'' అంటూ ప్రతీ ఒక్కరి చెయ్యీ పట్టుకొంటూ బ్రతిమాలుతున్నాడు.

''ఒక్కక్షణం'' అంటూ ప్రెస్‌క్లబ్ మేడమీదకి పరిగెత్తాడు. అక్కడి పబ్లిక్ టెలిఫోన్ చెడిపోయిందంటూ అదే పరుగుతో దిగివచ్చి ఆయాసపడుతూ బషీర్‌బాగ్ సెంటర్‌కేసి లంఘించుకొన్నాడు.

అరగంట తర్వాత ఆరుటాక్సీలు, ఓ వేన్ మోస్తూండగా పత్రికా ప్రతినిధుల బృందం కదిలింది.

ఆ మర్నాడే వాచ్‌ఫ్యాక్టరీకి కేంద్రమంత్రి ప్రారంభోత్సవం చెయ్యాల్సి ఉంది. ముందుగా పాత్రికేయులకు ఆ ఫ్యాక్టరీ చూపించి ఓ వార్త రాయించుకోవాలనే తాపత్రయంతో ఆ ప్రయత్నం చేశాడు.

''టైమ్... ఎంత?''

''టైమ్ క్యాహువా?''

''వాట్ ఈజ్ ద టైమ్''

''ఏవండీ... మీకు వాచీ ఉందా...?''

''కొంచెం టైమ్ ఎంతయిందో చెబుతారా-?''

వేన్‌లో కూర్చొన్న వాళ్ళలో పది మందికి పైగా విసిగించేస్తున్నారు.

''టైమ్ పన్నెండున్నర'' అని అరచిచెబుదామనుకొంటుండగా వాహనాలు ఫ్యాక్టరీ ఆవరణలోకి ప్రవేశించడం, వీక్షణకు ప్రతినిధుల బృందం సిద్ధంకావడం జరిగిపోయాయి.

తెచ్చిపెట్టుకొన్న తప్పనిసరి నవ్వుతో అందర్నీ ఆహ్వానిస్తున్నాడు లూథర్. ఉన్నతాధికారులు ఈ బృందంతో సహా కదులుతున్నారు.

ఒక మూలగా పి.ఆర్.వో లూథర్ ఆ పక్కనే ఉన్న నిఖిల్‌కి వాళ్ళెవరో అర్థం కావడంలేదు. పది మందిని మాత్రమే గుర్తుపట్టగలుగుతున్నాడు. మిగతా వాళ్ళెవ్వరు?

ఈ విషయాన్ని ఆ బృందంలోనే వెనగ్గా నడుస్తున్న ప్రముఖ దినపత్రికల సీనియర్ ప్రతినిధులే చెప్పలేకపోతున్నారు.

పి.ఆర్.వో.లూథర్ ఆ బృందాన్ని తప్పించుకొంటూ నిఖిలేష్ పక్కకి చేరాడు.

''ఈ రోజు రేప్ అండ్ మర్డర్ రిపోర్టింగ్ చేసింది ఎవరు?'' లూథర్ చాలా కేజువల్‌గా అడిగాడు.



నిఖిల్ మటుకు అనుమానంగా లూథర్‌కేసి చూశాడు.

''ఏం... ఎందుకు...?'' అడిగాడు. ''బాగారాశారు... సౌమ్య... అది నిజమేనా?... ఎవరో ఏ రియల్లీ వెరీగుడ్ న్యూస్'' లూథర్ ప్రశంసించాడు.

''నేనే రాశానని అనుకోండి... విషయం ఏమిటి...?'' నిఖిల్ గొంతు మారింది.

''మీరేనా... ఎక్సలెంట్... మీతో కొంచెం మాట్లాడాలి. ఎప్పుడు ఫ్రీగా ఉంటారు''

లూథర్ మాటలు నిఖిల్‌లో అనుమానాల్ని రెచ్చగొడుతున్నాయ్.

''మీరెప్పుడంటే అప్పుడే'' నిఖిల్ జాగ్రత్తపడ్డాడు.

''నేనే మీకు ఫోన్ చేస్తాను. సారీ. ఏవనుకోకండి. కొంచెం పనుంది'' అంటూ ముందుకు సాగిపోతున్న లూథర్ ఓ ప్రశ్నగా మారాడు.

లూథర్ సౌమ్య అని అంతకేజువల్‌గా ఎలా అన్నాడు?

ఆ సౌమ్య లూథర్‌కి తెలుసా?

ఈ రిపోర్టు గురించి అంత ఆసక్తి ఎందుకు చూపిస్తున్నాడు?

తనతో అతనికి పనేమిటి?

ఏం మాట్లాడతాడు?

ఈ ప్రశ్నల మధ్య వాచ్ ఫ్యాక్టరీలో గంటసేపు గడిచింది. శీతాకాలమైనా ఎండమాడ్చేస్తోంది. ఫ్యాక్టరీ వీక్షణ పూర్తి చేసిన బృందం తిరిగి వచ్చింది. కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ గదిలో అంతమందికి కూర్చోవడానికి కుర్చీలు లేకపోవడంతో నిలబడే 'చా' అందుకొని తాగేస్తున్నారు.

లూథర్‌కి ఆ దృశ్యం ఆశ్చర్యకరంగా ఉంది.

అతను ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జర్నలిజం ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయింతర్వాత ఉద్యోగపు వేటలో ఈ పి.ఆర్.వో. పోస్టు చిక్కించుకొన్నాడు.

''తెల్లకాగితాలు ఇస్తారా?''

''పెన్నుంటే ఓ సారి ఇవ్వండి...''

ప్రెస్‌నోట్ ఉందా...?''

పత్రికా ప్రతినిధుల ప్రశ్నలతో వాటిని సమకూర్చడానికి లూథర్ ప్రయత్నిస్తున్నాడు. ఎం.డి. సమావేశం మొదలైంది.

ఓ పదిహేను మంది శ్రద్ధగారాస్తున్నారు ఎం.డి. ప్రసంగంలోని అంశాలను

మిగతా.వాళ్ళు ఎందుకొచ్చామా అన్నట్లు ప్రవర్తిస్తున్నారు. లూథర్ వాళ్ళనే పరిశీలిస్తున్నాడు.

ఈలోగా అంతవరకూ అద్దెకు తెచ్చుకొన్న పెన్నుతో ఒక్క అక్షరం కూడా కాగితం మీద పెట్టని ఓ ప్రతినిధి తన ఎడమచేతి వాచీని తీసేసి జేబులో వేసుకొన్నాడు. వాచ్‌బెల్టు బయటకు రాకుండా నొక్కుకొన్నాడు.

అప్పటికి గాని లూథర్‌కి అర్థం కాలేదు. అంత మంది ఆ ప్రెస్ కాన్ఫరెన్సుకి ఎందుకు వచ్చారనే సంగతి.

పాత్రికేయుల మీదున్న సదభిప్రాయం స్థానంలో అసహ్యం చోటుచేసుకొంటున్నట్లు ఫీలయ్యాడు లూథర్.

ఎం.డి సమావేశం ముగిసింది.

నిఖిల్, ప్రవీణ్.. ఇంకా
కొంత మంది వెంటనే వెళ్ళిపోవాలంటూ కంగారు పెడుతున్నారు.

'రెండవుతోంది లంచ్ లేదా..?'

'లంచ్ లేకపోతే పోయె... గిఫ్ట్ ఇవ్వరా:??'

'రిస్ట్‌వాచ్‌లు ఇస్తామని చెప్పారు కదా...!'

'ఇవ్వరట..!'

"మరి ఈఎండలో ఎందుకు చంపినట్లు..?"

'కార్లో ఇరుక్కొని ఇంత దూరం వచ్చాం...'

"వాచ్ లేకపోతే పోనీ లంచ్ ఇవ్వడేంటి..?"—

పత్రికా ప్రతినిధుల బృందం నుంచి వినపడే ఆ ప్రశ్నలు లూథర్‌కి బాణాల్లా తగిలి బాధిస్తున్నాయి.

సీనియర్ రిపోర్టర్లు ఆ కంపెనీని, ఎం.డి.ని విసుక్కొంటూ జోకులు వేస్తున్నారు. వాళ్ళ చుట్టూ చేరిన కుర్రాళ్ళు తెగ సంబరపడిపోతున్నారు.

టేక్సీలు..వేన్ వచ్చాయి. లూథర్ ఎక్కమన్నట్లు చూశాడు.

వెళ్ళిపోవడానికి కంగారు పడేవాళ్ళు వెంటనే ఎక్కేశారు. మిగతా జనం కదల్లేక కదిలారు.

"క్యా..పి.ఆర్.ఓ హైభాయి? లంచ్ నహీ వాచ్‌న హీ! కమ్‌తోకమ్‌లంచ్ ఎరేంజ్‌కర్ నానా'

విసుక్కొంటూ...తిట్టుకొంటూ విసురుగా వాహనాలు ఎక్కడం ప్రారంభిస్తూ లూథర్‌ని మింగేసేలా చూస్తున్నారు.

గోలగా మాట్లాడుకొంటూ పరస్పరం నానాదుర్భాషలతో మిళితమైన ఆ జనం తీరుని చూస్తూ లూథర్ అవాక్కయిపోయాడు.

వాహనాలు కదులు తున్నాయి. ఓ కారులోంచి లూథర్‌ని ఎవరో పిలిచారు. లూథర్ వెళ్ళాడు.

'లూథర్‌సాబ్..గిఫ్ట్ తర్వాత ఇచ్చేదుంటే నన్ను మర్చిపోకండి. ఇదిగో నా కార్డు'

ఆ టేక్సీ ముందుకు సాగింది. లూథర్ చేతిలో కార్డు మిగిలింది.

'మిలాన్‌ఖాన్' అని రాసి ఉంది. అతనెవరు?

లూథర్ సందేహాన్ని తీరుస్తూ ఆ పేరు కిందే 'సంపూర్ణ స్వాతంత్ర్యం' అని ఉంది. అలాంటి పత్రిక పేరు కనీసం వినలేదు. అటువంటి పత్రికకు ఆహ్వానమే పంపలేదు మరి. ఈ ప్రతినిధి ఎలా వచ్చాడు? లూథర్‌కి పజిల్‌గా మారింది.

'ప్రవీణ్ నేను బన్సీలాల్‌పేట వెళుతున్నాను. నువ్వు ప్రింట్స్ వేస్తూండు. నేను ఓ గంటలో వచ్చి రిపోర్టు ఇస్తాను—'

నిఖిల్ ప్రెస్ క్లబ్ దగ్గర మోటార్‌బైక్‌ని స్టార్టుచేస్తూ చెప్పాడు.

అలాగేనన్నట్లు తలూపాడు ప్రవీణ్. బన్సీలాల్‌పేట పోలీస్‌స్టేషన్‌లో బండి పార్కుచేసి గుమ్మంలో అడుగు పెడుతూ ఆగిపోయాడు నిఖిలేష్.

ఎదురుగా అజయ్!

అజయ్, ఎస్.ఐ. తీవ్రంగా మాట్లాడుకొంటున్నారు. అజయ్ 'కాంతి' దినపత్రికలో రిపోర్టర్. నేరాల వార్తలు రాయడంలో సిద్ధహస్తుడని పేరున్నవాడు. పోలీసులతోనూ, నేరస్థులతోనూ మంచి సంబంధాలున్నాయి. అజయ్ మాట అటు పోలీసులకూ ఇటు నేరస్థులకూ వేదంలాగే ఉంటుంది. ఎప్పుడు ఎక్కడ ఎలా ప్రత్యక్షమవుతాడో ఎవరూ చెప్పలేరు.

'నువ్వెందుకు రాజ్‌కుమార్‌ని అరెస్టు చేశావ్..?' అజయ్ ఎస్.ఐ.ని దబాయిస్తున్నాడు...

"నేనేం చెయ్యన్రా భాయీ. సి.ఐ. అరెస్టు చెయ్యమన్నాడ్రా.. చెయ్యకపోతే ఏడుస్తాడ్రా' ఎస్.ఐ. సర్దుకొంటున్నాడు.

"ఛీ.. నీయవ్వ. ఆడెంతెంత వాటాలు ఇచ్చిందీ మర్చిపోయావా..? నీ ఇంటికి వాడు గొడ్డు చాకిరీ చెయ్యలేదురా. వాటా పెంచాలంటె నాతో చెపితే సరిపోను కదా. నేను వాడికి చెప్పేవాణ్ణి.. ఆడేం చేశాడు. ఏందుకు బొక్కలో వేశావ్.?—చెప్పరా' అజయ్ ఎస్.ఐ.ని ప్రశ్నించేస్తున్నాడు.

''నేను కావాలని అరెస్టు చేసినాన్ర! అడు మరేం చేసిండే..సి.ఐ. చెప్పిండు బొక్కలో వేసిన.' ఎస్.ఐ. వివరిస్తున్నాడు.

'అదంతా పోనీ. ఇవుడాడ్ని వదిలై..లేకపోతే గొడ వలవుతాయ్. ఎఫ్.ఐ.ఆర్. బుక్ చేశావా..?'

అజయ్ ప్రశ్నకు ఎస్.ఐ. లేదని జవాబిచ్చాడు.

ఇద్దరూ కొంచెం దిగారు.

ఆ వ్యవహారం ఓ కొలిక్కి వచ్చే సమయంలో అజయ్ నిఖిల్‌ని చూశాడు. 'రా...కూర్చో' అన్నట్టు సైగచేశాడు.

ఎస్.ఐ.కి నిఖిల్‌ని పరిచయం చేశాడు. ఎస్.ఐ. ముందు కానిస్టేబుల్లాగ అజయ్ ముందుకూర్చొన్న ఆ ఎస్.ఐ. ప్రవర్తిస్తున్నాడనిపించింది.

ఆ సమయంలో నిఖిల్ రావడం అజయ్‌కి చిరాగ్గా ఉంది. నిఖిల్ వాలకం చూసి వెంటనే కదిలేటట్టులేదని నిర్ధారించుకొని 'మై...జానా...'కు ర్రీలోంచి లేస్తూ ఎస్.ఐ.ని అజయ్ అడిగాడు.

'వన్ మినిట్' అని నిఖిలేష్‌కి చెప్పి ఎస్.ఐ. అజయ్‌కూడా గుమ్మంబయటవరకూ వెళ్ళాడు. పది నిమిషాలపాటు జరిగిన వాళ్ళ సంభాషణ లీలగా వినిపిస్తోంది. 'సాయంత్రం హీరా పన్నా దగ్గర కలుద్దాం' అన్నమాట తప్ప మిగతా మాటలు స్పష్టంగా వినిపించలేదు.

పోలీస్‌స్టేషన్‌ముందు ఆగి ఉన్న ఆటోలో వెళ్ళి పోయాడు అజయ్ సింగ్.

ఎస్.ఐ. నిఖిలేష్ దగ్గరకు వస్తూనే 'చాయ్' తెమ్మంటూ కానిస్టేబుల్‌ని కసురుకున్నాడు.

నిఖిల్ తాను వచ్చినపని చెప్పాడు.

'ఆ మిస్సింగ్ కేసా—? ఒక్క నిమిషం'

ఎస్.ఐ. ఎఫ్.ఐ.ఆర్. రిజిస్టర్ తీశాడు.

ఇద్దరి మధ్యా చర్చ మొదలైంది. సౌమ్యకీ, మాన భంగానికి గురయిన ఆ యువతికీ సంబంధం లేదంటున్నాడు ఎస్.ఐ.

'మీరు ఆ శవాన్ని చూశారా?' నిఖిల్ సూటిగా అడిగాడు.

'చూడలేదు. నా అనుభవంతో చెబుతున్నా.. అలా జరగడానికి వీల్లేదు' ఎస్.ఐ. గట్టిగా అన్నా డు.

'ఎందుచేత...?' నిఖిల్ నీరసపడ్డాడన్నట్లుగా ఉందా గొంతు.

'ఇక్కడే లాజిక్ ఉంది. సౌమ్య అనే అమ్మాయి పూనా నుంచి మొన్న మధ్యాహ్నం కోణార్కలో రా వాలి. ఆ అమ్మాయి ఆ ట్రైన్‌ల్లో వచ్చిందా?...రాలే దా...? ఇది ఇప్పటికీ వాళ్ళ బంధువులు క్లియర్‌గా చెప్పలేకపోతున్నారు. వాళ్ళకు సౌమ్య వస్తున్నట్లు నిన్న ఉదయం టెలిగ్రాం అందింది. ఆ టెలిగ్రాం నిజానికి మొన్న ఉదయానికే అందాల్సి ఉంది. బహుశా నిన్న కోణార్కలో వస్తుందేమోనని వాళ్ళ బంధువులు ఎదురు చూశారు. రాలేదు. కంగారు పడ్డారు. పూనా ఫోన్ చేద్దామంటే అక్కడ తెలుసున్న టెలిఫోన్ నంబరు లేదు. వెంటనే రిప్లై టెలిగ్రాం ఇచ్చారు. ఈ లోగా ఎందుకైనా మంచిదని మాకో కంప్లైంటు పారేశారు' ఎస్.ఐ. పూర్తి చేశాడు.

'పూనా నుంచి రిప్లయ్ టెలిగ్రాం వచ్చిందా...?'

నిఖిల్ ప్రశ్నకు తెలీదన్నాడు ఎస్.ఐ.

ఛాయ్' తాగి మళ్ళీ కలుస్తానని చెప్పి బయటకు వస్తూ ఎస్.ఐ. వైపు గిర్రున తిరిగాడు. 'ఆ రాజ్‌కు మార్ ఎవరు?...ఎందుకు అరెస్టుచేశారు?' ఎస్.ఐ. ముఖంలోకి చూస్తూ అడిగాడు నిఖిలేష్.

'వాడో గూండా..గడబిడ చేసిండు. అందుకే అరె స్టు చేసినాం'—ఎస్.ఐ. నవ్వుతున్నాడు:

'ఎప్పుడు..?'—

'నిన్న రాత్రి'..!.

వస్తానన్నట్లుగా చెయ్యి చూపించి వచ్చేశాడు. ఎస్.ఐ. చెప్పిన లాజిక్‌నే ఆలోచిస్తూ నిఖిలేష్‌బైక్ నడుపుతున్నాడు. సౌమ్యకేసుని ఎస్.ఐ. చాలా కేజు వల్‌గా తీసుకున్నాడా?.

రేప్ అయిన అమ్మాయి సౌమ్య కాదా?

ఎలా కాదు?.

ఎస్.ఐ. అరెస్టు చేసిన రాజ్‌కుమార్ గూండా.

అజయ్ వాడ్ని విడిచిపెట్టమని ఎందుకు అడు గుతున్నాడు?.

గూండాకి రిపోర్టర్ అజయ్‌కి సంబంధం ఏమిటి?.

గూండాలను పోలీసులు అరెస్టు చేస్తే రిపోర్టర్ జోక్యం ఎలా కల్పించుకొంటాడు?.

ఈ ప్రశ్నలు వేధిస్తూండగా నాలుగైదు చోట్ల విచారించి సౌమ్య బంధువుల ఇంటికి చేరాడు.

ఆ ఇంటికి తాళం వేసి ఉంది.

నిఖిల్‌కి నిరుత్సాహం ఎదురైంది. తాను పొరపా





# అందం - ఆరోగ్యం

## JEEVANTONE

బల హీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను
అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని,
కండరాలకు
దారుఢ్యాన్ని
ప్రసాదిస్తుంది.

జీవన్‌టోన్ లేబుల్‌ను కంపెనీకి పంపి పెద్ద
బహుమతి టికెట్‌ను పొందండి

ఒక సీసా తాగింతర్వాత
ఇంకా ఎన్ని సీసాలు తాగాలో
మీరే నిర్ణయిం చేసుకోగల్రు

ఆరోగ్యంగా లేకపోతే
రోగాలపాలవుతారు

మంచి ఆరోగ్యం, బలం, శక్తి
పుష్టిగా కండరాలు పొందిన తర్వాత
ఈ మందును ఆపివేయడం మంచిది

Contact our new sole Distributors"

**M/S. New Shakti Pharma,**
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
**Phone: 2866**




450 Grams Rs. 36/-



ఎ.పి.పి.
కొరకు

జీవన్‌టోన్ ప్రాడక్ట్స్
పి.బి.నం. 880,17/2
కెంప్రిడ్డి రోడ్
బెంగుళూర్-560 008

SINDU

టు పడ్డాడా?

మళ్ళీ ఆలోచనలు ముంచెత్తుతున్నాయి. తాను డెడ్‌బాడీని చూశాడు. తప్పిపోయిన సౌమ్య ఫోటో చూశాడు. ఆ రెండు జీవం లేని వస్తువులకీ పోలిక ఉందనేది నిఖిల్ నమ్మకం.

కొంచెం పోలికలు కనిపించినంతమాత్రాన ఆ డెడ్‌బాడీ సౌమ్యది కాదా?. నిఖిల్‌లో అనుమాన బీజాలు తలెత్తుతున్నాయి.

ఆ ఇంటి దగ్గర్లోని కిరాణా దుకాణం యజమానిని కల్సి సౌమ్య బంధువుల వివరాలు అడిగాడు. కిరాణాషాపు యజమాని నిఖిలేష్ వివరాలన్నీ అడిగాడు. 'మీరే 'నిజం'లో రాశారన్నమాట. అదివాళ్ళు ఓ అరగంట కిందటే చూశారు. గాంధీ ఆసుపత్రిలో శవం ఉందట. చూడడానికి వెళ్ళారు. రేప్ చేసింది వీళ్ల చుట్టాల అమ్మాయినేనండీ..? ఊ ఎలా గయిందండీ?.. ఎవరు చేశారంటారు.?'

ఆ షాపువాడు నిఖిల్ మీద సందేహాల వర్షం కురిపిస్తున్నాడు.

'థాంక్స్' అంటూ తన నమ్మకానికి కొత్త ఊపిరిపోసుకొని బండి స్టార్టు చేసి ముందుకురికించాడు నిఖిలేష్.




నిఖిలేష్ 'నిజం' కార్యాలయానికి వచ్చేసరికి సాయంత్రమయింది.

హడావిడిపడుతూ రిపోర్టర్ల గదికి చేరుకున్నాడు.

వాచ్‌ఫేక్టరీ ఫోటో రిపోర్టుకోసం ఎదురుచూస్తోంది.

ఆ రిపోర్టురాసి ఫోటోతోసహా డస్క్‌కి పంపించాడు.

ఆ తర్వాత సౌమ్య కేసులో ఆ రోజు సేకరించిన విషయాలన్నీ వార్తగా రాశాడు.

అమరేందర్‌తో ఆ విషయాన్ని చర్చించడానికి వెళ్ళాడు.

'వాచ్‌ఫ్యాక్టరీ రిపోర్టు డస్కుకి పంపించావా?' అన్న అమరేందర్ ప్రశ్నకు పంపానంటూ తలూపాడు నిఖిలేష్.

టెలిప్రింటర్లమీద జిల్లాలనుంచి వచ్చిన వార్తలను చూస్తున్నాడు. అమరేందర్. తెలుగు పదాలను యధాతథంగా ఇంగ్లీషు టెలిప్రింటర్ల ద్వారా జిల్లాలనుంచి విలేకరులు వార్తలు పంపిస్తూంటారు.

"ఇదేమిటి?" ఓ పదాన్ని చూపిస్తూ నిఖిల్‌ని అడిగాడు అమరేందర్. ఇంగ్లీషులో టైప్ అయిన ఆ తెలుగుపదాన్ని పరిశీలించి 'సింహావలోకనం' అని చదివాడు నిఖిల్.

"జిల్లాలనుంచి వచ్చే వార్తలు ఇంగ్లీషులో ఉంటే మంచిది. ఇలా తెలుగు పదాలను ఇంగ్లీషులో టెలిప్రింటర్‌లో కొట్టిస్తే సబ్‌ఎడిటర్లకి రాసుకోవడం కష్టం'.

'ఏవంటావ్' అన్నట్లు చూశాడు అమరేందర్

'వాళ్ళకది అలవాటే. చాలా స్పీడుగా రాసేస్తారు'- నిఖిల్ అలాంటి సందేహమే వద్దన్నట్లుగా చెప్పాడు.

'నీ రేప్ అండ్ మర్డర్ కేసు ఎంతవరకు వచ్చింది?"

అమరేందర్ అడుగుతూండగానే తన రిపోర్టు తీశాడు నిఖిల్.

'ఏమిటి నీ రిపోర్టంతా చదువుతావా...?' అడిగాడు అమరేందర్.

'మీరువింటే, కొన్ని సందేహాలకు సరైన సమాధానాలు రాయచ్చు'- ఏమంటారు..? అన్నట్లు చూచాడు.

ఇకతప్పేదిలేనట్లుగా ముఖంపెట్టి 'కానీ' అన్నాడు అమరేందర్.

"సామూహిక మానభంగానికిగురై దారుణంగా హత్యచేయబడిన యువతిని సౌమ్యగా నేడు పోలీసులు గుర్తించారు. సౌమ్య శవాన్ని బంధువులు గాంధీ ఆసుపత్రిలోచూసి గుర్తుపట్టారు. సౌమ్య ఈనెల 21వ తేదీన పూనానుంచి హైదరాబాదు రావడానికి బయలుదేరింది. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్‌లో 23వ తేదీన ఆమె ఇంటర్వ్యూకి హాజరుకావాల్సిఉంది. ఇరవైరెండో తారీఖున కోణార్క్ ఎక్స్‌ప్రెస్ సికింద్రాబాద్ స్టేషన్‌కి రాత్రి

ఎనిమిదిగంటలకు చేరింది. సాధారణంగా మధ్యాహ్నం పన్నెండు గంటలకి సికింద్రాబాద్ చేరవలసిన ఆ ఎక్స్‌ప్రెస్ ట్రాక్‌చెడిపోవడంవల్ల ఆలస్యంగా వచ్చింది. ఆ ట్రైన్‌లోనే సౌమ్య రావాల్సిఉంది. కానీ ఆరోజు బన్సీలాల్‌పేటలోని ఆమె బాబాయ్ ఇంటికి చేరలేదు. సౌమ్య 22న కోణార్కులో వస్తుందనే టెలిగ్రాంని నిన్న ఉదయం అందుకొన్నారు సౌమ్య బంధువులు. టెలిగ్రాంలో తారీఖు తప్పుపడి ఉండ వచ్చునని భావిస్తూ సికింద్రాబాద్‌స్టేషన్లో పన్నెండింటివరకూ ఎదురుచూశారు. ట్రైన్ సమయానికేవచ్చినా అందులో సౌమ్యజాడే కనిపించలేదు. కానీ సౌమ్య 21వ తేదీన పూనానుంచి బయలు దేరిందనడానికి ఆధారాలు దొరికాయి. రిజర్వేషన్ ఛార్టులో ఆమె పేరుఉంది. ఈ విషయాన్నే ధ్రువపరుస్తూ పూనానుంచి నగరంలోని సౌమ్య బంధువులకు టెలిగ్రాం అందింది. 'నిజం' దినపత్రికలోని వార్త చూసిన సౌమ్య బంధువులు గాంధీ ఆసుపత్రి మార్చురీకి వెళ్ళారు. దారుణంగా మానభంగానికి గురై హతురాలైన యువతిని సౌమ్యగా గుర్తించారు. రంగారెడ్డిజిల్లా పోలీసులు సౌమ్య హత్యకేసును సిటీ పోలీసులకు బదిలీచేశారు. ప్రస్తుతం ఈ కేసును బన్సీలాల్ పేట పోలీసులు దర్యాప్తు చేయడం ప్రారంభించారు. ఇంతవరకూ నిందితులను గుర్తించలేదని పోలీసులు చెప్పారు. దుండగుల కోసం తీవ్రగాలింపు జరుగుతుందని డిప్యూటీ పోలీస్ కమిషనర్ తెలిపారు'' ముగించాడు నిఖిలేష్. ఓకే అన్నట్లుగా తలాడించి 'నువ్వా డెడ్‌బాడీని చూశావా?' అమరేందర్ అడిగాడు. 'చూశాను. చాలా ఘోరంగాఉంది. ఆమె శరీరంమీద అక్కడా ఇక్కడా అనిచూడకుండా సిగరెట్ వాతలు పెట్టారు. కత్తితో పొడవలేదు. పిస్టల్తో కాల్చలేదు. గొంతుపిసికి చంపలేదు. ఎలా చచ్చిపోయిందో...'

నిఖిల్ ఆలోచనను ఆపుతూ 'సిటీలో అంతదారుణం ఎలా జరిగిందంటావ్. లక్షలమంది ప్రజలు... పోలీసులు ఉండగా ఎలా ఆ అమ్మాయిని ట్రాప్‌చేసి ఉండాలి'?

అమరేందర్ సందేహాల పర్వంలోకి అడుగుపెట్టాడు.

'సికింద్రాబాద్‌స్టేషన్‌దగ్గర ట్రాప్ చెయ్యడానికి వీలుండదు... ఎందుకంటే ట్రైన్ వచ్చినప్పుడు విపరీతమైన జనం ఉంటారు. సౌమ్యకి బన్సీలాల్‌పేటలోని తన బాబాయ్ ఇల్లు బాగాతెలుసు. ఏ ఆటోవాడైనా మోసంచేశాడా అంటే అదీ అంతఈజీకాదు. రాంగ్‌రూట్‌లో వెళితే అరచిగోలచేసి ఆటోని ఆపవచ్చు. హెల్పుఅంటూ అరిస్తే ఆటోని జనం ఆపుతారు. అన్నీ మెయిన్‌రోడ్లేగాసార్. ఇదేదో పథకం ప్రకారం ట్రాప్‌చేసినట్లు అనిపిస్తోంది!'' నిఖిల్ ఆలోచనకు రూపం ఇచ్చాడు.

'భలేవాడివి. ఓ అమ్మాయి కోణార్క ఎక్స్‌ప్రెస్‌లో వస్తుందని...అందులోనూ లేటయిన ఆ ట్రైన్‌లో దిగుతుందని ఊహించి పథకాలు సిద్ధం చేస్తారా...? ''

నిఖిల్‌ని అమరేందర్ ప్రశ్న అడ్డుకొంది.

మౌనంగా చూస్తున్నాడు నిఖిలేష్.

'సరే వార్త డెస్క్‌కి పంపించు' అమరేందర్ అన్నాడు.

'సార్...మీకు ఫోన్...' ఆఫీస్‌బోయ్ చెప్పాడు. వెంటనే నిఖిలేష్ రిపోర్టర్స్‌రూంవైపు పరుగులాంటి నడకసాగించాడు.

'హలో...ఎవరూ...?' 'నిఖిలేషా మాట్లాడేది...?'

'యా!నిఖిలేష్ స్పీకింగ్'

'అజయ్‌ని మాట్లాడుతున్నా నిఖిలేష్...'

'ఓ అజయ్...ఏమిటీ...?

'ఆ కేసు వివరాలన్నీ ఎస్.ఐ. చెప్పాడా...?' అజయ్ అడిగాడు.

'ఆ... చెప్పాడు.'

'రాజ్ కుమార్ చాలా మంచివాడు. వాడికీ ఆ కొట్లాటకీ సంబంధంలేదు' అజయ్ అంటున్నాడు

'ఏ రాజ్‌కుమార్... కొట్లాట ఏమిటి?' నిఖిలేష్ ప్రశ్నించాడు.

'మరి ఇంకేం చెప్పాడన్నావయ్యా... భలేవాడివే! నేను మాట్లాడేది ఆ ఎస్.ఐ. అరెస్టుచేసిన రాజకీయ నాయకుడి గురించి. అర్థంకాలేదా?? అజయ్ అన్నాడు.

'నువ్వు ఎవణ్ణయినా రాజకీయనాయకుణ్ణి చేసేస్తావే... ఆ రాజ్‌కుమార్‌ని పోలీసులే గూండా అని చెబుతున్నారు కదయ్యా' నిలదీశాడు నిఖిలేష్.

'వాళ్ళేమంటే మనకేవిటీ... మనకు కావలసింది వార్త.'

'సరే... ఇప్పుడు ఏమయింది?'

'అసలు వాణ్ణి అనవసరంగా అరెస్ట్ చేశార

య్యా... ఏదో చిన్నగొడవ జరిగింది. అప్పుడు రాజ్‌కుమార్ అక్కడ లేనే లేడు. అయినా పోలీసులు బలవంతంగా వాణ్ణి అరెస్ట్‌చేసి కారణమైనా చెప్పకుండా బొక్కలో వేసేశారు. వాడికో క్రిమినల్‌లాయర్ జోగేంద్ర అనేఫ్రండ్ ఉన్నాడులే. ఆ క్రిమినల్‌లాయర్ పోలీసుల్ని 'అక్రమంగా ఎందుకు అరెస్ట్‌చేశారని' వాయించి రాజ్‌కుమార్‌ను విడుదలచేయించాడు. రాజ్‌కుమార్ రేపట్నుంచి బన్సీలాల్‌పేట పోలీస్‌స్టేషన్ ముందే నిరాహారదీక్ష చేస్తాడట. మంచివార్త. నువ్వు రాయాలి...'

అజయ్ విషయమంతా చెప్పాడు.

"సరే చూస్తా"నని చెబుతూతప్పించుకొన్నాడు నిఖిలేష్.

ఇలా వివిధ పత్రికల్లో పనిచేసే క్రైంరిపోర్టర్లు ఒకరికి మరొకరు వార్తలందించుకోవడం మామూలే అయినా ఆ వార్త మాత్రం రాయకూడదనే నిశ్చయించుకున్నాడు నిఖిలేష్.

'ఏదైనా వార్తా? అడిగాడు ప్రవీణ్.

అజయ్ చెప్పినదంతా నిఖిల్ వివరించాడు.

'రాజకీయ నాయకుడంటున్నాడుగా... పోలీస్‌స్టేషన్ ముందు నిరాహారదీక్ష.ఫొటో తీసి మంచివార్త రాయొచ్చుగా...' ప్రవీణ్ సహజధోరణిలో అన్నాడు.

'నిజంగా రాజకీయనాయకుడైతే మంచివార్తే... కాని, ఆ రాజ్‌కుమార్... ఓ గూండా... వాడికీ...



అజయ్‌కీ... ఎస్.ఐ.కి ఏం సంబంధముందో అర్థంకావడంలేదు...' ఫోటోగ్రాఫర్ ప్రవీణ్‌ను చూస్తూ అన్నాడు నిఖిలేష్.

'నువ్వు ఏమంటావో అని సరదాగా అన్నాను కానీ రాజ్‌కుమార్... అజయ్‌ల గురించి తెలియక కాదు నిఖిల్' ప్రవీణ్ సర్దుకున్నాడు.

'ఏమిటీ వాళ్ళ సంబంధం... ??' నిఖిలేష్ సూటిగా అడిగాడు.

'ఏవుందీ.. అజయ్ క్రైం రిపోర్టర్... రాజ్‌కుమార్ క్రిమినల్... ఎస్.ఐ.లూ పోలీసులూ వీళ్ళను ఆదుకొంటూంటారు' ప్రవీణ్ ఆగాడు.

'ఎలా ? ?' ప్రశ్నించడం నిఖిల్ వంతయింది.

ప్రవీణ్ చెప్పసాగాడు.

"జంటనగరాల్లో రాజ్‌కుమార్‌లాంటి ఆరితేరిన గూండాలు వందకు పైగా ఉన్నారు. వాళ్ళు మకుటంలేని మహారాజుల్లా కాలం గడుపుతూంటారు... సనత్‌నగర్ నుంచి పంజగుట్ట, పంజగుట్ట నుంచి లక్డీకాపూల్, అబిడ్స్, కోఠీ, సికింద్రాబాద్ రైల్వేస్టేషన్, మార్కెట్స్ ఇలా ఏరియాల కింద రాజధానీనగరాన్ని విడగొట్టుకున్నారు...

ఆ ప్రాంతాల్లో చిన్న చిన్న దొంగతనాలు, బెదిరింపు, రౌడీయిజం కార్యక్రమాలకు అధిపతులు వీళ్ళు...
ఈ మహారాజుల కింద సామంతులుంటారు. వాళ్ళ డైలీ డ్యూటీ చిల్లర దొంగతనాలు...

ఆ డ్యూటీ సక్రమంగా సాగడానికి పోలీసుల అండదండలు పుష్కలంగా ఉంటాయి...

అందుకోసం పోలీసులకు వాటాలుంటాయి...

వాటాలిచ్చేస్తే సరిపోదుకదా! అపుడపుడు కేసులు కూడా రికార్డుల్లో చూపించాలి. అందుకని పోలీసులు కోరినపుడల్లా ఈ గూండాలూ, చిన్న దొంగలూ రికార్డుల్లోకి ఎక్కేస్తారు...

పోలీసులు అరెస్టులు, హుంకారాలు, హడావుడీ చెయ్యడానికి ఏర్పాట్లు వీళ్ళే చేస్తారు...

పోలీసులు అవన్నీ చూస్తున్నారని జనానికి తెలియడానికి పబ్లిసిటీ రావడానికి అజయ్‌లాంటి 'క్రైం' రిపోర్టర్లు ఉపయోగపడతారు...

గూండాలకు, దోపిడీగాళ్ళకూ, పోలీసులకూ మధ్య వారధిలా ఉంటూ ఇరువర్గాల మీదా కలంపోట్లు పొడుస్తూ వాళ్ళను దారికి తెచ్చుకుంటూ అజయ్‌లాంటివాళ్ళు తమ వాటాలను కాపాడుకుంటారు...

ఏరియాల వారీగా పోలీస్‌స్టేషన్లకు వాటాలిస్తారు. ఆ వాటాల్లో గొడవలొచ్చి పోలీసులు ఎదురుతిరిగితే ఆదుకోవడానికి అజయ్‌లాంటివాళ్లను ఈ గూండాలు చేరదీస్తారు...

పోలీసులతోపాటు వీళ్ళకూ నెలకో కవరు పారేస్తారు. కవర్‌లో ఎంత ఉంటుందనేది ఆ క్రైం రిపోర్టర్ సమర్థత మీద ఆధారపడిఉంటుంది."

"ఛీ... ఛీ... ఇంతనీచానికి దిగజారారా ???" నిఖిలేష్ నొచ్చుకున్నాడు.

'నేను చెప్పింది కొంచెమే. ఇంకా చరిత్ర ఉంది. అదంతా ఇప్పుడెందుకు గానీ రేపటి ఎసైన్‌మెంట్స్ చూడు... పోదాం' అంటూ ప్రవీణ్ డైలీ ఎసైన్‌మెంట్స్ రిజిస్టర్ అందించాడు.

ఆ మర్నాడు హోంమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్సు! నిఖిలేష్‌కే ఆ డ్యూటీ పడింది.

నిఖిల్‌లో ఉత్సాహం ఉరకలు వేసింది. సౌమ్య రేప్ అండ్ మర్డర్ విషయాన్ని ప్రెస్‌కాన్ఫరెన్స్‌లో లేవనెత్తడానికి నిర్ణయించుకొన్నాడు. ఈ కేసు విషయంలో తలెత్తిన అనుమానాలను హోంమంత్రి ముందుంచి నిలదీయాలి అనుకొన్నాడు.

'పదయింది... నడు పోదాం' అంటూ నిఖిలేష్‌ను ఆవేశమేఘం కప్పుకుండా కదిలించాడు ఫోటోగ్రాఫర్ ప్రవీణ్.

★ ★ ★

నిఖిలేష్ శ్రీనగర్‌కాలనీలోని తనగదికి చేరేసరికి పదిన్నర దాటింది.

మోటార్‌సైకిల్ పార్క్‌చేస్తుండగా పలుకరించాడు శ్రీధర్. నిఖిలేష్ గది పక్కనే ఉన్న వాటాలో శ్రీధర్ అద్దెకు ఉంటున్నాడు.

శ్రీధర్ తన వాటా కెదురుగా రెండు కుర్చీలు వేసి నిఖిలేష్‌ను కూర్చోమంటూ తనూ కూర్చున్నాడు.

"నిఖిలేష్‌గారూ... రేపు ఖాళీయేనా... ఎందుకంటె మీరు నాకో సహాయం చెయ్యాలి"

శ్రీధర్ మాటల మధ్యలో అన్నాడు.

"రేపు హోంమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్స్ ఉంది... నాకు వీలుపడదేమో" సందేహంగా అంటూ శ్రీధర్ కేసి చూశాడు.




"ప్రెస్‌కాన్ఫరెన్సులు అంత ముఖ్యమ ... అసలు రోజూ ఈ ప్రెస్ కాన్ఫరెన్సులు ఎందుకుంటాయ్... ఏమిటివి?" శ్రీధర్ అడిగాడు

"ప్రభుత్వ ప్రతినిధులు చెప్పే విషయాలు పాఠకులకు అందించాలిగా..."

"అంతే?"

"పాత్రికేయులే ప్రజలకూ ప్రభుత్వానికి వారధి లాంటివాళ్ళు. ప్రభుత్వ కార్యక్రమాలు... పథకాలు... ప్రణాళికలు... ప్రజలకు అందించాలి. ప్రజల కష్ట సుఖాలు... విమర్శలూ, అభిప్రాయాలు సేకరించి ప్రభుత్వ దృష్టికి తీసుకురావాలి. అందుకే ప్రభుత్వం తరపున మంత్రులు, ఉన్నతాధికారులుపత్రికల వాళ్ళను పిలిచి తమ కార్యక్రమాల గురించి చెబుతుంటారు. ఒకోసారి ప్రతిపక్షనాయకులు... వివిధ పార్టీల కార్యదర్శులూ... పెద్ద సంస్థల అధికార్లూ ఇలా ఎందరో పత్రికల వాళ్ళను పిలిచి ముఖ్యమైన విషయాలు ప్రజలకు అందించడానికి సమావేశాలు పెడతారు. కొన్ని సందర్భాల్లో పత్రికల కార్యాలయాలకు ప్రెస్‌నోట్స్ పంపిస్తారు" నిఖిలేష్ వివరించాడు.

"ఈ ప్రెస్ కాన్ఫరెన్సులెందుకండి...? ప్రెస్‌నోట్ పంపిస్తే చాలు కదా-?" శ్రీధర్ అడిగాడు.

"పత్రికాసమావేశం పెడితే ప్రజల తరపున పాత్రికేయులు అడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పవచ్చుగదా... ప్రెస్‌నోట్ అంటే ఓ ప్రకటన అవుతుంది. పత్రికా సమావేశం అంటే ఎన్నో సందేహాలను తీర్చవలసి ఉంటుంది"

"ఎవరైనా ప్రెస్‌కాన్ఫరెన్సు పెట్టవచ్చా?"

"ఎవరైనా పత్రికాప్రతినిధులను కలవచ్చు... పిలవచ్చు. అయితే వాళ్ళు చెప్పిన వార్తకు ఉన్న విలువను బట్టి ప్రచురణచెయ్యాలా వద్దా ఆలోచిస్తాం" నిఖిలేష్ చెప్పాడు.

"ఏంలేదు నిఖిలేష్‌గారూ... ఎలాగోలా మేనేజ్ చేసి మా ఆఫీసర్ని ట్రాన్స్‌ఫర్‌చేయించాలి. ఏవో కొన్ని ఆరోపణలు మేం రాసి ఇస్తాం... ఓ వార్త రాయండి. దాంతో వాడి న్యూసెన్సు వదిలిపోతుంది. ప్లీజ్ ఈ విషయంలో హెల్పు చెయ్యండి" అసలు విషయం బయటపెట్టాడు శ్రీధర్.

"జర్నలిస్టులు అంత చులకనగా కనిపిస్తున్నారా?" నిఖిలేష్ నిలదీశాడు.

శ్రీధర్ నొచ్చుకుని కోపం తెచ్చుకుని "ఏవిటండీ... ఎపుడూ జర్నలిజం గురించి అంతగొప్పగా చెబుతారు. ఏమిటా గొప్ప?" అని అడిగాడు.

"మీరు ఓపిగ్గా వినండి" అంటూ నిఖిలేష్ మొదలుపెట్టాడు. "ప్రజాస్వామ్యవ్యవస్థలో న్యాయ వ్యవస్థ, పార్లమెంటరీ వ్యవస్థ అధికారయంత్రాంగాన్ని ఏర్పాటుచేసి రాజ్యాంగబద్ధంగా వాటికి హక్కులు కల్పించారు. అలాగే ఎన్నో బాధ్యతలూ అప్పగించారు. ప్రజల శ్రేయస్సుకోసం, సమాజాభివృద్ధి కోసం ఆ వ్యవస్థలు అహర్నిశలూ కృషిచేసే బాధ్యతను నిర్వర్తిస్తున్నాయి. నిర్వర్తించాలి కూడా. వాటి తర్వాత నాలుగో స్థానం ప్రెస్‌ది. దాన్నే ఫోర్తుఎస్టేట్ అంటారు. ప్రెస్ అంటే పత్రికలు... పాత్రికేయులు. ప్రెస్‌కీ హక్కులున్నాయి. బాధ్యతలున్నాయి. సమాజశ్రేయస్సునూ, ప్రజాసంక్షేమాన్ని కాపాడే బాధ్యత పాత్రికేయుల మీద ఉంది. నిజానిజాలు తెలుసుకోకుండా ఎవరి స్వార్థంకోసమో స్వలాభాన్ని ఆపేక్షిస్తూ వార్తలు రాసే హక్కు పాత్రికేయులకు లేదు. పాత్రికేయులకు సమాజపరంగా, రాజ్యాంగరీత్యా సంఘంలో మంచిస్థానం ఉంది శ్రీధర్‌గారూ... దాన్ని మీరు చెప్పిన వార్త రాసి పాడుచేయలేను. సారీ" ముగించాడు నిఖిలేష్.

'అంతేనంటారా...?' ఇక లాభం లేదా అన్నట్లడిగాడు శ్రీధర్.

'అంతే...!!' అని నిఖిలేష్ లేచాడు.

★ ★ ★

రాజధానీ నగరంలోని రోడ్లన్నీ హడావిడిపడుతున్నాయి.

ఉదయం పదిన్నర దాటుతోంది. ప్రధాన రోడ్లు అలవికాని ట్రాఫిక్‌ని భారంగా మోస్తున్నాయి.

ట్రాఫిక్‌ని తప్పించుకొంటూ ఎలాగోలా గమ్యాన్ని చేరడానికి రోజుచేసే ప్రయత్నంలో ప్రజలు పరుగులెడుతున్నారు.

బస్సులు, ఆటోలు, స్కూటర్ల స్పీడు బారినుంచి తన మోటార్ సైకిల్‌నీ, తననూ కాపాడుకుంటూ అసెంబ్లీ రోడ్డుమీదకొచ్చాడు నిఖిలేష్.

రద్దీతో అవస్థపడే ఆ రోడ్డులో అసెంబ్లీ ఎదురుగా నిఖిల్ బైక్ ఆగిపోయింది. ఈ బండి రోడ్డుమధ్య ఆగిపోవడం వెనకే వస్తున్న వాహనాల వాళ్లకి చిరాకు కలిగించింది. 'పక్కకు తియ్యవేం-?' అన్నట్లు చూస్తూ తప్పించుకొని పోతున్నారు. కష్టపడి

రోడ్డు పక్కకు బైక్‌ని ఈడ్చాడు.

రెండు టైర్లూ బాగానే ఉన్నాయి. పెట్రోలు చూశాడు. రెండు లీటర్లకుపైగా ఉంది. ప్లగ్ కదిపాడు. బాగానే ఉంది. ఇంజను ఎందుకు ఆగిందో అర్థంకాలేదు. టైంచూస్తే అయిదు నిమిషాలే ఉంది. హోంమంత్రి ప్రెస్ కాన్ఫరెన్సు మిస్ కావడానికి వీలులేదు.

అసెంబ్లీకి ఎదురుగా ఉన్న ఆకాశవాణి భవనంలో మోటార్‌సైకిల్‌పెట్టి ఆటోలో వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాడు.

బండికి స్టాండు తీస్తుండగా 'హలో..నిఖిల్...' అంటూ భారతి కంఠం వినిపించింది.

"బైక్ పాడయిందా...?" తన స్కూటర్ ఇంజను ఆపుతూ పలకరించింది. 'ఏదో ట్రబుల్...' భారతికేసి చూశాడు నిఖిలేష్.

'సెక్రటేరియట్‌కా—?' కళ్ళకు అలంకారంగాఉన్న కళ్ళజోడుతీస్తూ భారతి అడిగింది.

'అవును- ఈ బండి ఆకాశవాణిలో పెట్టివస్తాఉంటారా...?'—కంగారుగా ఉంది నిఖిలేష్ మాటలతీరు.

'అంతకన్నానా—!' భారతి ఆనందంగా రిప్లై ఇచ్చింది.

ఆకాశవాణి భవనంలో బండి పార్కుచేసి వచ్చిన నిఖిల్‌కి స్కూటర్ఇచ్చి తాను వెనకసీట్లో కూర్చొంది భారతి.

సెక్రటేరియట్‌లోని ప్రెస్ రూం దగ్గర భారతినీ, స్కూటర్నీ వదిలేసి పెద్దపెద్ద అంగలేసుకొంటూ హోం మినిస్టర్ ఛాంబర్‌వైపు నడిచాడు నిఖిలేష్.

అప్పటికే పదినిమిషాలు లేటయింది. మినిస్టర్ ఛాంబర్ నిండిఉంది. చివరివరసలో మూలగా కూర్చొన్నాడు నిఖిల్.

'ఇంకా మొదలు కాలేదా—?' పక్కనేఉన్న ఓ దినపత్రిక చీఫ్ రిపోర్టర్ని అడిగాడు.

'అయిపోయి అయిదు నిమిషాలయింది'-అని చెబుతూ తన దగ్గర అదనంగా ఉన్న ప్రెస్‌నోట్ కాగితాన్ని అందించాడు.

'మరింకా కూర్చున్నారెందుకు?' అనుమానంగా అన్నాడు.

'నేను వెళ్ళిపోదామనే అనుకొంటున్నామరి అంతా కదలాలిగా'—అంటూ ఎదర జనాన్ని చూశాడు చీఫ్ రిపోర్టర్.

'ఏదో చర్చ జరుగుతోందనుకొంటాను...' మరోవైపున్న రిపోర్టర్ని అడిగాడు.

'వినరాదయ్యా'-నవ్వుతూ కసిరిన అభినయం చేశాడా రిపోర్టర్. ఆ చర్చవేపు చెవులు రిక్కించాడు నిఖిలేష్.

'గుమ్మడికాయ పులుసు ఉండాల్సిందే సార్' ఎవరో సలహా ఇస్తున్నారు.

'కృష్ణమూర్తీ గుమ్మడికాయ పులుసట-రానుకొన్నావా?' హోంమంత్రి.

'సార్—' పి.ఎ. బదులిచ్చాడు.

'ఛ... గుమ్మడికాయ పులుసుంటే మందుఎక్కడయ్యా... అది చాలావేడి...కుర్రకారు మీకు తెలీదు. నామాట వినండి'- ఓ ముసలాయన సణిగాడు.

"గురూగారూ మీరూరుకోండి—" ఓ కుర్ర రిపోర్టర్ ఎగిరాడు.

'ఇంతకూ పార్టీ ఎప్పుడిస్తున్నారు. ఇదివరకొకసారి ఇలాగే ఇస్తానన్నారు. మళ్ళీ ఇదే మిమ్మల్ని కలవడం'— మరోమూలనుంచి ప్రశ్న.

'ఇంతకుముందు పార్టీకి అంతా సిద్ధంచేశాను. మనవాళ్లలో కొంతమందికి ఇన్విటేషన్లు అందలేదన్నారు. అందుకే రద్దుచేయాల్సి వచ్చింది. ఇపుడు నేను 'హోస్టు'ని మాత్రమే. పిలిచేది మీరే. మీలో ఎవర్ని పిలవాలో ఎంతమందిని పిలుస్తారో అది మీకే వదిలేస్తున్నాను. ఏమంటారు?' హోంమంత్రి అందర్నీ పరికించాడు.

"మెనూలిస్ట్ అయిపోయిందా.... ఇంకా ఏదయినా చెబుతారా...?' మొదటి వరసలోంచి అడుగుతున్నారు.

'హే... ఎవరయ్యా మీరు. తిండేనా... ఎంత సేపూ—' మరెవరో కసురుకొన్నారు.

'జానీవాకర్' ఆనందంగా తలాడిస్తున్నాడో యువరిపోర్టర్.

"హాట్ అందరూ తాగరు. కొన్ని బీరకాయలు కూడా పెట్టించాలి" అందుకొన్నాడు అంతవరకు మౌనంగా కూర్చున్న ముసలాయన.

"ఇదేం చర్చండీ... ఇకమేం పోతాం. ప్రెస్‌కాన్ఫరెన్స్ అని పిలిచి డిన్నర్‌కీ, డ్రింక్‌కీ మెనూ తయారు చేస్తున్నారు. ఇది బాగోలేదు. ఇంకా ఏదైనా వార్త ఉంటే చెప్పండి. రాసుకొని పోతాం"-చిరాగ్గా విరు

చుకువచ్చాడు చివరి వరసలోని ఛీఫ్.

హోంమినిస్టర్ పి.ఎ. డిన్నర్ఏర్పాట్ల లిస్ట్ పూర్తి చేశాడు.

"యస్! మీరేమయినా అడగండి చెబుతాను" హోంమంత్రి సిద్ధం అయ్యాడు.

"ఇంతకీ డిన్నర్ ఎపుడు పెడుతున్నారు?" ఠక్కున అడిగాడో యువ రిపోర్టర్.

"వచ్చేనెల ఆరోతారీఖున. మీకందరికీ వీలయితేనే. మీకు ఇష్టమేనా?" హోంమంత్రి కళ్లు ఎగరేస్తూ ఎదరవరసలో వాళ్లకేసి చూస్తున్నాడు.

"... రడీ"- చాలా గొంతులు ఏకంగా అన్నాయి. ఈ రడీకి కోరస్ పలకలేనివాళ్లు మాత్రం మండిపడుతున్నారు. కోరస్‌దే డామినేషన్ అవడంతో మౌనం వహించారు.

"ఎక్స్‌క్యూజ్‌మీ" నిఖిలేష్ ముందుకు వంగి అన్నాడు.

"యస్" హోంమంత్రి వెంటనే సర్దుకొన్నాడు.

"రెండురోజుల కిందట సౌమ్య అనే అమ్మాయిని రేప్‌చేసి మర్డర్ చేశారు. ఆ విషయంలో..." చెప్పబోతున్న నిఖిల్‌ని అడ్డుకొన్నాడు మొదటివరసలోని ఓ వ్యక్తి.

"అదేసార్... సిటీపోలీస్‌కి ట్రాన్స్‌ఫర్ అయిన కేసు. అదింకా ఇన్వెస్టిగేషన్‌లోనే ఉంది..." ఆ వ్యక్తే హోమంత్రికి చెప్పేస్తున్నాడు.

పోలీసులు ఉన్నతాధికారులకు సిన్సియర్‌గా సెల్యూట్‌చేసి చెబుతున్నట్టుగా ఉందా దృశ్యం.
అంతటితో ఊరుకోలేదా వ్యక్తి నిఖిలేష్‌కేసి తిరిగాడు.

"ఏంగురూ... స్టేట్‌లెవెల్ ప్రశ్నలు వెయ్యాలి కాని... ఇలాంటి చిన్న కేసులు... హ...హ... హోంమంత్రిని అడిగితే... ఎలా?- భలే రిపోర్టరువే" ఎగతాళి చేశాడావ్యక్తి.

అవాక్కయ్యాడు నిఖిలేష్.

నిఖిల్ తేరుకొనేలోపు మళ్ళీ డిన్నర్ చర్చ మొదలయింది.

"మొత్తం ఎంతమంది వస్తారంటారు...?" హోంమంత్రి ప్రశ్న.

ఎదురుగా ఉన్నవాళ్లు వెనక్కు చూశారు. వెనకనున్నవాళ్లు పక్కముఖాలు చూశారు. ఎవరూ ఏమీ చెప్పలేదు. ఎవరూ మాట్లాడకపోయేసరికి "సుమారు ఓ ఏభైమందికి ఎరేంజ్ చేయిస్తాను. ఒకవేళ మిగిలితే మిగులుతుంది. ఎక్కువ ఉండటం మంచిదికదా..." హోంమంత్రే అందుకొన్నాడు.

"అది చెప్పడం కష్టం సార్... ఎందుకైనా మంచిది మీరోపని చెయ్యండి. మన సమాచార పౌరసంబంధాలశాఖ దగ్గర అక్రిడిట్ పత్రికాప్రతినిధుల లిస్ట్ ఉంది. ఓ కాపీ తెప్పించుకొని, వాళ్లందర్నీ పిలవండి..." సలహా అందించాడు మందు గురించి కంగారుపడిన ముసలాయన.

"ఓకే, నేను అన్నీ ఎరేంజ్‌చేసి రెండురోజుల్లో డిన్నర్ ఎప్పుడు ఉంటుందో మీకు ఇన్విటేషన్ పంపుతాను. మరి నాకు టైమ్ అవుతోంది. ముఖ్యమంత్రి ఎందుకో కబురు పెట్టారు. మీరేమనుకోకపోతే..." అని నవ్వుతూ తలాడిస్తూ, నమస్కారం చేస్తూ, ఛాంబర్లోంచి బయటకు వచ్చి రడీగా ఉన్నకారులో ఎక్కేశాడు హోంమినిష్టర్. ఆ కారు వెంట ఎస్కార్టు వేన్ దూసుకుపోయింది.

నిఖిలేష్ ఉత్సాహం నీరుకారిపోగా ఏదో అలజడి అతని హృదయంలో ప్రవేశించింది. ఎవరో బలవంతాన కిందపడేస్తున్నట్లు 'ఫీ'లవుతూ నిఖిల్ తమాయించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఈలోగా నిఖిలేష్ భుజంమీద బరువు పడింది. వెనక్కు తిరిగాడు. ఆ అపరిచితవ్యక్తి అయిదున్నర అడుగుల ఎత్తులో లావుగా ఉన్నాడు. ఇన్‌షర్టు చేసిన చొక్కాకి ఓ వెడల్పాటి టై వేలాడుతోంది. షర్టునీ, ప్యాంట్‌నీ బంధిస్తూ కనిపిస్తోంది ఓ పెద్ద బకిల్‌ఉన్న బెల్టు. ఉంగరాల జుట్టు పెరిగి భుజాల మీదకు వేలాడుతోంది. నున్నగా గీసిన గెడ్డంపైన అంటించినట్లు రెండు నల్లటి మచ్చలున్నాయ్.

"ఏంగురూ... నువ్వు 'నిజం'లో పనిచేస్తున్నావా...? ఎన్నాళ్లయింది చేరి..."

కనీస మర్యాదలక్షణాలు పాటించని ఆ వ్యక్తిని చూసి అసహ్యపడి "రెండేళ్లు దాటింది..." ముక్తసరిగా చెప్పాడు నిఖిలేష్ .

"నిఖిలేష్ అంటే నువ్వేకదా! 'క్రైం' చూస్తున్నవాడివి సెక్రటేరియట్ ప్రెస్‌కాన్ఫరెన్సుకి వచ్చావేమిటి...??" అలా రాకూడదన్నట్లుగా చూశాడు.

నిఖిల్ చిన్నగా నవ్వాడు. "ఏం అనుకోకు గురూ... ఇలాంటి ప్రెస్‌కాన్ఫరెన్సుకివచ్చినపుడు బాగా ప్రిపేర్ అవ్వాలి. హోంమినిష్టర్‌ని రాష్ట్రస్థాయికి

చెందిన ప్రశ్నలడగాలి. నువ్వడిగిన మర్డర్ కేసు సంగతి ఎస్.ఐ. చెప్పగలడు. మంత్రుల్ని కార్నర్ చెయ్యడానికి ప్రయత్నించాలి. చూడు ఈరోజు... డిన్నర్ విషయంలో ఎలా పట్టేశామో'' ఆ వ్యక్తి ఆగాడు.

''డిన్నర్ కంటె నా ప్రశ్న ముఖ్యమైంది కాదా-?'' నిఖిలేష్ కటువుగా అన్నాడు.

''మరీ అంత సీరియస్ అవుతున్నావేమిటయ్యా బాబు. అది సిటీలెవెల్ రేప్. నీకు ఈ విషయాల్లో అనుభవంలేదు. అందుకే దీన్ని పెద్దగా ఊహించుకుంటున్నావ్. నేను ఫీల్డులో పది సంవత్సరాలనుంచి ఉన్నాను. ఎన్ని రేప్పులు, మర్డర్లు చూశాననుకొన్నావ్. మరో విషయం ఏమిటంటే... ఓ 'క్రైం' వార్త రాయడంవరకే మనపని. ఆ తర్వాత ఆ గొడవ పోలీసులు చూసుకొంటారు'' అంటూ ఓ సలహా పారేశాడు.

నిఖిల్‌కి ఆ సంభాషణ పొడిగించాలనిలేదు. బయటకు నడక ప్రారంభించాడు. ఆ వ్యక్తి ఏవేవో అడుగుతున్నాడు. నిఖిలేష్ ముభావంగా సమాధానాలు ఇస్తున్నాడు.

సెక్రటేరియట్ గేట్ దాటారిద్దరూ.

ఆ వ్యక్తిని వదిలించుకోవడానికి మార్గాలు అన్వేషిస్తున్నాడు నిఖిలేష్.

ఈలోగా ఓ ఆటో వాళ్లదగ్గర్లో ఆగింది. ఆ ఆటో అజయ్‌ది. స్వంతంగా దాన్ని మెయిన్‌టెయిన్ చేస్తున్నాడు. ఆటో మారినట్టే డ్రైవర్ కూడా ఒక్కడే.

ఆటోలోంచి అజయ్ ఉత్సాహంగా దిగాడు. ''ఏరె మౌలానా...'' అరిచాడు. నిఖిలేష్ పక్కనున్న వ్యక్తి వెయ్యొత్తాడు.

''ఎంగురా పొద్దున్నే రొత్తైకాప్'' అజయ్‌ని పలకరించాడు. అంతవరకూ అపరిచితంగా ఉన్న వ్యక్తి మౌలానా-!మౌలానా తెలుగు స్పష్టంగా మాట్లాడుతున్నాడు. మౌలానాని చూస్తే ఎన్నో అనుమానతరంగాలు నిఖిలేష్ గుండెల మీదుగా వెళుతున్నాయి.

మౌలానా సౌమ్య మర్డర్ కేసులో ఎందుకలా ప్రవర్తించాడు?

హోంమంత్రిని ప్రశ్న అడగకుండా ఎందుకు అడ్డుపడ్డాడు?

మౌలానాకి అజయ్‌కి సంబంధం ఏమిటి?

అజయ్, గూండా రాజ్‌కుమార్, మౌలానా, ఎస్.ఐ వీళ్లందరిమధ్యా ఉన్న అవగాహన ఎలాంటిది?

''ఏం నిఖిల్... నేను చెప్పిన వార్త రాయలేదు'' అజయ్ నవ్వుతూ అడిగాడు.

నిఖిలేష్ మౌనం వహించాడు.

''సౌమ్య రేప్ కేసుని వాయించేస్తున్నావ్. ఏం రాయబోతున్నావ్. నీ అపరాధ పరిశోధన పూర్తయిందా... ఇంకా ఉందా?'' అజయ్ ఎగతాళి చేసినట్లుగా నవ్వాడు.

''సీనియర్ క్రైం రిపోర్టర్‌వి! నువ్వేదయినా 'క్లూ' చెప్పరాదూ'' నిఖిల్ చురక అంటించాడు.

''నా ముందరికాళ్లకి బంధం వేశావ్. ఇలాంటి వార్తలు రాసిపారెయ్యాలి గాని మన స్టాండర్డ్‌కి వాటి పరిశోధన అనవసరం. పోలీసులు ఎవర్నో తీసుకొస్తారు. ఆ రేప్ చేసిన వాళ్లను పట్టుకొనే ప్రసక్తి ఉండదు. ఆ గొడవ మనకెందుకులే నిఖిల్''- అజయ్ సూచనగా చెప్పాడు.

మౌలానా వెంటనే అందుకొని ''నువ్వు ఆ రేప్‌కేసు గురించి రాశావా?'' అంటూ నిఖిల్‌కేసి చూశాడు.

నిఖిలేష్ మౌలానా ముఖంలో ఏదో మార్పు రావడాన్ని గమనించాడు.

''అజయ్... ఒక్కనిముషం'' అని అజయ్‌తోసహా పక్కకు వెళ్లిపోయాడు మౌలానా.

నిఖిల్‌కు వాళ్ల వ్యవహారం ఓ పట్టాన అర్థంకాలేదు. వాళ్లకోసం ఎదురుచూడకుండా ముందుకు సాగిపోయాడు.

హోంమంత్రి పత్రికా ప్రతినిధుల సమావేశంలో పంపిన ప్రెస్‌నోట్‌లో రాష్ట్రంలో నేరాల సంఖ్య తగ్గిపోయిందనీ, పోలీసుల సామర్థ్యం పెరిగిందనీ వివరాలిన్ని ఉన్నాయి.

హోంమంత్రి హడావిడిగా ఈ ప్రెస్ కాన్ఫరెన్సు ఎందుకు పెట్టినట్లు?

నిఖిలేష్ ఆలోచిస్తున్నాడు.

సాధారణంగా సెక్రటేరియట్ 'ప్రెస్‌రూం'నుంచి రిపోర్టర్లే మంత్రులకు ఫోన్‌చేసి ''మేంవస్తున్నాం. ఏదైనా వార్త చెప్పండి'' అనడం - మంత్రులు ''రావద్దు'' అనలేక ''రండి'' అనిపిలిచి ఏదోవార్త చెప్పడం- ఆ వార్తను పత్రికా ప్రతినిధుల సమావేశంలో మంత్రి అన్నారంటూ రాయడం - మామూలే.

ఒక్కోసారి కొందరు మంత్రులు విషయాలు రదీ

గా లేకపోతే "రేపో..ఎల్లుండో పిలుస్తాను" అని పాత్రికేయులకు చెప్పి తప్పించుకొంటారు.

ఆ తర్వాత విలేకరులకు వార్త చెప్పడానికి విషయాలను వెతికిస్తారు.

అవి దొరికింతర్వాతే సమావేశం పెట్టడానికి సిద్ధం అవుతారు.

రిపోర్టర్లు సాధారణంగా మంత్రుల్నీ అధికారులనీ. నాయకులనీ కలుస్తూంటారు. ముఖ్యమంత్రి స్థాయిలో ఎక్కువగా ఈ రకమైన ప్రెస్ కాన్ఫరెన్సులు ఉండవు. మంత్రివర్గసమావేశాలప్పుడు పాత్రికేయులను ఆ సమావేశపు గదిలోకి రానివ్వరు. అవి పూర్తయినతర్వాత ముఖ్యమంత్రి ఆ చర్చల సారాంశాన్ని విలేకరులకు చెబుతూంటారు. అలాగే ఉన్నతస్థాయి ప్రభుత్వ నిర్ణయాలనూ... కార్యక్రమాలనూ ప్రజలకు తెలియజెయ్యడానికీ అప్పుడప్పుడూ ముఖ్యమంత్రి పత్రికలవాళ్ళని పిలుస్తూంటారు.

రోజూ కనీసం ఓ మంత్రినైనా పట్టుకొని ఏదోవార్త తెలుసుకోడానికి రిపోర్టర్లు ప్రయత్నిస్తూంటారు.



కొందరు మంత్రులు వారానికో... పదిహేను రోజులకో... నెలకో ఓసారి పాత్రికేయులను పిలిపించుకొని తాము చేపట్టిన...చేపట్టదలచుకొన్న కార్యక్రమాలను చెబుతూంటారు.

అవే విలేకరుల సమావేశంలో మంత్రిగారి వాగ్దానాలుగా...హామీలుగా...పత్రికల్లో వార్తలుగా వస్తూంటాయి.

హోంమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్సు కూడా ఆ బాపతుదే అనుకొన్నాడు నిఖిలేష్.

Uma —ooo

హోంమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్సుకన్నా మౌలానా గురించిన ఆలోచనలు నిఖిలేష్‌ని వేధిస్తున్నాయి.

మౌలానా గురించి అప్పటికే ప్రదీప్‌తో కలిసి వివరాలన్నీ సేకరించాడు.

ఈ మౌలానా ప్రెస్‌కాన్ఫరెన్సుల్లో మొదటివరుసలో ఎలా కూర్చొన్నాడు?

ప్రముఖ దినపత్రికల ప్రతినిధులంతా వెనకవరసకి ఎందుకు వచ్చారు?

మౌలానా ప్రశ్నలకు హోంమంత్రి వెంటనే జవాబులిస్తున్నాడే, అసలీ మౌలానా గురించి హోంమంత్రికి తెలియదా...?

మౌలానా పదేళ్ళక్రిందట ఓ ప్రముఖ దినపత్రికలో రిపోర్టర్‌గా పనిచేసేవాడు. క్రైంరిపోర్టర్‌గా పోలీసుల్లో మంచిపేరు సంపాదించుకొన్నాడు. పోలీసుల పరిచయాలవల్ల పెద్దగా లాభించలేదు. పైగా వాళ్ళతో సంబంధాలు తన పనిని బెడిసికొట్టించాయి. ఫలితంగా యాజమాన్యం అతని పనులను సమర్థించకపోవడంతో రాజీనామా చేశాడు.

మౌలానా సంపాదించుకొన్న మంచిపేరు ఇతర దినపత్రికలవరకూ పాకడంతో వాళ్ళూ 'అంత సమర్థత మాకొద్దు' అన్నారు.

దాంతో స్వంతంగా నిలబడటానికి ఓ రెండుపేజీల పత్రిక స్థాపించాడు. అది దినపత్రికా? వారపత్రికా? పక్షపత్రికా? ఎవరికీ అంతుపట్టని విషయం. అతన్ని అడిగితే సమయానుకూలంగా చెబుతుంటాడు.

ఆ పత్రిక సెక్రటేరియట్ ప్రెస్‌రూంలోనూ, కొందరు మంత్రుల ఇళ్ళదగ్గరా, పౌరసంబంధాల శాఖలోనూ మాత్రం కనిపిస్తుంది. ఆ పత్రికలో రాసేది ఏమయినా దాని ఆధారంగా నెలకు ఓ మూడువేలు సంపాదిస్తున్నాడు.

వాణిజ్యశాఖమీద తోచింది రాసి అధికార్లను బెదిరించి పనులు చేయించుకోవటం. అక్రమ సంపాదన అనే శీర్షికను నిర్వహిస్తూ ప్రజల్లో సంచలనం కలిగిస్తానంటూ బ్లాక్‌మెయిల్ సిస్టం మొదలెట్టి మాజీ నాయకులనూ, ప్రస్తుత పైరవీకార్లనూ పిండటం అతనికున్న ఆర్ట్.

ఎవరైనా ఎదురుతిరిగితే వాళ్ళు గొప్పవాళ్ళు అనే స్వీయవ్యాసాలు ప్రచురించటం మౌలానా స్పెషల్.

ఆ పత్రిక ఎక్కువకాలం బతకపోవటంతో ఓ వార్తా సంస్థను పెట్టాడు. దానికో మాజీమంత్రి అండగా ఉండటంతో నెట్టుకొస్తున్నాడు. ఆ సంస్థ ఏపత్రికకు వార్తలందిస్తుంది? దానివల్ల ఉపయోగం ఏమిటి? అనేవి అర్థంలేని ప్రశ్నలవుతాయి.

వార్తల కోసం వార్తా సంస్థలనే పాతఅర్థాన్ని మౌలానా తిరగ రాశాడు. పైరవీలు చేస్తూ పెద్ద పెద్ద వాళ్ళని ఆ సంస్థ అడ్డం పెట్టుకొని కలుస్తూ పనులు చేయించే ప్రక్రియకు నాంది పలికాడు.

మౌలానా ఎవరు? ఏంచేస్తాడు? అతనికి పనులు చెయ్యటంవల్ల ఎలాంటి లాభాలున్నాయి? ఈ విషయంలో ఉన్నతాధికారులు, మంత్రులు, ఇతర నాయకులు ఆలోచిస్తారనే అనుమానం అనవసరం.

ఎంతటివారయినా కొంత దాపుతో అప్యాయంగా మౌలానా జర్నలిస్టు అనే కార్డు చూస్తే చాలు అతనికి మర్యాదలు దొరుకుతాయి. ఒకవేళ ఆ మర్యాదలు దొరకపోతే ఎలా దక్కించుకోవాలో తెలిసిన నేర్పున్నవాడు మౌలానా.

నిఖిలేష్ మౌలానాకు చెందిన వాస్తవాలు ఆలోచిస్తూ, బుర్ర వేడెక్కించుకొన్నాడు. ఇంతలో ఫోన్ మోగసాగింది! రిపోర్టర్స్ గదిలో ఎవరూ లేరు. నిఖిలేష్‌కి తప్పలేదు.

రిసీవర్ అందుకొన్నాడు.

"నిఖిలేష్ ఉన్నారా...?" భారతి అడుగుతోంది.

"నిఖిలేష్‌నే మాట్లాడుతున్నాను"

"కనిపించి రెండురోజులైంది. పొత్తిగా థేంక్స్ కూడా చెప్పకుండా ప్రెస్ రూందగ్గర వదిలేసి వెళ్ళిపోయావ్" నిష్ఠూరంగా అంది భారతి.

"సారీ... ఏమనుకోకు. నేను ఆ సంగతే మర్చిపోయాను..."

"అదిసరే. నీతో పనుంది. ఎప్పుడు ఖాళీగా ఉంటారు తమరు?"

"నువ్వెప్పుడంటే అప్పుడే" నిఖిలేష్ లౌక్యం ప్రదర్శించాడు.

"ఎల్లుండి ప్రెస్‌రూంలో కలుస్తాను. అక్కడ్నుంచి మా ఇంటికి వెళ్దాం. ఓ గంట పని" అంది భారతి.

"సర్లే... ఏం అర్జెంటుపనా...?"

"అంత అర్జెంటు కాదనుకో. నీతో మాట్లాడాల్సిన ముఖ్య విషయం ఒకటుంది... తప్పనిసరిగా రావాలి" భారతి చెప్పింది.

"డెఫినిట్‌గా వస్తాను" నిఖిలేష్ హామీ ఇచ్చాడు.

"థేంక్యూ వెరీమచ్" భారతి పూర్తి చెయ్యడంతో ఫోను పెట్టేశాడు నిఖిలేష్.

భారతి పరిచయం నిఖిలేష్‌కి గుర్తొచ్చింది.

ఎర్రగా అందంగా ఉండే భారతికి కళ్లు హైలైట్. ఆ కళ్లే ఎదటివాళ్ల కంగారుకు కారణం.

నిఖిలేష్ కూడా ఆ కంగారుకి గురయ్యాడు. సుమారు ఓ ఏడాదికిందట అసెంబ్లీలో భారతితో పరిచయమైంది. అప్పుడు అసెంబ్లీ సమావేశాలు. నిఖిలేష్ రోజూ ప్రశ్నోత్తర కార్యక్రమ సమీక్ష రాసుకోవడానికి ఉదయం ఎనిమిదికే ప్రెస్ గ్యాలరీలో కూర్చొనేవాడు.

భారతి అప్పుడే ఓ న్యూస్‌ఏజెన్సీ తరపున అసెంబ్లీ సమావేశాల సమీక్ష రాసుకోవడానికి వచ్చేది. ప్రశ్నోత్తరాల సమయంలోనూ, జీరోఅవర్‌లోనూ జరిగే వాదోపవాదాలు రాసుకోవడానికి, ఎవరు ఏ ప్రశ్న వేస్తున్నారో తెలుసుకోవడానికి నిఖిలేష్‌ని అడుగుతుండేది.

భారతి పడే కంగారు చూసి నిఖిలేష్ నవ్వుకొనేవాడు.

ఆ నవ్వే నిఖిలేష్ భారతిల మధ్య స్నేహానికి దారితీసింది.

శాసనసభలో వాదోపవాదాలు జరిగినంతసేపూ భారతిని మాట్లాడవద్దని వారిస్తూండేవాడు. ఆతర్వాత కాఫీహౌస్‌లో ఇద్దరూ కూర్చునేవారు. కాఫీతోపాటే వివరాలన్నీ అందించేవాడు. ఆ వివరాలను ఎలా వార్తలుగా రాయాలో చెబుతూండేవాడు.

అలా మొగ్గతొడిగిన ఆ స్నేహం ఏడాదిలో నువ్వూ అనుకొనే స్థాయివరకూ వచ్చింది. నిఖిలేష్ మామూలుగానే ఉన్నా భారతి జర్నలిస్టుల్లోనే కాకుండా ఇతరత్రా కూడాబాగా పాపులర్ అయింది. కారణం అందం కావచ్చు. ధైర్యంగా ముందుకెళ్లి నాయకులతోనూ, అధికార్లతోనూ పరిచయాలు పెంచుకోవడమూ కావచ్చు.

అసెంబ్లీకి అవస్థలుపడి వచ్చే భారతికి సొంతంగా స్కూటర్ ఉందీనాడు. టెలిఫోన్ కనెక్షన్ దగ్గర్నుంచి అన్ని హంగులూ ఏర్పరచుకొంది.

భారతి నవ్వులు చిందిస్తే నిఖిలేష్ ఆనందిస్తాడు.

నిఖిల్ మాట్లాడితే చాలు భారతి పరమానందభరితురాలవుతుంది.

'ఆడపిల్ల ఎంత కష్టపడుతోంది. పాపం ఏంరాస్తుందిలే' అని జాలిపడేవర్గమూ ఉంది. 'ఫాస్ట్‌లేడీ గురూ... జాగ్రత్త నిఖిలేష్' అని హెచ్చరించేవారూ ఉన్నారు.

"ఈరోజు ఏంరిపోర్టు ఇస్తున్నావ్ గురూ-" సబ్‌ఎడిటర్ మూర్తి అడగడంతో వాస్తవంలోకి వచ్చాడు నిఖిలేష్. సబ్‌ఎడిటర్లు ముగ్గురు చేరారు. నిఖిలేష్ రిపోర్టుల గురించి చర్చిస్తున్నారు. రిపోర్టర్ల జీవితం హాయి అనుకొనేవరకూ ఆ చర్చ వెళ్లింది. వెంటనే సబ్‌ఎడిటర్ల బాధలపర్వం మొదలైంది. వార్తలను అనువదించడానికి తాముపడే కష్టం, కంపోజ్ అయిన వార్తలను పేజీల్లో సర్దించడానికి, వాటికి సరైన శీర్షికలు పెట్టడానికి తాముపడే అవస్థా వర్ణిస్తున్నారు.

"నిఖిల్... రెండురోజుల కిందట 'కాంతి' న్యూస్ పేపర్‌లో ఓ వార్త పడింది చూశావా?" సబ్‌ఎడిటర్ మూర్తి నిఖిలేష్‌ని చూస్తూ అడిగాడు.

"ఏమిటది?" పక్కనే ఉన్న మరో సబ్‌ఎడిటర్ రావు మూర్తికేసి చూశాడు.

"పోలీసుల జులుం. రాజకీయ నాయకుడి అక్రమ నిర్బంధం"- మూర్తి హెడ్‌లైన్ వినిపించాడు.

"ఓ అదా... మన పేపర్లో రాలేదుకదా?- నిఖిల్ మిస్ అయ్యాడు. మంచివార్త. ఆ రాజ్‌కుమార్ పోలీస్‌స్టేషన్ ముందే నిరాహారదీక్ష చేస్తున్నాడటగా" రావు నిఖిలేష్‌కేసి మిస్ అయ్యావు అన్నట్లు చూశాడు. నిఖిలేష్ చిన్నగా నవ్వుతూ మౌనం వహించాడు.

"ఆ... ఆ పేపర్లో సొమ్ము వార్త రాయనేలేదు. రాజ్‌కుమార్‌గాడు ఓ రాజకీయ నాయకుడా? ఎలా రాశారయ్యా... బొత్తిగా రిపోర్టర్స్‌కి నాలెడ్జిలేక అలా రాస్తున్నారు. వాడు సికింద్రాబాద్‌లో ఓ గూండా. వాడు పోలీసుస్టేషన్ ముందు నిరాహారదీక్ష చేస్తే అదేదో పెద్ద వార్తగా రాశారు" మూర్తి కసురుకొన్నాడు.

"సొమ్ము వార్తలో ఏవుందీ... రెండురోజులు అదరగొట్టేశాం మూడోరోజు ఖాళీ... అలాంటి వార్తలు దొరికినప్పుడు మొదటిరోజు రేప్ అండ్ మర్డర్ వార్త రాసి ఊరుకోవాలి. రెండోరోజు ఆ అమ్మాయి సొమ్మా? కాదా...? అని సస్పెన్స్‌లో పెట్టాలి. మూడో

రోజు కొన్ని వివరాలు. నాలుగోరోజు పరిశోధనా వివరాలు రాస్తే... చూస్కో! జనంలో సంచలనం రేగుతుంది. మన పేపరంటే ఇంట్రస్ట్ క్రియేట్ అవుతుంది'' తనకున్న అనుభవం పరిధిలో చెప్పాడు సబ్‌ఎడిటర్.

''అవును... నాలుగురోజులు రాస్తాం. ఆపైన ఖాళీయేగా... ఏవుంటుంది రాయడానికి. జనాన్ని సస్పెన్సులో ఉంచడానికి, సంచలనం కలిగించడానికి తెలిసిన వివరాలను రాయకుండా ఆపాలా...? లేకపోతే అభూతకల్పనలూ, అబద్దాలు రాసి వార్తను పెంచాలా...? ఏం మాట్లాతావ్- సీనియర్ సబ్‌ఎడిటర్ రావు''- మూర్తి మాటలతో కొట్టాడు.

''నేను అలా అనలేదయ్యా బాబు. నువ్వొకడివి ఛాన్సు దొరికితే చాలు బాణాలు వేస్తావ్. ఆ రాజ్‌కుమార్ గూండా అయినా మరొకడయినా మనకెందుకు. ఆ వార్త రాస్తే నష్టం ఏమిటి... ఎంత చెత్త రాయడంలేదూ?''

ఇలాంటి చర్చలు వినడం నిఖిలేష్‌కి సర్వసాధారణం. 'ఊ' కొట్టడం తప్ప మరోమాట మాట్లాడడు. పొరపాటున పెదవి విప్పాడా వాళ్లూ మరీ విజృంభిస్తారు. మౌనంగా వింటూ వాళ్లకేసి చూస్తున్నాడు.

''రాజ్‌కుమార్ అనేవాణ్ని పోలీసులు ఎందుకు అరెస్టు చేశారు. వాణ్ని అసలు పట్టుకోరుగా. ఈసారి వాణ్నెందుకు పట్టుకొన్నారు. మళ్లీ ఎందుకు వదిలేశారు?'' మూర్తి నిఖిలేష్ మెదణ్ని తట్టిలేపాడు. నిఖిల్ మనసంతా రాజ్‌కుమార్ ఎందుకు అరెస్టయ్యాడనే ప్రశ్నతో నిండిపోయింది.



3

బంజారాహిల్స్‌పన్నెండో నంబర్ రోడ్డులో వెళుతున్న కార్తీక్‌కారు అకస్మాత్తుగా ఆగింది.

కార్తీక్ పక్కనే కూర్చున్న ప్రభాకర్ తూలిముందుకి పడబోయి తమాయించుకొన్నాడు.

''హలో...నిఖిలేష్'' కార్తీక్ నడిచివెళుతున్న నిఖిలేష్‌ని పిలిచాడు.

''హలో...''అంటూ నిఖిలేష్ కార్తీక్ కారువరకూ వచ్చాడు. ''వారంరోజులుగా నీకోసం గాలిస్తున్నాననుకో...మంచి సమయానికి దొరికావ్. నీతో అర్జెంట్ పనుంది. కారెక్కు'' అంటూ నిఖిలేష్‌ని బలవంతాన ఒప్పించి కార్లో ఎక్కించాడు.

కార్తీక్ కారు ఎత్తులు...పల్లాలను దాటుతూ పోతోంది. ''ఎక్కడికి వెళ్తున్నాం'' అని నిఖిలేష్ ఎన్నిసార్లు అడిగినా కార్తీక్ ''అర్జెంట్ పని...తీరిగ్గా మాట్లాడతాగా...'' అనిచెప్పి డ్రైవ్ చెయ్యడంలో నిమగ్నమయ్యాడు.

రాక్‌కేజిల్స్ హోటల్‌ముందు ఆగిందాకారు.

ఆ హోటల్ ఓ అందమైన...విశాలమైన ఇల్లులా ఉంటుంది. హంగులూ...హంగామాలు, హడావిడీ... ఆర్భాటం అక్కడ కనిపించదు. హోమ్లీవాతావరణం ఉంటుంది. ఆరుబయట వలయాకారంలో ఉన్న లాన్స్‌లో పేంకుర్చీలు వేస్తున్నారు బేరర్లు. వాటిమధ్య గుండ్రని టీపాయ్‌లు ఉంచుతున్నారు. గ్లాసులూ...చల్లని నీరు అందిస్తున్నారు.

ఆ లాన్స్‌కిముందు రిసెప్షన్‌ఉంది. లాన్స్‌లో కూర్చొన్న వారెవరూ రిసెప్షన్‌లో వాళ్ళకి కనిపించరు. ఆహ్లాదకరమైన ఆ ప్రదేశం హాయిగా ఉంది.

లాన్స్‌కి కుడివైపున కూర్చొన్నారు నిఖిలేష్, ప్రభాకర్. అయిదునిమిషాల్లో వస్తాననిచెప్పి పావుగంట తర్వాత మరో ఇద్దర్ని వెంటపెట్టుకొని వచ్చాడు కార్తీక్.

వాళ్ళలో ఒక వ్యక్తిని విద్యాధరరావుగా పరిచయం చేశాడు. రెండో వ్యక్తి డి.డి. రాయ్. విద్యాధరరావు బెంగుళూరులో పెద్ద బిజినెస్ మాగ్నట్. డి.డి. రాయ్ కలకత్తాలో ప్రముఖ జర్నలిస్ట్.

బిజినెస్‌లో ఎంతసంపాదించినా తగినంత పేరు రాలేదుట. అందుకే విద్యాధరరావు నూతన ప్రక్రియలతో కనీవినీ ఎరుగనిరీతిలో కొత్త దినపత్రిక పెట్టాలని నిర్ణయించుకొన్నాడనీ, ప్రస్తుతం ఎడిటర్లను, ఇతర జర్నలిస్ట్‌లను స్వయంగా కలిసి మాట్లాడుతున్నాడనీ నిఖిలేష్‌కి చెప్పాడు కార్తీక్.

''మాకు కావలసిన వాళ్ళను మేమే రప్పించుకొంటాం—'' విద్యాధరరావు అన్నాడు.

నిఖిలేష్‌కి ఆ మాటలే అర్థంకావడంలేదు.




ఎక్కువ సేమ్యా
ధర అదనం కాదు!

ప్రతి
ప్యాక్‌లోనూ
50 గ్రా అదనం




AFL-2112

ఇప్పుడు 300 గ్రా గోల్డెన్ హార్వెస్ట్ తక్కువ పొడవున్న సేమ్యా 250 గ్రా ధరకే తీసుకోండి.

మేము ప్రతి ప్యాక్‌లోనూ 50 గ్రా అదనంగా వుంచాము. అయితే ధర ఏమాత్రమూ మారలేదు.

అన్నిటిలోనూ అత్యుత్తమ నాణ్యతగల తక్కువ పొడవున్న సేమ్యా ఇప్పుడు పొదుపైనది కూడా!

గోల్డెన్
హార్వెస్ట్
మీ ధనానికి మీకు
ఎక్కువ యిస్తుంది

''ఇంతకీ మీ అనుభవం...?'' మళ్ళీ విద్యాధరరావు మాట్లాడంతో నిఖిలేష్ కార్తీక్‌వైపు చూశాడు. కార్తీక్ నిఖిలేష్ అనుభవాన్ని పెద్దగా వర్ణించి చెబుతున్నాడు.

అలా ఎందుకు చెబుతున్నాడనేది నిఖిలేష్‌కి అంతుపట్టడంలేదు.

కార్తీక్ నిఖిలేష్‌ని ప్రముఖ జర్నలిస్ట్ అని చెబుతూ లేనిపోని కీర్తంతా అంటగడుతున్నాడు. ప్రభాకర్ గురించి కూడా అలాగే చెప్పేస్తున్నాడు.

విద్యాధరరావు ప్రశ్నలకి కార్తీకే జవాబులిస్తున్నాడు.

''ఇంతకీ మీ టరమ్స్ ఏమిటి?'' నేరుగా నిఖిలేష్‌ని అడిగాడు విద్యాధరరావు.

''టరమ్స్‌ఏవిటి...?'' నిఖిలేష్ ఆశ్చర్యపోతూ అన్నాడు.

''మీకసలు విషయం తెలిసినట్లులేదే...హా...హా...హా....''విద్యాధరరావు నవ్వాడు.

దాదాపు బిక్కమొహం వేశాడు నిఖిలేష్.

''యూ...నో...నేను పేపర్ ప్రారంభిస్తున్నా. మన స్టేట్‌లోని అయిదు సెంటర్లనుంచి వస్తుంది అది. బెస్టు రిపోర్టర్లని ఏరి తీసుకొంటున్నాం...సీ...ఎవర్నయినా సరే నేనే ప్రత్యేకంగా ఇంటర్వ్యూ చేస్తాను.'' అని మొదలుపెట్టి తన పత్రిక సిద్ధాంతాన్ని ఉద్దేశాలను కాలమ్స్‌ని ఏకరువుపెట్టాడు.

అవన్నీ విద్యాధరరావు ఎందుకు చెబుతున్నాడో అర్థంకాక నిఖిలేష్ దిక్కులు చూస్తున్నాడు...దూరంగా అదే లాన్సులో ప్రవీణ్ కనిపించాడు. ప్రాణం లేచివచ్చినంతపనయింది నిఖిలేష్‌కి.

విద్యాధరరావు, రాయ్, కార్తీక్‌లు తననివదిలేటట్టులేరు. ఏంచెయ్యడానికీ • పాలుపోవడంలేదు. విద్యాధరరావు మాటలకు అంతులేకుండాపోతోంది. తన పేపర్ ఓ ఆయుధం అంటాడు. రాష్ట్రంలో సంచలనం సృష్టిస్తానంటాడు. ప్రభుత్వానికి పూర్తిగా వ్యతిరేకం కాకపోయినా విమర్శించక మానసంటున్నాడు.

విద్యాధరరావు మాటలువింటే పెట్టబోయే తన పత్రికద్వారా ప్రజల్ని మార్చేసి అధికారపీఠంలోకి వచ్చేయాలన్న తాపత్రయం కనపడుతోంది.

నిఖిలేష్‌కి ఆ మాటలు నవ్వు తెప్పిస్తున్నాయి గానీ కార్తీక్, ప్రభాకర్, రాయ్‌లు విద్యాధరరావు చెప్పేదంతా సిన్సియర్‌గా వింటున్నట్లు హావభావాలు ప్రదర్శిస్తున్నారు. డ్రింక్స్ సప్లై చేశాడు సర్వర్. ఆత్రంగా తాగుతున్నాడు విద్యాధరరావు. కార్తీక్, ప్రభాకర్‌లు కొంచెం నెమ్మదిగా మందులాగిస్తున్నారు. రాయ్ మటుకు సైలెంట్‌గా, డిగ్నిఫైడ్‌గా తాగుతున్నాడు.

''ఒక్కనిమిషం''— అని వాళ్ళని తప్పించుకొని నిఖిలేష్ వరుగునపరుగునవెళ్ళి ప్రవీణ్‌ని కలిశాడు.

ప్రవీణ్‌నీ కార్తీకే పిలిచాడట! నిఖిలేష్ వచ్చిన అయిదు నిమిషాలకి ప్రవీణ్ వచ్చాడు.

విద్యాధరరావు అనే ప్రముఖ వ్యక్తి జర్నలిస్టులను కలుస్తున్నాడనీ ఓ ప్రముఖ రిపోర్టర్ వెయిట్ చేస్తున్నాడనీ, ప్రవీణ్‌కిచెప్పి రిసెప్షన్‌లోనే కూర్చోమన్నాడట కార్తీక్.

రిసెప్షన్‌లో బోరుకొట్టి లాన్స్‌లోకి వచ్చిన ప్రవీణ్ నిఖిలేష్‌ని చూశాడు. అందుకే అక్కడే లాన్సులో కూర్చున్నాడు.

''వీళ్ళని ఎలా తప్పించుకోవడం—''? నిఖిల్ ఆలోచిస్తూ అన్నాడు.

''ఏదో ఇంపార్టెంట్ పనుందనిచెప్పి తప్పించుకురా...'' ప్రవీణ్ సలహా ఇచ్చాడు. నిఖిలేష్ విద్యాధరరావు టేబుల్‌దగ్గరకి వెళ్ళేసరికి మరోవ్యక్తితో పేపరు గురించి చెబుతున్నాడు విద్యాధరరావు.

''వస్తానని'' కార్తీక్‌కి చెప్పి వచ్చేశాడు నిఖిలేష్.

విద్యాధరరావులాంటి బిజినెస్ వ్యక్తులనూ, ఏపనీ లేని వృద్ధరాజకీయ నాయకులనూ, ప్రజల్లో ఏమాత్రం పలుకుబడి లేకపోయినా అక్రమ సంపాదనతో పైస్థాయికి వచ్చిన పెద్దలనూ కలవడమే కార్తీక్, ప్రభాకర్‌ల దినచర్య. 'ఆంధ్రదేశంలో మీ పేరు మారు మోగుతుంది' ''మీరు పత్రికపెడితే గొప్ప జర్నలిస్టులను మేము తీసుకొచ్చి మీ చేతుల్లో పెడతాం. మీరు పత్రిక పెట్టారంటే అంతా మీ మాట వింటారు'' అంటూ అరచేతిలో స్వర్గం చూపించి పత్రిక ఏర్పాట్లంటూ బారుల్లోకీ పెద్ద, పెద్ద హొటల్స్‌లోకీ బలవంతాన జనాన్ని తీసుకెళ్ళి నాటకీయంగా వాళ్ళ ముందుంచి ముంచడం కార్తీక్ స్వయంగా సాధించుకొన్న విద్య.

విద్యాధరరావు బిజినెస్‌లో గట్టిగా దెబ్బతిన్న వ్యక్తి. కార్తీక్‌లాంటి వాళ్ళద్వారా మిగతా వాళ్ళను కలసి అంచనాలు వేస్తూంటాడు. ఇప్పటికే తాను ప్రారంభించబోయే దినపత్రికమీద ముప్పైలక్షల



వీళ్లు మినిస్టర్ కార్లే...?

ఆలోచిస్తూండగానే హారన్ మ్రోగించుకొంటూ ఆ కారు బస్సుని దాటుకొని ముందుకు దూసుకుపోయింది. నిఖిల్ మెదడుకి పదునురాకుండానే సెక్రటేరియట్ బస్‌స్టాప్ వచ్చేసింది. బస్సులో అడ్డం పడే ప్రయాణీకుల్ని తోసుకొంటూ దిగాడు నిఖిలేష్.

సెక్రటేరియట్ ద్వారంలోకి ప్రవేశించిన నిఖిలేష్‌కి నలుగురు ఘర్షణ పడటం కనిపించి ఆగాడు. అటువైపు నడిచాడు.

'బగర్‌పాస్... కైసాజాతే' లోపలికి పోబోతున్న ఓ ముగ్గురిని ప్యూన్లు అడ్డుకొంటున్నారు.

'సాబ్ ఇదర్ ఆనాబోలే' - వాళ్ళూ గట్టిగానే దబాయిస్తున్నారు. వాళ్లని చూస్తే పల్లెటూరి వాళ్ళల్లా ఉన్నారు. బహుశా తెలంగాణా ప్రాంతం కాబోలు ఉర్దూలో మాట్లాడుతున్నారు. ఆ ఘర్షణ మెల్లగా తెలుగులోకి దిగింది.

'పోనీరాదుర భాయ్' - ముగ్గుర్లో ఒకడు ముందుకొచ్చి అన్నాడు. 'ఎడకుపోతార్రా... పాస్‌సహీ... లాభంలే' ప్యూన్‌గదమాయించాడు. 'మౌలానా - సాబ్... రిపోర్టర్ అని చెప్పినగద. సముజ్‌కాలే' వాడే అంటున్నాడు.

అపుడర్థమయింది వాళ్ళెందుకు వచ్చారో.

ఓ క్షణం జాలిపడ్డాడు నిఖిలేష్. 'ఎవరయ్యా మీరు' అని వాళ్ళని అడుగుతూ ఆ ప్యూన్‌కి 'ప్రెస్' అని చెప్పి వాళ్ళని రమ్మని సైగచేశాడు. ప్యూన్ కేసి గర్వంగా చూస్తూవాళ్ళూ నిఖిలేష్ వెనగ్గా నడుస్తున్నారు.

'అరె... బుర్ర పనిచేయదుర' ఎవరో ఒకడ్ని మరొకడు తిట్టాడు. 'ఏందిర' అన్నాడు మరొకడు

'మౌలానాసాబ్... ప్రెస్ అని చెప్మన్లే. మరి నువ్వు చెప్పినావుర' 'గురుతేలేకపాయె'!!!

'మౌలానా సాబ్ పట్టిండంటేపట్టే! నే చెప్పినకద. సానాఇజ్జత్తున్న మనిషి... నీకామ్ జల్దీకర్తా ఇనూ' - మౌలానాని తెగపొగుడు తున్నాడు ప్యూన్ని దబాయించిన వ్యక్తి.

మిగిలిన ఇద్దరూ తలలు ఆడిస్తూవింటున్నారు.

ప్రెస్ రూంలోకి అడుగుపెట్టగానే మౌలానా కనిపించాడు. ఒక్కడే ఫోను పట్టుకొని సోఫాలో కనిపించాడు. రెండు కాళ్ళనూ ఎదురుగా ఉన్న కుర్చీలో విలాసంగా ఆడిస్తూ ఫోనులోనే ఎవరి మీదో ప్రతాపం చూపిస్తున్నాడు.

నిఖిల్ వెంట వచ్చిన వాళ్ళని కళ్ళతోనే రమ్మని పిలిచాడు మౌలానా. గోడకు ఆన్చి ఉన్న కుర్చీల్లో కూర్చోమన్నట్లు చేత్తో సైగచేశాడు. వాళ్ళు భయపడుతున్నట్లుగా నటించారో... నిజంగా భయపడ్డారో నిఖిలేష్‌కి అర్థం కాలేదు. కానీ వాళ్ళు అలాగే కూర్చొన్నారు.

'ఏందయ్యా... ఇపుడారావటం. నాలుగు రోజులు ఆలస్యంగా వస్తార్. పని కావద్దా' మౌలానా వాళ్ళని బెదిరించాడు. ఫోను పెట్టేసి మళ్ళీ రిసీవర్ నుంచి పైకి తీశాడు.

'జర లేటయింది సార్' - తెగపొగిడిన వ్యక్తి మౌలానాకి సంజాయిషీ ఇచ్చుకొన్నాడు. వాళ్ళకేసి కోపంగా చూస్తూ ఏదో నెంబర్ డయల్ చేశాడు.

'హలో... ఎడ్యుకేషన్ మినిస్టర్‌గారిల్లా...?' - మౌలానా ప్రారంభించాడు.

'——————'

'మంత్రి గారున్నారా...' వాళ్ళకేసి చూశాడు మౌలానా ఆ ముగ్గురూ సంబరపడినట్లు కనిపించారు.

'....———'

'ఆ - లేరా...' మౌలానా విసుక్కొన్నాడు.

ఆ ముఖాల్లో నీరసం ఆవహించింది.

'ఎక్కడికి వెళ్ళారు. కేంపుకా..? - ఎప్పుడొస్తారు.? మూడు రోజులు పడుతుందా..? ఎవరూ మాట్లాడేది. రామ్మూర్తా... నేనయ్యా రిపోర్టర మౌలానాని'

'———'

'నమస్తే...ఏంలేదు. ఆయనకో చిన్నపని చెప్పాను. చేస్తానన్నాడు. ఏమయిందో కనుక్కోందామని'

'———'

'సరే ఆయన రాగానే చెప్పు... నేను ఫోను చేశానని'

'....———'

'ఆ... నా ఫోన్ నెంబరా. పది దాటింతర్వాత 230036కే చెయ్యి. ఉంటా'. మౌలానా ఫోన్ పెట్టేసి వాళ్ళని ప్రెస్ రూం బయటకు తీసుకెళ్ళాడు. ఎదురుగా ఉన్న చెట్ల కింద మాట్లాడటం మొదలు పెట్టాడు.

'నరసింహా...' పిలిచాడు నిఖిలేష్.

'అయ్యా...' ప్రెస్ రూం ప్యూన్ నరసింహ వినయంగా వచ్చాడు.

'పేపర్ల ఫైల్సు కావాలయ్యా...' అడిగాడు.

'అవి లోపల ఉంటాయ్... కావాలంటె పట్టుకొస్తా' నరసింహ మరింత వినయంగా చెప్పాడు.

'పోయి - పట్రా' -

పది నిమిషాలకి పేపర్ల కట్టలతో నరసింహ ప్రత్యక్షమయ్యాడు. ఆ పేపర్లను అందుకొని వారం రోజుల క్రితం పేపర్లను తిరగేస్తున్నాడు నిఖిలేష్. ఇంకా ప్రెస్ రూంకి ఎవరూ రాలేదు. విద్యామంత్రి ప్రెస్ కాన్ఫరెన్సుకి ఇంకా అరగంట టైమ్ ఉంది. పేపర్ల కట్టను తిరగేస్తున్నాడు నిఖిలేష్. నాలుగు రోజుల తర్వాత సామ్య రేప్ కేసు గురించి వార్త ప్రచురించిందో పత్రిక. ఆ వార్తనే ఆసక్తిగా చదువుతున్నాడు. వార్తలో ప్రముఖంగా వివరాలు లేకపోయినప్పటికీ సికింద్రాబాద్ రైల్వే స్టేషన్ దగ్గరే సామ్యని దుండగులు రేప్ చేశారని రాసి ఉంది. సామ్యని ఆ దుండగులు లైట్ బ్లూకలర్ అంబాసిడర్ కార్లో కిడ్నాప్ చేశారని ఆ పత్రిక రాసింది. లైట్ బ్లూ అంబాసిడర్ కారా? ఈ రిపోర్టు ఎవరు రాశారు?

కారు గురించి రాయాలంటె చాలా పరిశోధించాలి. అంతకేజువల్‌గా ఎలా రాశారు? ఒకవేళ ఆ రిపోర్టర్ చూశాడా? ఎవరైనా అతనికి చెప్పారా? అంతక్లియర్‌గా రాశాడంటె ఏదో క్లూ దొరికి ఉండాలి. అదేమయి ఉంటుంది? ఈ రిపోర్టర్‌కి దుండగులు ఎవరో తెలుసా? తెలిస్తే ఎందుకు రాయటూ -!

నిఖిలేష్‌ని ఆ వార్త ముట్టేసింది. వెంటనే ప్రవీణ్‌కి ఫోన్ చేసి ఆ పత్రికలో ఆ వార్త రాసిన రిపోర్టర్ ఎవరో కనుక్కోమని — నిఖిలేష్ చెప్పాడు.

''పేపర్లలో మునిగిపోయావా?'' పక్కనే కూర్చుంటూ భారతి పలకరించింది.

'ఏవిటా వార్త...సౌమ్య....' మధ్యలోనే ఆగుతూ నిఖిలేష్‌కేసే చూసింది. నిఖిలేష్ తనకేసీ చూస్తు న్నాడు. 'ఏం అలా చూస్తున్నావ్... మింగేసేలా?'' భారతి భావయుక్తంగా అంది.

భారతి ఆ డ్రస్‌లో అందంగా ఉంది. తెలుగు తనం ఉట్టిపడే చీరకట్టూ, తీర్చిదిద్దిన కాటుక కళ్ళూ... నుదుట అందంగా ఉన్న పెద్దబొట్టూ... వాటిమీద ఎగిరిపడే ముంగురుల కదలికా... మధ్య మధ్యలో కళ్ళు మూసీ తెరుస్తూ తనకేసి విసిరే చిలిపి చూపులూ... భారతి కొత్త అందాలతో కని పించింది.

'ట్రిమ్‌గా తయారయ్యావ్. ఏదైనా ఫంక్షన్‌కి వెళు తున్నావా? వెళ్ళివచ్చావా??' చూపుతప్పిస్తూ ఏదో మాట్లాడాలని మాట్లాడాడు.

'నిన్న నీకు చూపించానే - మాకజిన్. ఈ చీర అతనిచ్చిందే. బాంబే నుంచి తీసుకువచ్చాడు. బాగుందా?'' కళ్ళను నిఖిల్‌కేసి తిప్పింది భారతి.

'చీర ఎలాఉన్నా... నువ్వు కట్టినందుకేమో మరింత అందంగా ఉంది' నిఖిల్ ఆ చూపులను తప్పించుకొంటూ ప్రశంసించాడు. భారతి పకపకా నవ్వింది.

ఆ నవ్వు సాగుతూండగానే 'జోకులు స్టార్ట్ అయ్యాయన్నమాట' అంటూ ప్రవేశించాడు రిపో ర్టర్ వెంకట్.

ఆ తర్వాత ఒక్కొక్కళ్ళే ప్రెస్ రూంలోకిరాసాగా రు.

'నిఖిల్ కేంటీన్‌కి పోయి కాఫీ తాగుదాం' భారతి పిలిచింది. ఇద్దరూ కేంటీన్‌వేపు నడుస్తున్నారు.

'నిఖిల్... నీ పెళ్ళట'?

భారతి ప్రశ్నకు ఉలిక్కి పడి 'ఎవరన్నారు?' అడిగాడు.

'ఎవరో మన జనాలే అనుకొంటూంటే విన్నాను' - భారతి నిఖిలేష్ వేపు తల తిప్పింది.

'ఆ అమ్మాయి ఎవరో చెప్పేశారా...' నిఖిల్ భార తికేసి చూశాడు. భారతి మొఖంలో మార్పు కని పించింది.

'లేదు... ఎప్పుడు పెళ్ళి'? డల్‌గా అడిగింది.

'ఇంకా నిర్ణయం కాలేదు'-!

''ఎప్పుడు నిర్ణయం అవుతుందీ...?

'దేనికయినా సమయం రావాలిగా?'

''అంటే...? ఆ సమయం ఇంకారాలేదనా...?''

భారతి కళ్ళల్లో కంగారు తొంగి చూసింది.

'మరి ఆ సమయం ఎపుడొస్తుందో నీకు నాపెళ్ళి ని చెప్పిన వాళ్ళని అడుగు. అది నేనూ తెలుసుకో వాలిగా? ఏమంటావ్? అవునూ వాళ్ళు ఆ వివరాలు నీకేం చెప్పలేదా...' నిఖిల్ నవ్వాడు.

'జోక్సుచాల్లే... 'నిజం' వాడివి నిజమే చెప్పు' నిలదీసింది భారతి.

'నిజం చెప్పాలంటె నా పెళ్ళి గురించి నువ్వు అడిగే వరకూ నాకేం తెలీదు. ఎలాగూ అడిగావుగా ఇంక ఆ సంగతి ఆలోచించాలి' భారతిని ఇరకా టంలో పెట్టాడు నిఖిలేష్.

'అది సర్లే... ముందు టోకెన్లు తీసుకో... నేను కాఫీ కౌంటర్ దగ్గర క్యూలో నిలబడతాను' అని చెప్పి నిఖిల్‌ని దాటి వెళ్ళిపోయింది భారతి.

హైదరాబాద్‌లో మున్సిపల్ కార్పొరేషన్ ఎన్నిక లు ప్రకటించి పదిరోజులైంది. నామినేషన్ల తేదీ దగ్గరపడుతున్న కొద్దీ పోటీ చేయాలనుకొనే వాళ్ళ హడావుడి జోరుగా ఉంది. పార్టీ కార్యాలయాల వద్ద టిక్కెట్లకోసం పైరవీలు నడుస్తున్నాయి.

ఈ మున్సిపల్ కార్పొరేషన్ ఎన్నికల సంద ర్భంగా ప్రజలు ఏమనుకుంటున్నారు? అనే విష యాన్ని వార్తగా రాయడానికి జంటనగరాల్లోని వివిధ ప్రాంతాలలో తిరుగుతూ స్థానిక ప్రజల సమస్యలను తెలుసుకొంటూ ముందుకు సాగుతు న్నాడు నిఖిలేష్.

సమస్యలు లేని ప్రజలూ... ఈతిబాధలులేని కాలనీలు కనిపించడం లేదు. ఉదయం అయిదు న్నరకి బయలుదేరాడు. అంతే అప్పట్నుంచీ మధ్యా హ్నం పన్నెండింటి వరకూ ఆ పనిలో తిరిగి వస్తూ భోంచేసి ఆఫీసుకు చేరాడు. రిపోర్టర్స్‌గదిలో రాంనాథ్ ఒక్కడే కనిపించాడు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

రాంనాథ్ నిఖిలేష్ కన్నా చాలా సీనియర్. రాజకీయ వార్తలు రాస్తూంటాడు. రాంనాథ్ మాట కొట్టినట్లుగా... నవ్వు ఓ వికటాట్టహాసంలా ఉంటూ ఎదుటి వాళ్ళను హడలగొడతాయి.

''ఏవయ్యా... నిఖిలేష్... పొద్దున్న ఆఫీసుకి వచ్చి

నప్పట్నుంచీ ఆ లూథర్ ఫోన్లు వాయించేస్తున్నాడు. అదేమిటో చూడు' ఆఫీసులోకి అడుగుపెడుతున్న నిఖిలేష్‌కి చెప్పాడు రాంనాథ్.

ఆపరేటర్‌కి లూథర్ నంబరు ఇచ్చి వెంటనే కాల్ అందుకున్నాడు. 'కెన్...ఐ స్పీక్ టు లూథర్...?'

అవతలనుంచి లేడని సమాధానం వచ్చింది.

ఎప్పుడువస్తాడో కనుక్కొని తాను ఫోను చేసినట్లు చెప్పమని అవతలివాళ్ళను కోరి ఫోన్ పెట్టేశాడు.

'ఆ లూథర్ నీకెలా తెలుసు-' రాంనాధ్ అడిగాడు.

'ఏదో మామూలు పరిచయం' నిఖిల్ చిన్నగా చెప్పాడు.

'వాడు కాలాంతకుడు. నాకు జర్నలిజంలో జూనియర్. మా జిల్లావాడేలే-అఖండుడు. జాగ్రత్త! కాలికేస్తే మెడకీ, మెడకేస్తే కాలికీ వెయ్యగలడు' రాంనాథ్ సీనియారిటీని ప్రదర్శిస్తూ హెచ్చరించాడు. నిఖిలేష్ చిరునవ్వులు చిందించాడు.

"అలా నవ్వుతావేమిటయ్యా. నేనేదో భయపెడుతున్నానని నవ్వుతున్నావా? నీకు అనుభవం తక్కువ. అలాంటి వాళ్ళను చూసి...చూసీ నాతల చూడు ఎలా రేగిపోయిందో రేగిన జుట్టుని సర్దుకున్నాడు రాంనాథ్.

రాంనాథ్‌కి సుమారు ఏభై ఏళ్ళుంటాయ్. నోరు పెద్దది. నోరుంటే తల కాస్తుందనే సిద్ధాంతాన్ని అమలు చేస్తున్నవాడు. రాజకీయ ప్రతినిధిగా చాలా కాలంగా రాజకీయాలు చేస్తున్నవాడు. పార్టీ విబేధాలు... రాజకీయ ముఠాల తేడాలతో ప్రమేయం లేకుండా అన్ని పార్టీల, రాజకీయ ముఠాల నాయకుల దగ్గర 'మనవాడు' అనే విధంగా సంచరించగల తెలివీ, దానితోటే ఏ పనినైనా మూడోకంటికి తెలీకుండా సాధించే తేట ఉన్నవాడు. సాధారణంగా ఇతర వ్యవహారాల్లో జోక్యం చేసుకోకుండా స్వీయ వ్యవహారానికే పరిమితమవుతూ ప్రత్యేక ప్రతినిధిగా కొనసాగుతున్నాడు. రాజకీయ వార్తలతో అన్ని వర్గాల వారినీ ఆకట్టుకోవాలనే తపనా వాటివల్ల నాయకుల దగ్గర తన పలుకుబడి పెరగాలనే తాపత్రయం ఉన్నవాడు.

ఫోను మోగుతోంది.

'నిఖిలేష్... ఆ ఫోను చూడవయ్యా...' రాంనాథ్ అన్నాడు.

నిఖిలేష్ ఆఫోను అందుకొని 'మీకేసార్... మీరేదో నంబర్అడిగారట' అన్నాడు.

'మంత్రిగారున్నారేమో కనుక్కోవయ్యా...?

'ఏ మంత్రిగారు సార్...'

"అదేనయ్యా... మన ఫారెస్టు మినిస్టర్..."

నిఖిలేష్ కనుక్కొన్నాడు. ఆ మంత్రిగార్ని లైన్‌లోకి పిలిపించి ఆ ఫోన్ రాంనాథ్‌కి ఇచ్చాడు.

'హ... హలో బాపిరాజుగారా... నమస్కారం! నేనూ రాంనాథ్‌ని...'

'నమస్కారం... ఏమిటీ చెప్పండి...' అవతలి కంఠం.

'ఏంలేదు సార్... నిన్న పార్టీ మీటింగ్ అయిన తర్వాత మిమ్మల్ని కలుద్దాం అనుకొన్నాను. కని పించినట్లే కనిపించి నన్ను అలాగే వదిలేసి వెళ్ళిపోయారు...'

'నేను నిన్ను వదిలెయ్యడమేమిటి రాంనాథ్... నిన్న హడావిడి నీకు తెలుసుగా... అసలే మనమీద ఏదో వాగుతున్నారు. ఎలాగూ పార్టీ మీటింగ్ అయిపోయింది. అదీకాక చాలా పనుండి నేరుగా సెక్రటేరియట్ వెళ్ళాను'...

'మీరువెళ్ళిన తర్వాత చాలాసేపు చర్చ జరిగింది. మీగురించి సుమారు ఓ గంటసేపు మాట్లాడుకొన్నారనుకొంటా...'

'ఏం మాట్లాడుకొన్నారయ్యా... తిట్లయితే తిట్టలేదుకదా... మనమీద కత్తిగట్టిన ఎం.ఎల్.ఎ.లు మటుకు నన్నుమంత్రివర్గంలోంచి తీసేస్తారని అపుడే ప్రచారం మొదలుపెట్టారు.'

'అబ్బే నేనైతే మీగురించి చెడుగా వినలేదు.'

'అవునూ... మంత్రివర్గంలో మార్పులు ఉంటాయంటావా...?' మంత్రి సందేహం.

'ఏదో చిన్నగా మార్పులు చేస్తారని అనుకొంటున్నారు... మీపేరు బాగానే మ్రోగిపోతోంది సార్'

'అంటే... మనపని ఖాళీనా...?'

'ఛ... అదేంసార్... అలా మాట్లాడతారు. మిమ్మల్ని తీసెయ్యడమా...'

'సరే రాంనాథ్! ఇపుడు ఓసారి రాకూడదూ...?'

'నేనా... రాలేను సార్... పనుంది'... రాంనాథ్ నొచ్చుకొన్నాడు.

'ఫర్వాలేదులేవయ్యా! నా కారు పంపిస్తా, ఓసారి





రా...' మంత్రి ఫోను పెట్టేశాడు.

రాంనాథ్ ఆ ఫోను నిఖిలేష్‌కి ఇచ్చి క్రెడిల్ చెయ్యమన్నాడు.

'మినిస్టర్ని అదరగొట్టేస్తున్నారేమిటి సార్...?' అడక్కూడదనుకొంటూనే నిఖిలేష్ అడిగాడు.

'నేను అదరగొట్టే స్థాయిలో వాడు ఎక్కడున్నాడయ్యా... నిన్న వాళ్ళ పార్టీ సమావేశం జరిగింది. అక్కడే కలిశాడు. మంత్రులశాఖల మార్పుల గురించి చర్చలు జరుగుతున్నాయా అనడిగాను. అంతే! కంగారుపడి పార్టీ ప్రధాన కార్యదర్శిచుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాడు' రాంనాథ్ చెబుతున్నాడు.

'మంత్రివర్గంలో మార్పులు జరుగుతున్నాయాండీ' అమాయకంగా అడిగాడు నిఖిలేష్.

'నీకుతెలుసా... నాకు తెలుసా... ఎవడికి తెలుసూ... ఏదో ఓ చిట్కావేశాం. చూద్దామని. దానికి ఈ మంత్రి కంగారుపడ్డాడు. అంటే ఏదో ఉందన్న మాట. ఎలాగూ రమ్మన్నాడుగా. అసలుసంగతి తెలుస్తుందిలే' రాంనాథ్ పెద్దగా నవ్వాడు.

మౌనంగా తలాడించాడు నిఖిలేష్.

'చూశావా... ఇవాళ నేనో వార్త రాస్తున్నాను. అదెవరికీ తెలీదు' రాంనాథ్ రహస్యం చెబుతున్నట్లుగా మెల్లగా చెప్పాడు.

'స్కూప్ పట్టారా?...?

'స్కూప్‌ని మించిన స్కూప్'—!

'ఆ... (...'

'అసమ్మతివర్గం వాళ్ళులేరూ... వాళ్ళు నిన్నరాత్రి ఓ పార్టీ చేసుకొన్నారు. ఆ పార్టీలో వాళ్లంతా పార్టీ కార్యదర్శిని దుమ్మెత్తిపోశారు. ముఖ్యమంత్రిని కూడా తిట్టారట. నాకది తెల్లారేసరికి తెలిసిపోయింది' మంచినీళ్ళు తాగడానికి ఆగాడు రాంనాథ్.

'ఆపార్టీ విశేషాలన్నీ రాసేస్తున్నారా...?'

'అదే కుర్రతనం. అలాచేశాం అనుకో... వాళ్ళేం తెలివితక్కువవాళ్ళా. 'అసలు పార్టీ ఏమిటీ?... మేమా...? పార్టీయా...? జరుపుకోవడమా...? నిజం ప్రత్యేక ప్రతినిధి రాసింది పచ్చి అబద్ధం' అంటూ వాళ్ళు ప్రెస్ కాన్ఫరెన్సుపెట్టి మరీ చెబుతారు...'' ఏవంటావ్ అన్నట్లు చూశాడు రాంనాథ్.

'నిజవేనండి...' సమర్థించక తప్పలేదు నిఖిలేష్‌కి.

'అందుకే ఏంచేశాను అనుకొన్నావ్... తెలివిగా అసమ్మతివర్గం చర్యలన్నీ పార్టీ కార్యదర్శికి అందించేశాను. ఇక చూస్కో! అక్కడ్నుంచి మొదలయ్యాయ్ పరుగులు. ముఖ్యమంత్రి దగ్గరికి హుటాహుటీన వెళ్ళాడు. పార్టీలోంచి ఆరుగుర్ని సస్పెండు చెయ్యడానికి ముఖ్యమంత్రిని ఒప్పించాడు. అదే మన వార్త'... ఎలా ఉందన్నట్లు చూశాడు రాంనాథ్.

సమాధానంగా నిఖిలేష్ నవ్వాడు

'' అలా నవ్వడం కాదు. అభిప్రాయాలు చెప్పాలి. రాజకీయాలు చదివితేరావు. వాటిని నేర్చుకోవడానికి బుర్రకావాలి. ఏదోవార్తలు రాయడం కాదు. ప్రజలకి ఉత్కంఠ కలిగించే వార్తలు రాయాలి. అర్థం అయిందా. ఇంకా నీకు అనుభవం కావాల్లే'- రాంనాథ్ వాగ్ధాటిని ఆప న్యూస్‌ప్రింట్ రైటింగ్ పాడ్ తీసుకొని అక్షరాలను పరుగు పెట్టించడంలో మునిగిపోయాడు. రిపోర్టర్ల రూం బయట నిలబడి నిఖిలేష్‌ని పిలుస్తున్నాడు ప్రవీణ్.

'ఎంతసేపయింది నువ్వొచ్చి?' నిఖిల్ నవ్వాడు.

'ఆ మహానుభావుడు మొదలుపెట్టినప్పటి నుంచీ ఇక్కడే నీ చూపుకోసం వేచిఉన్నాను.' ప్రవీణ్ విసుకున్నాడు.

'' లోపలికి రావచ్చుకదా ''!

'' ఆయనుండగానా.. వాయించేస్తాడు. అసలే పొద్దున్న ఓరేవుపెట్టాడు'' ప్రవీణ్ కేంటిన్ కేసి దారితీస్తూ నిఖిల్‌ని పదమన్నాడు.

'' ఏమయింది..? ''

'' మున్సిపల్ ఎన్నికలుకదా.. పార్టీ టిక్కెట్లకోసం పార్టీ ఆఫీసుల దగ్గర క్యూలు! ఫొటో తీద్దామని ఆరుగంటలకే వెళ్ళాను. మన సీనియర్ పొలిటికల్ గురూగారు అధికారపార్టీ కార్యాలయంలో కుర్చీలో కూర్చొనే కునికిపాట్లు పడుతున్నారు. పార్టీ సెక్రటరీని కలవడానికి బయట వందలాదిమంది క్యూలో ఉన్నారు. ఆఫోటో తీసుకొని లోపల ఎవరైనా ఉన్నారేమోనని చూశాను. గురూగారి దర్శనం అయింది. తప్పించుకుని వచ్చే లోపల పేరుపెట్టి అరిచాడు. తప్పలేదు. వెళ్ళాను. ''

'' ఆతర్వాత ఏమయింది-..?''

'' అరగంటపైగా తలతినేశాడు!''

'' ఛ... అలా అంటావేమిటి...?'' జాలిపడ్డాడు.

'' నీకలాగే ఉంటుంది. ఆ సెక్రటరీ రాంనాథ్‌గారు కార్డు పంపించిన గంటకు కూడా పిలవలేదట.

ఆ చిరాకు నామీద చూపించాడు. ఆ పార్టీని దుమ్మెత్తిపోశాడు. ఈ పర్వం నడుస్తూండగానే లోపల్నించి కార్యదర్శి బయటకు వచ్చాడు. అంతే... అంత మాట్లాడిన పెద్దమనిషీ జావలా జారిపోయాడు. మీతో పనుందనీ... రెండు నిమిషాలంటూ ఆ సెక్రటరీ వెంట వెళ్ళిపోయాడు ''

ప్రవీణ్ చెప్పుకుపోవడాన్ని ఆపుతూ '' అదిసరే.. ఇంతకీ నాపనేం చేశావ్..?'' నిఖిలేష్ గుర్తు చేశాడు.

'' అవును.. అసలు సంగతి మర్చేపోయాను. '' ప్రవీణ్ సర్దుకున్నాడు.

'' ఏమిటీ...? '' నిఖిలేష్ ముందుకు జరిగాడు.

'' ఉషస్సు పత్రికలో సౌమ్య కేసు రాసిన రిపోర్టర్ పేరు నగేష్. తెలివైనవాడే. నీ రిపోర్టు చూసి రియాక్ట్ అయ్యాడట. తన పరిశోధన మొదలుపెట్టాడు. సికింద్రాబాద్ స్టేషన్లో ఎవరో చెప్పారట ''

'' ఏవనీ... '' నిఖిలేష్ కంగారుపడ్డాడు.

''ఓ అమ్మాయిని నలుగురైదుగురు బలవంతాన తీసుకువెళ్ళడం చూశామని చెప్పారట. ఓ కార్లో ఎక్కించుకొని పోయారట '' ప్రవీణ్ చెప్పాడు.

''అదెలా సాధ్యం? బలవంతాన అమ్మాయిని లాక్కుపోతుంటే జనం చూస్తూ ఊరుకున్నారా? అంత దారుణంగా కార్లో ఎలా ఎక్కించుకుపోతారు? ఇదేదో నిజంకాదేమో ప్రవీణ్. ఏమైనా నగేష్‌ని ఓసారి కలుద్దాం''

'టీ' ముగించుకొని బయలుదేరారు ఇద్దరూ-




**పూర్తి**గా తెల్లవారకుండానే ఉదయం అయిదు గంటలకు నిఖిలేష్ ఓ వార్తకోసం పరుగులెత్తాడు. పాలమూర్ (మహబూబ్‌నగర్) కార్మికుల సమస్యలు రాయడానికి.. వాళ్ళు నివసించే ప్రాంతాలకు వెళ్ళాడు. ఆ కార్మికులు భాగ్యనగరంలోని భవన నిర్మాతలు. అంటే కష్టతం పనుల్లో ఆరితేరిన వాళ్ళు. శ్రీశైలం, నాగార్జునసాగర్, శ్రీరాంసాగర్ వంటి భారీ ప్రాజెక్టుల్లో కండ కరిగించిన ఆ కార్మికులు తరతరాలుగా విద్యకు దూరమై... స్థిరనివాసానికి నోచుకోకుండా పనికోసం కాంట్రాక్టర్ల కబంధహస్తాల్లో చిక్కుకుపోతున్నారు. ఈ కార్మికుల శ్రమశక్తిని కాంట్రాక్టర్లు దోచుకొంటున్నారు. గత్యంతరంలేని పరిస్థితిలో ఈ కార్మికులు వాళ్ళబారిన పడుతున్నారు. ఆ కార్మిక కుటుంబాలు ఎన్ని ఉన్నాయి? వాళ్ళ పనికిచ్చే జీతం, ఆ కుటుంబాల్లోని పిల్లల పరిస్థితి, కాంట్రాక్టర్ల లాభాలు, అన్నీ సేకరించి ఆఫీసుకి వచ్చేసరికి పదకొండు అవుతోంది. ఆరోజు 'నిజం' పత్రికని ముందుగా నిఖిలేష్ తీశాడు.'అసమ్మతివాదులపై సస్పెన్షన్ కత్తి?'- 'ఆరుగురిని బహిష్కరించేయత్నం'ఈ హెడ్... సబ్‌హెడ్ లైన్లతో ఓ వార్తని ప్రచురించారు. 'నిజం' పత్రిక మొదటి పేజీలో బాక్సుకట్టి మరీ వేశారు.

ఆవార్త కిందే 'బాపిరాజుపై అసమ్మతివాదులకుట్ర' అని మరో రాజకీయవార్త. 'రాష్ట్ర అటవీ శాఖమంత్రి శ్రీబాపిరాజును పరోక్షంగా దెబ్బతీయడానికి పార్టీలోని అసమ్మతివర్గానికి చెందిన కొన్ని వర్గాలు ప్రయత్నిస్తున్నట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. శ్రీబాపిరాజు అసమ్మతి వర్గంతో చాలాకాలంగా పోరాడుతున్నారు. ముఖ్యమంత్రితో ఏవిభేదాలూ లేని శ్రీ బాపిరాజు అసమ్మతివర్గం దృష్టిలో కంటకప్రాయంగా మారారు. ఆయన్ని ఎలాగైనా పదవీ భ్రష్టుణ్ణి చెయ్యడానికి ఆ వర్గాలు కుట్ర సాగిస్తున్నాయని శ్రీబాపిరాజు సన్నిహితవర్గాలు ఆరోపిస్తున్నాయి. శ్రీ బాపిరాజు మీద లేనిపోని ఆరోపణలను అసమ్మతివర్గాలు ముఖ్యమంత్రి ముందుంచడానికి విఫలయత్నం చేస్తున్నాయి. శ్రీ బాపిరాజు నిజాయితీని పార్టీ వర్గాలు ఏనాడూ శంకించలేదనీ. అధికార వర్గం ఆయన సేవాతత్పరతను ఎప్పటికీ గుర్తుంచుకొంటుందనీ పార్టీ కార్యవర్గ సభ్యులొకరు ఈ ప్రతినిధికి తెలియజేశారు ' ఇలా సాగిందా వార్త.

ట్రాఫిక్ వారోత్సవాల ప్రారంభం సందర్భంగా ప్రత్యేక వ్యాసం రాయడానికి ట్రాఫిక్ డిప్యూటీ పోలీస్ కమిషనర్ దగ్గరకి బయలుదేరుతూ ఆ వార్తలను చూస్తున్నాడు నిఖిలేష్. ఆ వార్త ఎన్నో సందేహాలను కలిగించింది. అసమ్మతివాదులు కుట్రచేస్తే అధికారంలో ఉన్న పక్షానికి చెందిన

మంత్రికి చేటు ఎలా జరుగుతుంది? ఆ కుట్ర ఎలా ఫలిస్తుంది? లేనిపోని ఆరోపణలు అందులోనూ అసమ్మతివర్గం చేస్తే ముఖ్యమంత్రి ఎలానమ్ముతాడు? మధ్యలో శ్రీ బాపిరాజు ఘనకీర్తిని వర్ణించడం ఎందుకు? ఎవరా కార్యవర్గ సభ్యుడు? ఎంతగింజుకొన్నా నిఖిలేష్‌కి అర్థంకాలేదు. ఆవార్త ప్రజలకి ఎంతవరకు ఉపయోగపడుతుందనే విషయం బహుశా తన రాజకీయ పరిజ్ఞానానికి అందదేమోననిపించి నిఖిలేష్ ఆలోచించటం మానేశాడు.

'గుడ్‌మార్నింగ్...' విష్‌చేస్తున్నాడు, ఎదురుగా వాచ్‌ఫ్యాక్టరీ పి.ఆర్.ఒ. లూథర్, బయల్దేరుతూండగా. తనూ విష్‌చేశాడు నిఖిలేష్.

"బిజీగా ఉన్నారా?" లూథర్ 'నిజం' పత్రికకేసి చూస్తూ అన్నాడు.

"జస్ట్ చిన్నపని... ట్రాఫిక్ డి.సి.పి.ని కలవాలి. ఓ అరగంటపని"- నిఖిల్ చెప్పాడు.

"మీతో ఓ విషయం తీరిగ్గా కూర్చొని మాట్లాడాలి. వారంరోజులనుంచీ ప్రయత్నిస్తున్నాను. కుదరడంలేదు... మీ కెప్పుడు వీలుంటుంది" లూథర్ సౌమ్యంగా మాట్లాడుతున్నాడు.

"అసలు విషయం ఏమిటీ...?"సూటిగా ప్రశ్నించాడు నిఖిలేష్.



"ఇక్కడ మాట్లాడటం బాగుండదేమో. ఓ పనిచేద్దాం. మీకు అభ్యంతరం లేకపోతే నేను మీకూడా వస్తాను. ముందు మీపని కానివ్వండి. ఆతర్వాత ఎక్కడైనా కూర్చొని మాట్లాడుకొందాం" ఏవంటారు అన్నట్లు చూశాడు లూథర్.

"నో ప్రాబ్లమ్" అంటూ లూథర్‌ని వెనక ఎక్కించుకొని నిఖిల్ మోటార్‌సైకిల్ పోనిచ్చాడు.

"మీరు జర్నలిజం చేశారా?" నిఖిల్ అడిగాడు.

"ఎప్పుడో చేశాను. మా సీనియర్ మీ రాంనాథ్‌గారు...!"

"జర్నలిజం చేసి పి.ఆర్.వోగా...?" నిఖిలేష్ రోడ్డుమీద ఏదో అడ్డంవచ్చి మాట్లాడటం ఆపేశాడు.

"డిగ్రీ అయింతర్వాత ఏ ఉద్యోగం రాలేదు. ఏంచెయ్యమంటారు. ఏదో ఒకటి చెయ్యాలిగా! జర్నలిజం చేశాను. ఆ సర్టిఫికెట్‌తోనే ఈ ఉద్యోగం వచ్చింది"- నిఖిలేష్ సందేహాన్ని తీర్చాడు లూథర్.

"రిపోర్టర్‌గా ఏపత్రికలోనైనా చేరలేకపోయారా...?"

"ఎందుకో ఆ వృత్తిలో నేను రాణించలేనని పించింది. పత్రికా వృత్తిలో కాకలుతీరి, ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్న జర్నలిస్టులు ఏ జర్నలిజం కోర్సులు చదివారు చెప్పండి. పత్రికా రచన నా దృష్టిలో ఓ ఆర్ట్. గొప్పనటుడు కావడానికి, ఒక సంఘసంస్కర్తగా తయారుకావడానికి, అలానే మంచి జర్నలిస్ట్ కావడానికి కోర్సులు అవసరంలేదని నా అభిప్రాయం. కందుకూరి, ఖాసా, కాశీనాథుని నాగేశ్వరరావు ఏ జర్నలిజం బడిలో చదివారు?- చెప్పండి"

లూథర్ మాటలతీరు నిఖిలేష్‌ని ఆకట్టుకొంటోంది.

"అయితే ఈ జర్నలిజం కోర్సులే దండుగ అంటారా?" నిఖిలేష్ నిలదీసినట్టు ప్రశ్నించాడు.

"అని నేను అనను. ఈ కోర్సులు ప్రాథమికంగా జర్నలిజం గురించి తెలుసుకోవడానికి ఉపయోగపడతాయి. అందుకే నాలా ఏ ఉద్యోగంకోసమో ఈ కోర్సులను చదివేవాళ్లు ఎక్కువగా ఉన్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ఎంతమంది జర్నలిజం వృత్తే ధ్యేయంగా వస్తారు? పుస్తకాలు చదివి ఆ కోర్సులో పాస్ అవడానికి కొంచెం కష్టపడాలి. జర్నలిజం కోర్సులో పాస్ అయినంతమాత్రాన నన్ను ఈ ఫళంగా ఓ పరిశోధనాత్మక వార్త రాయమంటే అది నావల్ల అవుతుందా? కానీ పరిశోధనాత్మక వార్త ఎలా ఉండాలనే విషయాన్ని పుస్తకాల్లో రాసింది రాసినట్టు గడగడా చెప్పగలను. అదే విషయాన్ని రాయమంటే పరీక్షల్లో ప్రశ్నకి జవాబులా పదిపేజీలు రాసి గోల్డ్‌మెడల్ కూడా సాధించగలను. వార్త మటుకు లాభంలేదు" లూథర్ చెప్పుకుపోతున్నాడు.

"ఈ వృత్తిలోకి ఈమధ్య ఎవరెవరో వచ్చేస్తున్నారు. వాళ్లలో ఎంతోమంది కంటె మీరు బెటర్" నిఖిలేష్ బైక్‌ని పక్కకు పోనిస్తూ అన్నాడు.

లూథర్ నవ్వుతున్నాడు. ఈలోగా డి.సి.పి ఆఫీసు వచ్చింది. మోటార్‌సైకిల్ ఆపి "ఎందుకు నవ్వుతున్నారు" నిఖిలేష్ అర్థం కానట్లు చూశాడు.

"మీపని కానివ్వండి. తీరిగ్గా మాట్లాడుకొందాం" లూథర్ లౌక్యం ప్రదర్శించాడు.

"రండి" అంటూ లూథర్‌ని తీసుకెళ్లి... డి.సి.పి. రూంలోకి నిఖిలేష్ కార్డు పంపించాడు.

రెండు నిమిషాల్లో పిలుపునందుకొని లోపలికి వెళ్లాడు.

"కూర్చోండి"- డి.సి.పి. సాదరంగా ఆహ్వానించాడు.

డి.సి.పి. పక్కనున్న వ్యక్తిని చూసి నిఖిలేష్ ఆశ్చర్యపోయాడు. వాడు జోగులు. దొంగతనం... వార్తల అపహరణ... అంటే పత్రికలలో వార్త రాక ముందే సంబంధిత పార్టీలకు ఆ విషయాన్ని చేరవేయటం... వంటి పనులు చేసినందుకుగాను 'నిజం' పత్రికలో అటెండర్‌గా పనిచేసిన జోగుల్ని తీసేశారు. జోగులు సేవలకు నెలజీతం ముడుపు కట్టి మరీ పంపించారు.

"ఈ రిపోర్టర్ మీకు తెలుసా-?" లూథర్ నిఖిలేష్ చెవిలో అడిగాడు.

'జోగులు రిపోర్టర్ అయ్యాడా?!' ఆశ్చర్యంలో మునిగిపోయాడు నిఖిలేష్.

'వీడేం రిపోర్టరండీ... మా దగ్గర అటెండర్‌గా పని చేసేవాడు. ఎప్పుడో మా వాళ్ళు తీసేసారు." లూథర్ కేసి తిరిగి నిఖిలేష్ నెమ్మదిగా చెప్పాడు.

'భలేవారే. నన్ను రెండు నెలల కిందట కలిశాడు. రిపోర్టర్ని అంటూ కలిసి మీ ఎం.డి. మీద ఆరోపణలున్నాయి అన్నాడు. ఏమిటన్నాను. ఏవేవో చెప్పాడు. అవి రాస్తానన్నాడు. అవి రాయకుండా ఉండాలంటే తన స్నేహితుడికి ఓ ఉద్యోగం

ఇప్పించాలని బెదిరించాడు. నాకు అసహ్యం వేసి మా ఎం.డి. దగ్గరకు పొమ్మన్నాను. మా ఎం.డి. ఏం చేశాడో తెలీదుకాని మళ్ళీ ఇదే వీణ్ణి చూడడం' లూథర్ జోగులు వ్యవహారాన్ని వివరించాడు.

'మా పని చూడండి సార్' జోగులు బ్రతిమాలు తున్నట్లుగా కళ్ళుపెట్టి చేతులతో అర్థిస్తున్నాడు.

'సరే... అలాగే అన్నానుగా' డి.సి.పి. వాణ్ణి వదిలించుకోవడానికి తంటాలు పడుతున్నాడు.

జోగులు నిఖిలేష్, లూథర్‌లను గుర్తుపట్టినట్లు గా చెయ్యి పైకెత్తి 'వస్తా. సార్' అని డి.సి.పి.కి చెప్పి వెళ్ళిపోయాడు.

"చూడండి నిఖిలేష్..వీడెవడో 'అలనాడు' పత్రిక రిపోర్టరట! పేరు జోగులు. రిపోర్టర్ కదాని లోపలికి పిలిచాను. వార్త కోసం కాదు వాడు వచ్చింది. ఆ పత్రిక ఎడిటర్‌కు హిమాయత్‌నగర్ సెంటర్లో ఓ బిజినెస్ కాంప్లెక్సు ఉంది. అక్కడ రద్దీ ఎక్కువని మా వాళ్ళు 'నో పార్కింగ్' బోర్డు పెట్టేశారు. అది తీయించడానికి వీడు పైరవీ చేస్తున్నాడు. ఒకటే నస. ఏం చేస్తాం..రిపోర్టర్!"

డి.సి.పి. ఫుల్‌స్టాప్ లేకుండా చెబుతూ 'మీరే పైరవీ కోసం వచ్చారన్నట్లుగా' చూశాడు. నిఖిలేష్ ఆడి.సి.పి. భావాన్ని మార్చడానికి చాలా కష్ట పడ్డా డు. ట్రాఫిక్ సమస్యల గురించీ, పోలీసులు తీసు కొనే చర్యలు, ప్రణాళికలు, పథకాలు మొదలైన వార్తకు సంబంధించిన వివరాలన్నీ అడిగి, రిపోర్టర్ల నందర్నీ ఒకేలా చూడకూడదనే భావాన్ని ఆ డి.సి.పి.లో కలిగించేలా ప్రవర్తించి బయటకు వచ్చే శాడు.

మోటార్ సైకిల్ ఎక్కుతూ "చూశారా జోగులు ఫార్సు. వార్తలు రాయడం చేతకాకపోతే మేనేజి మెంట్ తీసేస్తారనే భయంతో ఇలాంటి పైరవీలు చేసే రిపోర్టర్లు తయారయ్యారు. ఈ వృత్తిని ఆ స్థితికి దిగజార్చడం ఇష్టం లేకే నేను పి.ఆర్.ఒ అయ్యాను.' లూథర్ చెప్పాడు.

"జోగుల్లా మీరూ అవుతారని గ్యారంటీ ఏవుందీ?"

"జోగుల్లాంటి వాడు పత్రికకు ఒకడుంటే మిగి లిన వాళ్ళు ఎంత పనిచేసినా ఉపయోగం ఉండ దు. వాడే మేనేజిమెంట్‌కు దగ్గరగా ఉండి మిగతా వాళ్ళమీద పెత్తనం చేస్తాడు" లూథర్ పూర్తి చేశా డు.

హొటల్లో కూర్చొన్నారిద్దరూ..'మీ విషయం...చె బుతారా!?"

'సౌమ్య మానభంగం, హత్య వార్త మీరే రాశారుక దూ? ఏమ్ ఐ కరెక్ట్' లూథర్ గొంతు మారింది.

—సౌమ్య హత్య కేసు—నిఖిలేష్ ముఖభావాలు క్షణక్షణానికి మారుతున్నాయి.

'ఎస్'—అయితే ఏమిటి అన్నట్లుగా నిఖిలేష్ చూశాడు. అతనిలో ఆదుర్దా పెరుగుతోంది. లూథర్ ఏదైనా రహస్యం చెబుతాడా?. గుండె వేగంగా కొట్టుకొంటోంది.

'నాకో ఫ్రెండ్ ఉన్నాడు. వాడో బిజినెస్ చేస్తున్నా డు. మీరు మరోలా అనుకోవద్దు. వాడు ఉమనైజర్. అంటే ఇష్టపడి వచ్చే అమ్మాయిలతోనే తిరుగుతా డు. ఆ బలహీనత తప్పిస్తే వాడు చాలా మంచివా డు. పెద్ద పెద్ద కంపెనీల్లో పని చేశాడు. ప్రస్తుతం స్వంతంగా బిజినెస్ పెట్టుకొన్నాడు. వాడికి మర్డర యిన సౌమ్య కనిపించిందట.' లూథర్ కాఫీ తాగడా నికి ఆగాడు.

'మర్డరయిన సౌమ్య కనిపించిందా?—ఏమిటి మీరనేది?' నిఖిలేష్ కంగారుగా అన్నాడు.

'నో అలా కాదు. సౌమ్య మర్డర్ కాకముందు మా వాడికి కనిపించింది' లూథర్ ఓ క్షణం నిఖిలేష్‌ని చూశాడు.

'ఎక్కడ... ఎప్పుడు...' నిఖిలేష్‌లో టెన్షన్ పెరిగి పోతోంది.

'మీ ప్రశ్నలన్నిటికీ వాడయితేనే సరిగ్గా సమా ధానం చెప్పగలడు.' లూథర్ దాటేశాడు.

'మీ ఫ్రెండ్‌ను మనం కలుసుకోవాలి...' నిఖిలేష్ కంఠం దృఢంగా ఉంది.

'తప్పని సరిగా...కానీ వాడు బెంగుళూరు వెళ్ళా డు. రాగానే నేనే మిమ్మల్ని కలిసి చెబుతాను. మనం ఎక్కడైనా కూర్చొని మాట్లాడు కొందాం' లూథర్ అనునయంగా చెప్పాడు.

"అతని పేరు ...?"

"డేవిడ్"

★ ★ ★

'నిఖిలేష్'.... 'నిఖిల్'.... చప్పట్లు వినిపించి ఆగాడు నిఖిలేష్. వెనక్కు తిరిగి చూస్తే భారతి. అశోక్‌నగర్ రోడ్డుమీద నిలబడి నిఖి లేష్‌ను పిలిచి ఆపింది.

'ఎంతకాలానికి దొరికావ్... మా ఇంటికి వస్తానని చెప్పి ఎగ్గొట్టావ్. ఇప్పుడు తప్పించుకోవడానికి కుదరదు' అంటూ నిఖిలేష్ చెయ్యి పట్టుకొంది భారతి. ఆ చెయ్యిని విడిపించుకొంటూ 'పని పెరిగింది' అన్నాడు.

'ఫోన్లో దొరకవ్- సెక్రటేరియట్‌కు రావడమే లేదు. అంత బిజీ ఏమిటీ...? భారతి నిఖిలేష్‌ను తదేకంగా చూస్తూ అంది.

'తీరిగ్గా చెబుతానుగానీ... పొద్దున్నే ఈ అశోక్‌నగర్ రోడ్డుమీద ఉన్నావెందుకు..?'

నిఖిలేష్ ప్రశ్నకు బదులుగా ఎదురుగా ఉన్న ఓ మేడను చూపించి తమ ఇల్లే అంది.

ఇంటికి రమ్మని బలవంతం చేసింది.

మోటార్‌సైకిల్ ఇగ్నీషియన్ కీ కూడా తీసేసి ఇక రాకతప్పదంది.

తప్పేది లేదనుకుంటూ భారతిని అనుసరించాడు.

'నువ్వు సికింద్రాబాదు నుంచి వచ్చేదానివి కదా...? ఈ ఇల్లూ..' అర్థోక్తిగా నిఖిలేష్ ఆగిపోయాడు.

'ఇది మా పెద్దన్నయ్యది. ఆయనకు పెళ్ళికాలేదు. ఈమధ్యనే పోయారు..' భారతి ముఖంలో రంగులు మారాయి.

'ఐయామ్ వెరీసారీ'- నిఖిలేష్ అన్నాడు.

'లోపలికి రా... నువ్వు మా ఇంటికి వస్తానని డేట్‌కూడా ఇచ్చి ఎగ్గొట్టావ్.. గుర్తుందా...' భారతి మామూలుస్థాయికి సర్దుకొంది.

'ఇపుడు వచ్చేశానుగా...' నిఖిలేష్ నవ్వాడు.

'అహ.. నువ్వు వచ్చావా..! నేనే నిన్ను లాక్కొనివచ్చా.. లేకుంటే దొరుకుతావా?' భారతి నవ్వుతూ శ్రుతి కలిపింది.

'ఏమయినా ఇంక తప్పదుగా'- భారతి కళ్లలోకి చూశాడు నిఖిలేష్.

ఆ అందమైన కళ్లల్లో అనురాగాన్ని వెతికాడు.

అందంగా కనిపిస్తోందా ఇల్లు. ఇంటికి ముందు ఆకర్షణీయంగా ఉన్న పూలకుండీలూ... గోడలకి వేలాడుతూ రకరకాల లతలూ ఉన్నాయి. హాల్లోకి నడిచారు. కలర్ టి.వి. ఖరీదైన సోఫాలు. అలంకరణకిపెట్టిన చిన్నచిన్న బొమ్మలు చూడముచ్చటగా ఉన్నాయి. ఆ ఇంటి హంగులను చూస్తూ గోడలకు అమర్చిన మోడరన్ పెయింట్స్‌ను చూస్తూ 'నువ్వు ఆర్టిలవర్‌వే' అన్నాడు నిఖిలేష్.

'ఇవన్నీ మా అన్నయ్య వేసినవి'- భారతి నిఖిలేష్‌కేసి చూస్తూ చెప్పింది.

'నాతో ఏదో పనుందన్నావ్..?' భారతిని చూశాడు నిఖిలేష్.

'అలా పరుగుపరుగున అన్నీ అడిగేసి నన్ను వదిలించుకుందాం అనుకొంటున్నావా.. ఇవాళ అదేంకుదరదు. నీ లంచ్ ఇక్కడే నాతోపాటే..' భారతి గడుసుగా అంది.

'ఈరోజు కుదరదు. బందరు నుంచి ఓ ఫ్రెండ్ వచ్చాడు. వాడితో లంచ్‌కు వస్తానని చెప్పాను... సారీ...' నొచ్చుకొన్నాడు నిఖిలేష్.

'ఎప్పుడూ.. ఏదోచెప్పి తప్పించుకోవడమేనా.. ఇవాళ ఆదివారం తెలిసిందా. నిన్ను చూసిందగ్గర్నుంచీ చాలా హేపీగా ఉన్నా. షడన్‌గా అలా ఏవో సాకులు చెప్పి నా హేపీనెస్ పాడుచెయ్యొద్దు. ఇది చాలా అన్యాయం నిఖిల్. నీకోసం ఎంతగా ఎదురుచూశానో నా మనసుకే తెలుసు. ఈరోజుమటుకు నాగురించి ఉండిపో నిఖిల్' దాదాపు దీనంగా అంది భారతి.

'సరే... లంచ్‌సైంకి ఆలోచిద్దాం' అంటూ ఎదురుగాఉన్న వీక్లీలు అందుకొన్నాడు నిఖిలేష్.

'వన్‌మినిట్' అంటూ వేగంగా లోపలికివెళ్ళి అయిదు నిమిషాల తర్వాత కాఫీతో ప్రత్యక్షమైంది భారతి. ఓ గంటసేపు రాష్ట్ర రాజకీయాలు.. దేశ పరిస్థితి పేపర్లు.. మిగతా జర్నలిస్టుల ప్రవర్తన దొర్లిపోయాయి. ఆ తర్వాత భారతి మాట్లాడుతోంది. నిఖిలేష్ ఆసక్తిగా వింటున్నాడు.

భారతి త్వరలో ఎడిటర్ కాబోతోంది. అందుకే నిఖిలేష్‌ను సంప్రదించాలనుకొంది. నిఖిలేష్‌కు చెప్పకుండా ఏపనీ చెయ్యడానికి మనస్కరించదంది. నిఖిలేష్ తన సర్వస్వంగా భావిస్తోందిట. నిఖిల్ కనిపిస్తే కొండంత ధైర్యం కలుగుతుందట. నిఖిల్ చేయూత ఉంటే ఎన్ని మెట్లయినా ఎక్కేస్తానని చెప్పింది.

"కొడుకున్న కన్య - మొగుడు లేని కొడుకు" కథ!

# మల్లాది వెంకట కృష్ణమూర్తి

డైరెక్ట్ నవల

## వెడ్డింగ్ బెల్స్ వెల రూ. 20/-

వెలువడింది!




ఈ పుస్తకాల కోసం మీ దగ్గరలో వున్న పుస్తక విక్రేతనడగండి. లేదంటే తెప్పించిపెట్టమనండి. వీలుకాదంటే మీకు కావల్సిన పుస్తకాల ఖరీదు మొత్తం MO చేస్తే రిజిష్టర్డ్ పోస్ట్‌లో పంపిస్తాము.




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

3237, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-500 003

నిఖిల్ సలహా సంప్రదింపులు జీవితాంతం కావాలని కోరుకొంటోంది.

ఇలా గంటలు దొర్లిన ఆ సమయం నిఖిలేష్‌ను కంగారుపెట్టింది. ఏనాడు ఎవరితోనూ ఒంటరిగా అంతసేపు చర్చించని నిఖిలేష్ భారతి మాటలకు మైమరచిపోతున్నాడు. ప్రేమతరంగాలు విద్యుత్‌లా శరీరమంతా వ్యాపిస్తున్నాయి. భారతి అందాలు మనసంతా నిండిపోతున్నాయి. ప్రేమసాగరంలో ఓలలాడుతున్నాడు. మనసులో గూడుకట్టుకున్న ప్రేమ వలయాలు ఒక్కొక్కటీ బయటకు వస్తున్నాయి. భారతి విషయంలో ఓ నిర్ణయానికి రాలేని నిఖిలేష్ మనసు ఇప్పుడిప్పుడే బయటపడతానంటోంది. భారతి మత్తెక్కించే మాటలు నిఖిలేష్‌లో ఆశలూ... కోర్కెలూ రేపుతున్నాయి.

అదేపరిస్థితిలో భారతి ఉంది. నిఖిల్‌కు దగ్గరగా సోఫాలో కూర్చొని అతని చెయ్యి నిమురుతోంది. భారతి ముంగురులను సవరిస్తున్నాడు నిఖిలేష్. మనసు ఎంతో తేలికపడిన భావం కలుగుతోంది. అవ్యక్తమైన ఆనందం నిఖిలేష్‌కు సంతోషాన్ని కలిగిస్తోంది. సరదాకైనా భారతి మాట్లాడిన ఏ మాటనూ తృణీకరించలేదు. పరాచికానికైనా వాదనలోకి దిగలేదు.

భారతి ఎదుట అతను మంత్రముగ్ధుడే అయ్యాడు.

అతని తపనంతా తన మాటలతో ఆమెను ఆనందపరచాలని..

ఆమె ఆలోచనంతా అతని మనసంతా నిండిపోవాలని.

ఒకరికొకరు దగ్గరయ్యారు.

మనసులు కలిశాయని తెల్చుకొన్నారు.

కలిసిన మనసుల బంధాన్ని శాశ్వత బంధం చేసుకోవాలనే ఓ నిర్ణయానికి వచ్చేశారు.

హాయిగా.. మత్తుగా భారతి నిఖిలేష్ ఒడిలో తలపెట్టి ముగ్ధమనోహరంగా భావి నిర్ణయాలను... కోర్కెలనూ చెబుతోంది.

మత్తుగా మగతగా ఏనాడూ లేని పరమానందంతో ఆలకిస్తున్నాడు నిఖిలేష్.

★ ★ ★

'నిజం' కార్యాలయంలోని కారిడార్‌ని దాటుతూ వెళుతున్న ఫోటోగ్రాఫర్ ప్రవీణ్ దృష్టిలో పడ్డాడు నిఖిలేష్.

అలసిన ముఖం-చెదరిన క్రాఫ్... అయినా ఆ ముఖంలో గంభీరత్వం పోలేదు.

ప్రవీణ్‌ని కూడా చూడకుండా నేరుగా దాటిపోయాడు నిఖిలేష్.

"ఇక లాభంలేదు. చూడడు" అనుకొని నిఖిలేష్‌ని పిలిచాడు ప్రవీణ్.

"ఓ నువ్విక్కడున్నావా?" అనుకొంటూ నిఖిలేష్ వెనక్కి వచ్చాడు.

అప్పటికి వాళ్ళిద్దరూ కలిసి రెండురోజులైంది. ఎవరిపని వాళ్ళది. ఫోటోలకోసం ప్రవీణ్ తిరుగుతుంటాడు. వార్తలకోసం నిఖిలేష్ పరుగులు పెడతాడు. లక్ష్యం ఒకటే అయినా పనిచేసే విధానంలో మటుకు తేడా ఉంది. నిఖిలేష్ ఓ క్షణం ఆలస్యంగా వెళ్ళినా ఫర్వాలేదు. కాని ఆక్షణంలోనే ఓ గొప్పఫోటో మిస్' కాగలడు ప్రవీణ్. అందుకే అందరికంటే ముందుంటాడు.

'ఏవిటీ రెండురోజుల నుంచీ మిస్ అయ్యావ్. అసలు ఆఫీసుకి వస్తున్నావా?' నిఖిలేష్‌ని కారిడార్లోనే ప్రశ్నించాడు. ప్రవీణ్.

'ఏవుంది... టీచర్ల సమ్మె...వాళ్ళ డిమాండ్లు సరైనవి కాదని యూనియన్లలోనే గొడవలవుతున్నాయ్. ఈలోగా ప్రభుత్వం సెలవలు ప్రకటించింది. ఎక్స్‌ప్రెస్ వాళ్ళు ఓ ప్రత్యేక రిపోర్టు కూడా రాసేశారు. మన అమరేందర్‌గారు స్పెషల్ రిపోర్టు రాయమని రెండురోజులనుంచీ నావెంట పడ్డారు. ఆగొడవలో ఇరుక్కుపోయాను. ఇవాళతో ఆపని అయిపోతుంది-' నిఖిలేష్ సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

'ఎంతయినా అంతఖాళీ దొరకదా..?' ప్రవీణ్ వాదనకు దిగాడు.

'నీకేం... ఓ ఫోటో క్లిక్‌మనిపిస్తావ్... దాంతోసరి' నిఖిలేష్ ప్రవీణ్‌ని ఆటపట్టించడానికి ఉద్యుక్తుడయ్యాడు.

'ఆపని నువ్వు చెయ్యరాదూ...' ప్రవీణ్ అతని ఎదురుతిప్పాడు.

'ఆపని చేతనయితే ఈ తిప్పలుఎందుకు. హాయిగా మెడలో కెమెరా వేలాడదీసి ఇష్టంవచ్చినట్లు 'క్లిక్' నొక్కితే ఫోటోలు వచ్చేసేవి' నవ్వుతూ నిఖిలేష్




అదెంతపని అన్నట్లు మాట్లాడాడు.

'ఆ... క్లిక్ దగ్గరే ఆగు. ఇష్టంవచ్చినట్లు 'క్లిక్' మనిపిస్తే వచ్చిన ఫోటోలు అలాచూడు అక్కడుంటాయ్' అని ఓ చెత్త బుట్టను చూపించాడు ప్రవీణ్.

హాయిగా నవ్వుకొన్నారిద్దరూ.

'అదిసరే.. నేను నగేష్‌కి చెప్పాను. ఇవాళ కలుస్తామని. ఎనిమిదింటికి ప్రెస్‌క్లబ్‌కి వస్తానన్నాడు. మనం తప్పనిసరిగావెళ్ళాలి. అతనికి నువ్వు తెలుసట. చాలా ఆసక్తిగా ఉన్నాడు.'

ప్రవీణ్ మాట్లాడటం పూర్తికాకుండానే "కొంప తీసి విషయమంతా చెప్పేశావా" నిఖిలేష్ అడిగాడు.

'నేనేం చెబుతాను. నగేష్ నీ ఫ్రెండ్‌షిప్‌మీద ఆసక్తి చూపిస్తున్నాడు. అన్నాను. దానికే అంత కంగారు పడతావ్'... ప్రవీణ్ నిఖిలేష్‌ని అనునయించాడు.

'అమరేందర్ వచ్చారా?' నిఖిలేష్ మాటమార్చాడు.

"ఆయన వచ్చి రెండుగంటలయింది. నీకోసం అరడజన్లు సార్లు అడిగాడు. వెళ్ళు... వెళ్ళు..." ప్రవీణ్ నిఖిలేష్‌ని చిరునవ్వుతో సాగనంపాడు.

నిఖిలేష్, అమరేందర్ చర్చల్లో మునిగిపోయారు. టీచర్ల సమ్మె సమస్య మీద నిఖిలేష్ రిపోర్టు రాసి డెస్క్‌కి పంపించాడు. ఆసాయంత్రంవరకూ జిల్లాలోని విలేకరులకు పంపాల్సిన ఉత్తరాలు, ప్రశ్నావళిలూ.. ఇతర ఆదేశాలు తయారుచేశారు. జిల్లాల వార్తా సేకరణా సామర్థ్యాన్ని పెంచే చర్చలు, ఇతర ఆఫీసు విషయాలు ఎనిమిదింటివరకూ చర్చల్లో చోటుచేసుకున్నాయి. మధ్య మధ్య టెలిఫోన్లు. ఎడిటర్‌గారి పిలుపులు, విజిటర్ల ఈతిబాధలు రెండు గంటల సమయాన్ని తినేశాయి.

రాత్రి ఏడున్నర ప్రాంతంలో సెక్యూరిటీ నుంచి అమరేందర్‌కి రెండు కట్టలు కాగితాలు అందాయి. అందులో ప్రెస్‌నోట్లు, ఇతర సమాచారాలు ఉన్నాయ్. ఓ కాగితాన్ని చేతోపట్టుకొని ఉలిక్కిపడ్డాడు అమరేందర్.

'నిఖిలేష్-రాత్రి పదింటికి అత్యవసరంగా కేబినెట్ సమావేశమవుతోంది. మన రిపోర్టర్లు ఎవరున్నారు? చూడు.. చూడు రాంనాథ్ ఉన్నాడేమో...' అన్నాడు. నీరసం ముఖంతో తిరిగి వచ్చిన నిఖిలేష్‌ను చూస్తూనే.

'ఎవరూలేరా-' అనడిగి రాంనాథ్ ఇంటికి టెలిఫోన్ చేశాడు. ఆ వ్యక్తిలేడని జవాబిచ్చింది ఆపరేటర్.

'నిఖిల్... ఇకతప్పదయ్యా... ఓపనిచెయ్యి... నువ్వు ఇప్పుడు వెళ్ళిపో... పదిగంటలకి సెక్రటేరియట్‌కి వెళ్ళు. చీఫ్ మినిస్టర్ ఛాంబర్ దగ్గర మన పొలిటికల్ రాంనాథ్ కనిపిస్తారేమో చూడు. ఆయనుంటే ఇంటికి వెళ్ళిపో'... చాలా చక్కని సూచన ఇచ్చాడు అమరేందర్.

ఒకవేళ రాంనాథ్ అక్కడ లేకపోతే, ఆసమావేశ సారాంశం విని తాను రిపోర్టు ఇవ్వాలి. అది అమరేందర్ చెప్పలేదు. నిఖిలేష్‌కి అర్థంఅవని విషయం కాదది.

వస్తానని లేచాడు నిఖిలేష్.

తప్పదన్నట్టుగా తలూపాడు అమరేందర్. ప్రవీణ్‌తోకల్సి నిఖిలేష్ ప్రెస్‌క్లబ్‌కి వచ్చే సరికి ఎనిమిది దాటింది. ప్రెస్‌క్లబ్ భవనం మెట్లదగ్గర ఉన్న ఖాళీస్థలంలో ఇరుక్కొని ఉన్న వాహనాల పక్కగా మోటార్ సైకిల్‌ని ఇరికించి మెట్లు ఎక్కుతున్నాడు.

ప్రెస్‌క్లబ్‌కి రావడం నిఖిలేష్‌కి అది రెండోసారి. సాధారణంగా బయటనుంచే వెళ్ళిపోతుంటాడు. ఏ విలేకరుల సమావేశానికి వచ్చినా మొదటి అంతస్తుకే అది పరిమితం 'నాగేష్ ఎక్కడుంటానన్నాడు...?' మొదటి అంతస్తులో దేశోద్ధారక భవనం అన్న అక్షరాలను సురవరం ప్రతాపరెడ్డి ఆడిటోరియంనూ చూస్తూ అడిగాడు.

'ఇక్కడకాదు...పైన' ప్రవీణ్ చెప్పాడు.

'పైన ఏముంది'? తెలీనట్టుగానేఉంది నిఖిలేష్ కంఠం.

'రావయ్యా బాబు ఇదికూడా తెలీదంటే జనం నవ్వుతారు' అంటూ నిఖిలేష్‌ని రెండో అంతస్తులోకి తీసుకెళ్ళాడు ప్రవీణ్. కుడిచేతివైపు నడిచి అక్కడున్న ఓ డోర్‌ని నెట్టాడు.

అది ప్రెస్‌క్లబ్ బార్!

బార్‌లోకి అడుగు పెట్టగానే కుడివైపు ఓ పెద్ద కౌంటర్, దాని వెనుక అద్దాల బీరువాలు! వాటిల్లో రకరకాల మద్యముంది.

ముందువైపుఉన్న బీరువాలో తినడానికి కారం పదార్థాలు కనిపిస్తున్నాయి.

కౌంటర్ ముందుభాగమంతా గోలగాఉంది. పల్లి

లచుట్టూ కుర్చీలు వేసుకొని జనం గట్టిగా మాట్లాడుతున్నారు.

తాగుతూ...గట్టిగా నవ్వుతూ కబుర్లు చెబుతున్నారు.

సీరియస్‌గా అవతలవేపు కూర్చున్న వాళ్ళనిచూస్తూ పక్కనఉన్నవాడి చెవిలో రహస్యం చెబుతున్నట్లు కొందరూ...

మంత్రులను తామెలా దబాయించిందీ మరికొందరూ...

రాజకీయాలు ఎలా ఉండాలి అనే అంశంమీద ఇంకొందరూ

తమకు ఎదురుగా కూర్చున్న వాళ్ళను హాయించేస్తున్నారు. చుట్టల, సిగరెట్లపొగ రాజ్యం ఏలుతోంది. ఇద్దరు కుర్రాళ్ళు ఈ జనం ఊపుని తట్టుకొని చకచకా సప్లై చేస్తున్నారు. ఆ జనంలో నిఖిలేష్‌కి తెలుసున్న వాళ్ళు కొద్దిమందే కనిపించారు. ఒకర్ని మరొకరు పట్టించుకొనే వాతావరణమేలేదు. ఆ పెద్ద హాల్లో ఎడమవైపు మూలలో ఓ టి.వి. సెట్ ఆన్‌చేసిఉంది. టి.వి. ముందు తాగుతూ కూర్చున్న వాళ్ళు తమకు వెనకనున్న వాళ్ళని గొడవ చెయ్యొద్దంటూ అరచినా ఫలితం లేకపోవడంతో కోపంగా చూస్తున్నారు. ఖద్దరు బట్టలు వేసుకున్న పెద్ద మనుషుల దగ్గర్నుంచి అన్ని రకాల వాళ్ళూ ఉన్నారు.

'ఇక చాల్లేవయ్యా తాగుడు...నడు...నడు పేకాటకి టైమ్ అయిపోయింది'-ఓ ముసలాయన తొందర పెడుతున్నాడు.



'ఎలాగూ ఓడిపోవడమే కదండీ...కొంచెం ఆలస్యంగా వస్తాను' ఎవరో బ్రతిమాలుతున్నారు.

'ఛ...నడు'-అని గదమాయిస్తూ 'బిజినెస్‌లో సంపాదిస్తున్నావ్‌గా... కొంచెం ఖర్చుపెట్టు ఫర్వాలేదులే'-దాదాపుగా ఆ వ్యక్తిని లాక్కుపోయాడు.

ప్రవీణ్ నాగేష్ ఎక్కడున్నదీ ఎంక్వయిరీ చేసివచ్చాడు.

'పద...నాగేష్ పైన ఉన్నాడట'. ప్రవీణ్ నిఖిలేష్‌ని తొందరపెట్టాడు.

'పైన ఇంకో బార్ ఉందా?' నిఖిలేష్ నవ్వాడు.

'లేదులే...చల్లగా అక్కడ కూర్చొని బీరు కొడుతున్నాడేమో'

ప్రవీణ్ అంచనా నిజమైంది. మూడో అంతస్థులో చీకట్లో ఒంటరిగా కూర్చొని రోడ్డుమీద పోయే వాహనాలనుచూస్తూ బీరుతాగుతున్నాడు నాగేష్.

నాగేష్‌ని గుర్తుపట్టాడు నిఖిలేష్. ముఖ పరిచయం ఉన్నట్లు గుర్తుకొచ్చింది. 'హలో...' అన్నాడు.

'రండి...కూర్చోండి' నాగేష్ మర్యాద చూపించాడు. ఇద్దరూ కూర్చున్నారు.

'మీమాట...ఏమిటి...బీర్... తెప్పించనా...?. నాగేష్ అడిగాడు.

'నో...థాంక్స్...నేనుతాగను' బదులిచ్చాడు ప్రవీణ్.

'రెండు కూల్‌డ్రింక్స్ తీసుకొస్తా... నాగేష్ నీకు మరో బీరు కావాలా...?' ప్రవీణ్ అడిగాడు.

అవునన్న నాగేష్ సమాధానం అందుకొని క్షణంలో మాయమయ్యాడు.

'మీతో ఇవాళ నేను చాలాసేపు మాట్లాడాలని అనుకొన్నాను. కానీ అనుకోకుండా కేబినెట్ మీటింగ్‌కి వెళ్ళాలి. అదెప్పుడవుతుందో తెలీదు. అదయ్యేవరకూ అక్కడుండాలి. మీకు తెలుసుగా' నిఖిలేష్ సంభాషణకి నాంది పలికాడు.

తలూపాడు నాగేష్ బీరు తాగుతూ

'మీరొక్కరూ... పైన కూర్చున్నారు...?' నిఖిలేష్ నాగేష్‌కేసి చూశాడు.

'కింద బార్లో నాకు నచ్చదు ఒకటే గోల. ఎవరెవరో వస్తుంటారు. మన వాళ్ళు కూడా ప్రతీవాళ్ళనీ ఇక్కడికి తీసుకు వస్తున్నారు. వాళ్ళ కేకలూ... అరుపులూ... ఆ గోలా నాకు నచ్చదు.' నాగేష్ చిరుగ్గా మొఖం పెట్టాడు.

'అక్కడ నాకు తెలుసున్న జర్నలిస్టులు తప్పకుండా కనిపించారు...' నిఖిల్‌మాట పూర్తి కాకుండానే 'అదేకదండీ న్యూసెన్సు... ఎవరెవరో పైరవీకార్లు. ఆ పైరవీకార్లకి రిపోర్టర్ అన్వేషణం అభయంగా మారిపోయింది' ప్రవీణ్ రాకతో ఆ టాపిక్ ఆగిపోయింది.

'నాగేష్‌గారూ... సౌమ్య కేసు వార్తలో మీరు ఓ కారు గురించి రాశారు? అదెలా...?...?'' సూటిగా అడిగాడు నిఖిలేష్

''నేను ముందు మీ వార్తను చూశాను. ఎందుకో నాకో ఐడియా వచ్చింది. సికింద్రాబాదు స్టేషన్ దగ్గరే సౌమ్యని ఎందుకు ట్రాప్‌చేసి ఉండకూడదనే అభిప్రాయం కలిగింది. అంతే అక్కడికివెళ్ళి ఎంక్వయిరీ చేశాను. సికింద్రాబాదు స్టేషన్ దగ్గరే ఎంక్వయిరీ మొదలు పెట్టాను. కారు స్టాండ్‌లో ఉన్నవాళ్ళు, స్టేషన్లోని బస్సుస్టాప్ దగ్గరున్న పాన్ షాపువాడూ... ఇలా నలుగురైదుగురు చెప్పారు' బీరు తాగడానికి నాగేష్ ఆగాడు.

'ఏమని...?' తొందరపడ్డాడు నిఖిలేష్.

'ఆరోజు కోణార్క్ లేట్‌గా వచ్చింది... అదేరోజు ఓ అమ్మాయిని బలవంతాన నలుగురుకల్సి కారు దగ్గరకి తీసుకెళ్ళారట... 'మరి జనం ఏంచేస్తున్నారు?' అనడిగాను. 'ఆ అమ్మాయికి పిచ్చి'అని చెబుతూ వాళ్ళు కారెక్కించారు. గింజుకుంటున్న ఆ అమ్మాయినీ, తీసుకెళ్ళడానికి కష్టపడిన ఆ నలుగురిమీదా ఈ జనం సానుభూతి వ్యక్తం చేశారు.' నాగేష్ మళ్ళీ తాగుతున్నాడు.

'ఆ అమ్మాయినే...ఎక్కడకు తీసుకువెళ్ళారు...?' నిఖిలేష్ అడిగాడు.

'అదే ఇంతవరకూ నాకు అంతుబట్టలేదు. పిచ్చాసుపత్రికా...?. లేక...' నాగేష్ అంచనాలు వేస్తున్నాడు.

'మరి మెంటల్ ఆసుపత్రికి ఫోన్‌చేసి కనుక్కొన్నారా?' నిఖిలేష్ అడిగాడు.

ఆ ఐడియా తనకు రాలేదన్నట్లుగా చూశాడు నాగేష్.

'సికింద్రాబాదు రైల్వే స్టేషన్లో మీకీ సమాచారం అందించిన ఆ వ్యక్తులను మీరు గుర్తుపట్టగలరా...?' కూల్‌డ్రింక్ తాగడం మొదలుపెట్టాడు నిఖిలేష్. 'జస్ట్...మొన్న మా ఆంటీని రిసీవ్ చేసుకోవడానికి వెళ్ళినప్పుడు వాళ్ళల్లో ఇద్దరు కనిపించారు.' నాగేష్ మెరిసే కళ్ళతో నిఖిలేష్‌వైపు చూశాడు.

'వాళ్ళని మనం కలవాలి నాగేష్...

'తప్పకుండా' అంటూ మరో బీర్ బాటిల్ అందుకొని సౌమ్య కేసు చర్చలో దిగాడు నాగేష్.

ప్రవీణ్, నాగేష్, నిఖిలేష్ చర్చ పూర్తికాకుండానే గడియారం పావు తక్కువ పది చూపించింది.

''మళ్ళీ కలుద్దాం నాగేష్' అంటూ చెయ్యి కలిపా

డు నిఖిలేష్.

ప్రవీణ్, నాగేష్ ప్రెస్‌క్లబ్ కిందవరకూ నిఖిలేష్ తోపాటు వచ్చి ఇళ్ళదారి పట్టారు. నిఖిలేష్ తన మోటార్ సైకిల్‌ని బషీర్‌బాగ్ సెంటర్‌వైపు పోనిచ్చాడు.

ఛీఫ్ మినిస్టర్ ఛాంబర్. దానివక్కనున్న సమావేశపు గదిలో కేబినెట్ మీటింగ్! కారిడార్లలోనూ... విజిటర్ల రూంలోనూ... పి.ఆర్.ఓ గదుల్లోనూ రిపోర్టర్లు సర్దుకొన్నారు.

హోటల్లో భోంచేసి వదింబావుకి వచ్చిన నిఖిలేష్‌కి విజిటర్ల రూంలో ఓ ఖాళీ కుర్చీ చోటుఇచ్చింది.

అక్కడున్న పాత్రికేయులు చర్చల్లో మునిగిపోయారు. దేశంలోని తీవ్రవాదం, రాష్ట్రమంత్రివర్గ విస్తరణా, ప్రతిపక్ష అనైక్యతా స్థాయిలో మొదలైన ఆ చర్చలు జర్నలిస్టల కష్టాల మీదుగా సినిమా వాళ్ల మీదకీ తాగుడు పార్టీలకూ వెళ్ళిపోయాయి. అమ్మాయిలూ... రేప్‌లమీదకి మళ్ళాయి. ఈ చర్చల్లో సీనియర్లూ... జూనియర్లూ అనే భేదభావంలేకుండా వాదించుకొంటున్నారు. నిఖిలేష్‌ని కూడా ఆ చర్చల్లోకి లాగారు.

ముమ్మరంగాసాగే ఆ చర్చ 'మన పోలీసులు లాభంలేదు. గవర్నమెంట్ ఫేల్యూర్ అవుతోంది' అన్న నిఖిలేష్ మాటలదగ్గర కొంచెం సీరియస్ అయింది. 'గవర్నమెంట్ ఫేల్యూరా...? నీకేవయినా తెలుసా...? ఏవిషయంలో ఫేలయింది...?' నాలుగు పదులు పైబడిన సీనియర్ రిపోర్టర్ నిఖిలేష్‌తో తీవ్రచర్చకు శ్రీకారంచుట్టాడు.

'నెలదాటలేదు... సౌమ్యను రాజధానీ నగరంలో దారుణంగా మానభంగంచేసి చంపేసిన సంఘటన జరిగి...' నిఖిలేష్ ఆవేశపడ్డాడు.

'అయితే—దానికీ ప్రభుత్వ వైఫల్యానికీ సంబంధం ఏమిటి...?'' సీనియర్ సీరియస్ అయ్యాడు.

'ఇంతవరకూ ఒక్కడ్నీ ఒక్కడ్నైనా అరెస్టు చేశారా...? నిఖిలేష్ కోపంగా అడిగాడు.

'పోలీసులు పట్టుకోలేకపోతే ప్రభుత్వ వైఫల్యమా...?'—ఏదో మాట్లాడాలికాబట్టి వాదించకు—ఇదే మీ కుర్రాళ్లకి ఉన్న జబ్బు. ఏదైనాజరిగితే ఇంకేం ఆలోచించరు. ఎవడ్నో తిడతారు. ఇది జర్నలిజం కాదు'—తేల్చేస్తున్నాడు సీనియర్.

'నేనన్నదానికి... జర్నలిజానికి ముడిపెడతారేమిటి...? అది వ్యక్తిగత అభిప్రాయం కావచ్చుగా...' నిఖిలేష్ సమర్థించుకొన్నాడు.

'వ్యక్తిగత అభిప్రాయం ఏమిటి... ఆ రిపోర్టు మీ పేపర్లో చూశానులే... పోలీసుల్నీ... ప్రభుత్వాన్నీ ఎంతతిట్టారో కనిపిస్తూనే ఉంది...?'' సీనియర్ కసురుకున్నాడు.

''వాస్తవాలు రాస్తే తిట్టినట్లవుతుందా?' అన్నాడు నిఖిలేష్.

'ఏం వాస్తవాలు... రాసేరులే గొప్ప నిజాలు. ఎవడితరం అలాంటివాళ్లను పట్టడం. పిల్లకాకికేం తెలును ఉండేలు దెబ్బ. అంతచేయగలిగినవాళ్ళు పోలీసులకు దొరుకుతారూ...' సీనియర్ వాదన పెంచుతున్నాడు.

'అంతర్జాతీయ క్రిమినల్ ఛార్లెస్ శోభరాజ్‌ని పట్టుకోలేదూ... పట్టుకోవాలనే దీక్ష ఉండాలి. మనవాళ్లకు ఎపుడూ పైవాళ్లమట్టూ తిరగడం, వాళ్లపనులు చేసిపెట్టడానికే టైం చాలదు' నిఖిలేష్ వ్యాఖ్యానంలో కోపం చిందులువేసింది.

సీనియర్ తన వాదన బలహీనమవుతున్నదని విజృంభించాడు.

'అదే నీ తెలివితక్కువతనం. ఆ రేప్‌చేసి చంపినవాళ్ళు దొరకాలంటే ఎంతలా వెతకాలి. ఎన్నిప్లానులు వెయ్యాలి? ఎంతకాలం పడుతుంది? వెంటనే దొరికేస్తారా...? లేకపోతే ఇక్కడున్నాం రండి-అని పోలీసుల్ని పిలుస్తారా...?' సీనియర్ పాయింట్‌తో లేచాడు.

'ఎన్నిరోజులు కావాలి... ఎంతకాలం పడుతుంది...?' నిఖిలేష్ కొంచెంతగ్గాడు.

'వాళ్ళెంత పవర్‌ఫుల్ పర్సన్సో... ఎవరికి తెలుసు'- సీనియర్ నిఖిలేష్‌కేసి తిరిగి తీవ్రంగా చెప్పాడు.

'అంటే 'పవర్‌ఫుల్' వాళ్ళు నేరాలుచేసినా తప్పించుకోవచ్చా... ఏమిటండీ మీ సమర్థన'- నిఖిలేష్ సీనియర్‌ని ప్రతిఘటించాడు.

'అలా తీసిపారేసినట్లు అర్థంలేకుండా మాట్లాడితే సరిపోదు. నేను విషయం చెబుతావిను'. కథ ప్రారంభించాడు సీనియర్ పొలిటికల్ రిపోర్టర్.

సుమారు ఆరేళ్లకిందట ప్రెస్ బృందాన్ని భద్రచలం అడవుల్లో గిరిజనాభివృద్ధిని చూపించడానికి

తీసుకెళ్ళారు. ఆ బృందంకూడా నేనూ వెళ్ళాను.

భద్రాచలానికి డెభై కిలోమీటర్లలోని అడవుల్లోకి మమ్మల్ని తీసుకెళ్ళారు. ఆ ప్రాంతాల్లోని గిరిజన గ్రామాల్లో గిరిజనులనూ, వారికి మన ప్రభుత్వం అందించే సహకారాన్ని మాముందుంచారు అధికారులు. అక్కడి 'షాండీ'లు తిరిగాం-మనవాళ్ళు కొందరు మధ్యాహ్నానికే 'ఇప్పసారా' తాగేశారు. మత్తుగా తూలుతున్నారు...

ఓ పావుగంటలో తిరుగు ప్రయాణం. ఆకాశం మేఘావృతమై పెద్దవర్షం మొదలైంది. ఏంచేస్తాం. అధికారులు మటుకు ఏంచేస్తారు. 'ఇప్పసారా' సీసాలను సంపాదించి ఆవేశావాలన్న మా జనానికి అందించారు.

ఆ గ్రామంలోని చిన్న ట్రావెలర్స్‌బంగ్లా, స్కూల్, సమితి ఆఫీసుల్లో సర్దుకొన్నాం.

మాలో ఓ పెద్దమనిషి మరి ఎప్పుడు ఎలా జారుకొన్నాడో తెలీదుకానీ... జారుకొన్నాడు.

ఆ గ్రామంలోని ఒకడ్ని పట్టేశాడు.

ఎడ్వాన్సుగా ఇరవై రూపాయలు ఇచ్చాడు.

ఎందుకోసం...? తెలుసా...?

ఓ గిరిజన పిల్లకోసం...

ఆ బ్రోకరుగాడు ఈ పెద్దమనిషిని అందమైన కొండపిల్ల ఉందంటూ ఓ గుడిసెలోకి పంపించాడు.

ఆ గుడిసెలోకి వెళ్ళి ఎవరో గిరిజన అమ్మాయిని పట్టుకొన్నాడా పెద్దమనిషి. ఇకచూస్కో నానాగొడవా అయింది. అర్ధరాత్రి వర్షంతగ్గుతూనే పెద్దగా అరుపులు... భీభత్సం మొదలైంది.

ఆ ఊర్లోజనం ఆ పెద్దమనిషితోసహా మమ్మల్నందర్నీ కొట్టడానికి సిద్ధం అయ్యారు.

కానీ కొట్టగలిగారా?...

లేదు...

ఎందుచేత...

మనం "పవర్‌ఫుల్ గనక..."

గర్వంగా చెబుతున్నాడు సీనియర్.

'ఛ...ఛ...మీతోపాటు నేనూ ఉంటే ఆ పెద్ద మనిషిని నాలుగు ఉతికేసి ఉండేవాణ్ణి'- నిఖిలేష్ ఆవేశపడ్డాడు.

'పోవయ్యా...నేనూ అలాగే అనుకున్నాను. వాడు ఇప్పుడో గొప్ప జర్నలిస్ట్. హెూం మినిస్టర్ గారి లిస్ట్‌లో మొదటి వ్యక్తి' - నీ వల్ల ఏమవుతుందిలే అన్నట్లు చూశాడా సీనియర్ రిపోర్టర్.

'హెూం మినిస్టర్ లిస్టా'-? నిఖిలేష్ ఆలోచనని త్రుంచుతూ... 'నీకు ఈ చిన్న విషయమే తెలియదా...!. చూడు ప్రతిమంత్రికీ ఓ లిస్ట్ ఉంటుంది. తనకు దగ్గరయిన జర్నలిస్ట్‌ల లిస్ట్ అది. అపుడప్పుడూ రిపోర్టర్ల సామర్థ్యాన్ని బట్టి ఆ లిస్ట్ మారుతూంటుంది. అలాగే పార్టీ ప్రధాన కార్యదర్శుల దగ్గరా, సీనియర్ అధికారుల దగ్గరా, ప్రతిపక్షాల నాయకుల వద్దా లిస్ట్‌లు ఉంటాయి' - రహస్యం చెప్పినట్లు చెప్పాడా సీనియర్.

లిస్ట్ వల్ల ప్రయోజనం...?

'నిఖిలేష్ అజ్ఞానానికి ఆనందంగా నవ్వుకున్నాడాయన.

"ఆ లిస్ట్ ప్రకారం నెలకోసారి కవర్లు తయారవుతాయి. వాటిలో ముడుపులు పెట్టి స్వంత ప్రచారానికై వాళ్ళంతా తమ వాళ్ళుగా భావించే ఆ జాబితా సభ్యులకు సమర్పిస్తారు...' అర్థం అయిందా అన్నట్లు చూశాడా సీనియర్.

'మిమ్మల్ని హెూం మినిస్టర్ లిస్ట్‌లో తీసేశారటగా..." ఎవరో కూశారు.

'ఆ నిన్ను తీసుకొన్నాడుగా... చాలు ఇంక నేనెందుకు?'' సీనియర్ అరిచాడు.

'అది సరే నండి... ఇంతకీ ఆ పెద్దమనిషి ఎవరు? . ' నిఖిలేష్ అడిగాడు.

'వాడి సంగతి కేంగానీ... ఇంత ఆవేశపడుతున్నావ్...ఓ మాట...నేనే ఉన్నానయ్యా... ఓ నలుగుర్ని కూడగట్టుకొని ఆరేప్ చేశాననుకో... ఎవరికి తెలుస్తుందీ...తెలిసేటట్లు బహిరంగంగా చెప్పిచేస్తామా... పిచ్చివాడివి కాకపోతే...అలాంటి విషయాలు పట్టించుకొంటారా..?రేప్ అయిందనుకో...దంచి వార్తరాయాలి. రేప్ అండ్ మర్డర్ ఇంకా విజృంభించి మరింత పెద్దవార్తరాయి. అంతే..ఫినిష్. ఎవడైనా వార్తరాసేసింతర్వాత దాన్ని వదిలెయ్యాలి. దాని గురించే పిచ్చెక్కేటట్టు ఆలోచిస్తాడా...ఎవడైనా... అసలు జర్నలిజం అంటే ఏమిటి? వార్తలు.. సేకరించడం రాయడం. ఈ రోజు వార్త రాశావనుకో. రేపు దాన్ని మర్చిపోవాలి. కొత్త వార్తను పట్టాలి. ఇవ్వాల్టి పేపరు రేపటికి చిత్తుకాగితం...తెలుసుకోనాయనా-ఇంకా నువ్వు బాగా ఎదిగి

తేగాని ఈ విషయాలు అర్థం కావు.. సౌమ్య రేప్ విషయం మర్చిపో...ఎక్కువ ఆలోచిస్తే కష్టాల్లో పడ తావ్'.

ఆ సీనియర్ నవ్వుతూ చెప్పినా ఆఖర్లో అన్న ఆ రెండు మాటలూ నిఖిలేష్‌కి హెచ్చరింపులా అనిపించాయి.

కోపంతో బుసలు కొట్టబోతున్న నిఖిలేష్ సి.ఎం. 'ప్రెస్ బ్రీఫింగ్' కి వస్తున్నారని చెప్పడం విని సీనియర్‌తోపాటు ఆ సమావేశగదిలోకి చొరబడ్డాడు.



5

గురూగారూ...''

''నిఖిలేష్‌గారూ...''

పరిచయమైన కంఠంలా వినిపిస్తోంది.

అప్పటికే సూర్యుడు తూర్పునుంచి పశ్చిమాద్రికి ప్రయాణం కట్టి రెండుగంటలు దాటింది.

సూర్యుణ్ని లెక్కచెయ్యడంలేదు చలిపులి.

మెలుకువ వచ్చినా బద్ధకం కౌగిట్లో చిక్కిన నిఖిలేష్ మంచం మీదనుంచీ... ముసుగులోంచి బయటకు రావడానికి ప్రయత్నించడంలేదు.

ఆ పిలుపు జోరు పెరిగింది.

బద్ధకంగా కళ్లు నులుముకొంటూ లేవాలని లేకపోయినా మంచం దిగాడు. కిటికీ తెరిచాడు.

తెరిచిన వెంటనే ప్రత్యక్షమయింది, పక్కవాటా శ్రీధర్ మొఖం. మొఖానికి ఓ చిరునవ్వు పులుముకుని ఏవిటన్నట్లు చూశాడు నిఖిలేష్.

''రాత్రి బాగా లేటయినట్లుంది''- శ్రీధర్ నవ్వడానికి ప్రయత్నిస్తూ అన్నాడు. అవునన్నట్లు తలూపాడు.

''మిమ్మల్ని వారంరోజులుగా కలుసుకొందామని ప్రయత్నిస్తున్నాను. రోజూ మార్నింగ్ నేను లేచి చూసేసరికి మీరు వెళ్లిపోతున్నారు. రాత్రి నేను పడుకొన్న తర్వాతగాని మీరు రావడంలేదు. అందుకే...''

అతను మాట్లాడుతూనే కిటికీ ఇవతల పక్కనున్న న్యూస్‌పేపర్లు తీసుకొని తలుపు తీశాడు. లోపలికి రమ్మంటూ సంజ్ఞ చేశాడు.

''ఎందుకూ—'' నెమ్మదిగా అడిగాడు నిఖిలేష్.

''మిమ్మల్ని పొద్దున్నే డిస్టర్బ్ చెయ్యడం లేదుకదా!'' శ్రీధర్ నొచ్చుకొన్నాడు.

''అహ... అదేంలేదు'' అంటూనే విషయం వినడానికి రడీ అయ్యే ప్రయత్నం చేశాడు నిఖిలేష్.

''కొంచెం తీరిగ్గా మాట్లాడుదామని వచ్చాను...'' శ్రీధర్ నిఖిలేష్‌కేసి చూస్తూ 'వినాలి తప్పదన్నట్టు' అన్నాడు.

''దానిదేముంది చెప్పండి'' నిఖిలేష్ సిద్ధమయ్యాడు.

''మన సిటీలో వంటనూనెకి చాలా ఇబ్బందిగా ఉందండి. రేషన్‌గా ఇచ్చే నూనె స్టాక్ లేదంటున్నారు. మార్కెట్లలో కొనాలంటే రేటు మండిపోతోంది'' నిఖిలేష్ చూస్తున్న పేపర్ని వరికిస్తూ శ్రీధర్ మొదలుపెట్టాడు.

''ఇది కామన్ కదండీ''- నిఖిలేష్ ఆ విషయానికి పెద్దగా ప్రాముఖ్యం ఇవ్వలేదు.

''అవుననుకోండి- కానీ మా ఫ్రెండ్ చెప్పాడు. వెస్టుమారేడ్‌పల్లిలో ఓ ప్రవేటు గోడౌన్ ఉందటండి. దాంట్లో వేలకువేలు నూనెటిన్నులు ఉన్నాయట. నిజానికవి రేషన్‌షాపులకు రావాలటండీ''

శ్రీధర్ చెప్పే విషయం అంతవరకూ తేలిగ్గా తీసుకొన్న నిఖిలేష్ ఒక్కసారిగా ''ఆఁ...'' అంటూ ముందుకొచ్చాడు.

''నిజమేనండి. ఆ గోడౌన్ మన మినిష్టర్ జగన్నాధరావు లేదండీ... సివిల్ సప్లయీస్ మంత్రి! వాడి బావదంటున్నారు. మావాడు కళ్లారా చూశాడట. ఇంకా స్టాకులు అక్కడికి వస్తున్నాయట.''

శ్రీధర్ మాటలకి అడ్డువడుతూ ''ఆ ఎడ్రస్ ఎక్కడ...?'' అడిగాడు నిఖిలేష్.

ప్రశ్న పూర్తికాకముందే జేబులోంచి ఓ కాగితం తీసి ఇచ్చాడు శ్రీధర్.

''శ్రీధర్ మీ ఫ్రెండ్‌ని కాంటాక్టు చేస్తే వివరాలు చెబుతాడా...'' నిఖిలేష్ ప్రశ్నకు తాను ఇచ్చిన కాగితంకేసి చూస్తూ శ్రీధర్ ఆలోచనలో పడ్డాడు.

"వాడూ... చెప్పలేమండి...ఉత్తినే భయపడతాడు. అందుకే గోడౌన్ ఎడ్రస్ ఇచ్చేశాడు" సర్దుకొన్నాడు శ్రీధర్.

"మరి... ఆ గోడౌన్ చూడాలికదా... లోపలికి వెళ్లాలి. నిజానిజాలు పరిశీలించాలి. లేకపోతే వార్త ఎలా రాస్తాం" నిఖిలేష్ అడిగాడు.

"ఆ... భలేఅడిగారు! లేకపోతే మర్చిపోదును. సివిల్‌సప్లయిస్ డిపార్టుమెంట్‌నుంచి వచ్చామని చెబుతే లోపలికి వదులుతారట. ఇదీ వాడే చెప్పాడు."

నిఖిలేష్‌తో ఆ విషయం అరగంటకు పైగా మాట్లాడి తానుగానీ, తన ఫ్రెండ్‌గాని చెప్పినట్లు ఎక్కడా చెప్పవద్దని హామీ తీసుకొని వెళ్లిపోయాడు శ్రీధర్.

నిఖిలేష్ హడావిడిపడుతూ తయారై ప్రవీణ్ ఇంటికి వెళ్లాడు. ఈ విషయాన్ని బ్రీఫ్‌గా చెప్పాడు. ఇద్దరూ బయలుదేరి వెస్ట్‌మారేడ్‌పల్లి చివర్లో ఉన్న ఆ ఎడ్రస్‌కి వెళ్లారు. శ్రీధర్ చెప్పినట్లు ముందో చిన్న ఇల్లులా ఉంది. వెనక గోడౌన్. రోడ్డు మీద నుంచి చూస్తే ఆ గోడౌన్ కనిపించడానికి ఆస్కారం తక్కువ. ప్రవీణ్, నిఖిలేష్‌ల్ని నిరుత్సాహపరుస్తూ ఆ ఇంటికున్న రెండుగేట్లు తాళంవేసి ఉన్నాయి. ఆ గోడౌన్‌కి అరఫర్లాంగుదూరంలో ఓ ఇరానీ రెస్టారెంట్ ఉంది. ఇరానీ 'చా'తాగి సిగరెట్ ముట్టించాడు నిఖిలేష్. ప్రవీణ్ ఆ పాన్‌షాప్‌వాణ్ని ఈ గోడౌన్ గురించి అడుగుతున్నాడు. వాడేదో చెబుతున్నాడు. ఏంచెయ్యాలనేది వాళ్లు ఆలోచిస్తున్నారు. ఓగంట అటూ ఇటూ తిరిగారు.

సికింద్రాబాద్‌లో పనుందన్నాడు ప్రవీణ్. ఆపని చూసుకొని మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో మళ్లీ అక్కడికి చేరుకొన్నారు. గేట్లు తీసి ఉన్నాయి. లోపలికి వెళ్లారు. గోడౌన్ గేటు కూడా తీసిఉంది. ఆ గేటువరకు వెళ్లకుండానే అడ్డుపడ్డాడో గూర్ఖా. "కౌన్ హైసాబ్" అడిగాడు.

"సివిల్ సప్లైస్ డిపార్ట్‌మెంట్‌సే ఆయే" ప్రవీణ్ బదులిచ్చాడు. "సాబ్ హై" ప్రవీణ్ ప్రశ్నించాడు.

"అభీ ఇదరీహై... జరఠైరీయె. మైదేఖ్‌కే ఆతుం"- వాడు ధీమాగా సాబ్‌ని వెతకటానికి వెళ్లాడు.

వీళ్ళిద్దరూ కొంచెం ముందుకు కదిలారు. ఆశ్చర్యం! శ్రీధర్ చెప్పినట్లే అక్కడన్నీ ఆయిల్ టిన్నులే. ఆ గూర్ఖా వెళ్లిన పదిసెకన్లలో ప్రవీణ్ గోడౌన్‌లోని నూనెటిన్నులమీద 'ఫ్లాష్' లైట్‌ని ప్రసరింపచేశాడు. రెండు నిమిషాల్లో నాలుగైదు కోణాల్లో కెమెరాని 'క్లిక్' చేశాడు.

ఆ పని అయిన మరుక్షణం కెమెరాని భుజానికి వేలాడే లెదర్‌బ్యాగ్‌లో పెట్టి జిప్ మూసేశాడు.

నిఖిలేష్‌తో చలిగురించి చర్చ మొదలుపెట్టాడు. ఆతర్వాత నాగేష్ కనిపించాడనీ, సికింద్రాబాద్ రైల్వేస్టేషన్‌కి వెళదామన్నాడనీ ప్రవీణ్ చెబుతూండగానే ఆ గూర్ఖా తిరిగి వచ్చాడు.

"సాబ్ చెలేగయే"- అన్నాడు.

"కహామిల్తే" ప్రవీణ్ అడిగాడు.

"ఆఫీస్‌మే" ఆ గూర్ఖా ప్రవీణ్ బ్యాగ్‌కేసి చూస్తున్నాడు.

"జరఫోన్ నంబర్ హైతో దేనా" మళ్ళీ ప్రవీణ్.

"అచ్చీ సాబ్" అంటూ గోడౌన్‌లోని ఓ చిన్న స్టూల్‌కిందున్న పుస్తకం తీసి ఉర్దూలో నంబరు చెప్పాడు.

"సాబ్ అభీ ఆఫీస్‌మే రహతే" టెలిఫోన్ నంబర్ నోట్ చేసుకొని నిఖిలేష్ అడిగాడు.

"నయీబోల్‌సక్తే... ఆప్‌కూ క్యాహెూనా సాబ్" గూర్ఖా గడుసుగా మాట్లాడాడనిపించింది.

"కల్‌రాత్‌మే లోడ్ ఆతా బోల్‌కె సాబ్ బోలే... ఆయాక్యా...?" ప్రవీణ్ తెలివిని ప్రదర్శించాడు.

"కల్‌తో నహీ... పర్సూమ్ ఏక్‌లారీ లోడ్ ఆయే" గూర్ఖా లైనులో పడ్డాడనిపించింది.

"కమ్‌సేకమ్ పాంచ్‌హజార్ టిన్స్ హైనా" నిఖిలేష్ గూర్ఖాకేసి చూస్తూ అన్నాడు.

"ఆప్ దేఖేనా సాబ్... ఇస్‌సే జాదాహై..." వాడు చిరునవ్వు విసురుతూ చెబుతున్నాడు. పదినిమిషాల దాకా వాడితో ఉర్దూలోనే సంభాషణ సాగింది. మెల్లగా 'సాబ్‌ని కలుస్తామంటూ' బయటపడ్డారు. నిఖిలేష్ విజృంభించాడు. మోటార్‌సైకిల్ డెబ్బై, ఎనభై స్పీడ్‌లో పోతోంది. 'స్లోమంచి'దంటూ సలహా ఇస్తున్నాడు వెనక కూర్చొన్న ఫొటోగ్రాఫర్ ప్రవీణ్.

పౌరసరఫరాలశాఖ, ఛీఫ్ రేషనింగ్ అధికారి కార్యాలయం, నాలుగైదు రేషన్ దుకాణాలు తిరిగారు. పౌరసరఫరాల భవన్‌లోనూ, ఛీఫ్‌రేషనింగ్ అధికారి వద్దా ప్రతినెలా రాష్ట్రానికి అందే నూనెకోటాల వివరాలు ఇతర సమాచారం రాబట్టటానికి రెండు

గంటలు పైగా పట్టింది. రేషన్ దుకాణాల యజమానులు ఖాళీ చేసుకుని మాట్లాడేసరికి సూర్యాస్తమయం కూడా అయిపోయింది.

ఆరున్నర దాటుతోంతగా నిఖిలేష్, ప్రవీణ్‌లు ఆఫీసుకి చేరారు. ప్రవీణ్ 'డార్క్‌రూం'లోకి వెళ్లిపోయాడు. నిఖిలేష్ రిపోర్ట్ రాయడానికి న్యూస్‌ప్రింట్ కాగితాలు సర్దుకొంటున్నాడు.

"సార్... మీ కోసం అమరేందర్‌గారు చాలాసార్లు అడిగారు" డ్యూటీనుంచి వెళ్లిపోతూ చెప్పాడు అటెండర్ రమేష్.

"కలుస్తాను" అంటూ తలూపాడు నిఖిలేష్.

ఆ అటెండర్ వెళ్ళిన అయిదు నిమిషాల్లో అమరేందర్ రిపోర్టర్ల రూంకి హడావిడిగా వచ్చాడు.

"పొద్దున్నుంచీ ఎక్కడికి వెళ్లావయ్యా" ఆలోచనల్లో మునిగి ఉన్న నిఖిలేష్‌ని అడిగాడు. నిఖిలేష్ ఆనాటి తన పరిశోధనంతా వివరించాడు.

అమరేందర్ అభినందించాడు. కొన్ని సూచనలు కూడా ఇచ్చాడు. ఆ తర్వాత "నిఖిలేష్... నువ్వు అర్జెంటుగా హోటల్ బంజారాకి వెళ్లాలి" అని నగరానికి చెందిన ఓ భారీ పరిశ్రమ అధ్యక్షుడు ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టాడని, దానికి నిఖిలేష్‌ని పంపిస్తానని తాను ఆ కంపెనీ అధికారులకు చెప్పానని, వెళ్లకపోతే బాగుండదని అమరేందర్ చెప్పాడు. గంటలో తన పని పూర్తి చేసుకోవచ్చన్నాడు. భారీ పరిశ్రమ అధ్యక్షుడి వార్త ఆరోజుకారోజు ఇవ్వకపోయినా ఫర్వాలేదన్నాడు. కానీ ఖచ్చితంగా వెళ్లాలి. నిఖిలేష్ వినుకొంటూనే బంజారాకి దారి తీశాడు.

బంజారాహిల్స్‌లోని బంజారా హోటల్ ముందున్న పార్కింగ్ ప్లేస్‌లో మోటార్‌సైకిల్ పెట్టి రిసెప్షన్ దగ్గరున్న ఆ కంపెనీ అధికారులను కలిశాడు.

"నిజం" అని చెప్పగానే వాళ్లు 'మిస్టర్ నిఖిలేష్' అనేశారు. నవ్వుగా నవ్వుతూ ప్రెస్‌కాన్ఫరెన్సు జరిగే స్థలానికి వాళ్లతోపాటు బయలుదేరాడు. బంజారా హోటల్‌లో మొదటి అంతస్థులోని కాన్ఫరెన్సు హాల్లోకి వెళ్లడానికి మెట్లు ఎక్కుతున్నాడు.

"ఈరోజు చాలామంది జర్నలిస్ట్‌లు వచ్చారు" ఓ అధికారి చెబుతున్నాడు.

నిఖిలేష్ అతని ముఖంలోకి చూశాడు.

"మనం లిమిటెడ్‌గానే పిలిచాం. నాలుగురెట్లు వచ్చారు. అర్థరేమో ముప్పై 'సూప్స్'. వచ్చినవాళ్లు నూటమూడుమంది".

ఆ అధికార్లు వాళ్లు వాళ్లు మాట్లాడుకొంటూ నిఖిలేష్ వైపు చూశారు.

'ఈ విషయం నా దగ్గర ఎందుకు మాట్లాడుతున్నారు' అన్నట్లు చూస్తున్నాడు నిఖిలేష్.

కాన్ఫరెన్సుహాల్లో అడుగుపెట్టిన నిఖిలేష్ నిశ్చేష్టుడయ్యాడు. నిజమే! అంచనాకి మించి జనం ఉన్నారు. అప్పటికి ఆ భారీ పరిశ్రమ అధ్యక్షుడు రాలేదు. ఈ జనం మాత్రం తమపని కానిస్తున్నారు. అది బేరర్లకు పరీక్ష. ఎన్నెన్నోపెగ్గులు ఆ జనం కడుపుల్లోకి దూసుకొనిపోతున్నాయి. పెగ్గులు పొయ్యడానికి బేరర్లు అవస్థ పడుతున్నారు. పోయించుకోవడానికి ఆ జనం పోటీ పడుతున్నారు. బంజారా రిసెప్షన్ దగ్గర కనిపించిన ఆ కంపెనీ అధికారి ఓ ఫైలందించాడు. ఆ ఫైల్ తెరిస్తే అందులో పదిపేజీలవరకూ ఖాళీలేదు.

"ఏమిటి" నిఖిలేష్ ఆ ఫైల్ చూస్తూ అడిగాడు.

"జస్ట్ మీ పత్రిక పేరూ- మీ పేరూ... రాయండి సార్..." ఆ వ్యక్తి మర్యాదగా కోరాడు.

అప్పటికే నిండిన ఆ కాగితాలను చూస్తున్నాడు నిఖిలేష్. విక్రాంత్-స్వాప్, జఫానియా-జాట్‌పత్రిక, ప్రసాద్-ఇంటర్నేషనల్ ఫ్రీడం, కరుణాకర్-ఎ.పి.ప్రోగ్రెస్, కాంతిదీప్-ఫౌండేషన్, బెనర్జీ-ఇండస్ట్రియల్ పేస్, సుఖ్‌దేవ్-ఆల్‌ఆంధ్రా న్యూస్, ఖాన్-ఇంటర్నేషనల్ న్యూస్ సర్వీస్, ఖాద్రీ-ఉర్దూ యునైటెడ్ న్యూస్ ఏజెన్సీ, విజాదత్ అలీ-ద మార్నింగ్ టైం న్యూస్... ఇలా ఏనాడూ కనీవినీ ఎరుగని న్యూస్ ఏజెన్సీల పేర్లు నిఖిలేష్‌ని ఆశ్చర్యంలో ముంచెత్తాయి. హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, న్యూస్‌టైం మొదలైన ప్రముఖ దినపత్రికల రిపోర్టర్లు అంతాకలసి ఓ పది పన్నెండు మంది మాత్రమే ఉన్నారు. వాటన్నిటినీ దాటుకొంటూ చివరనున్న ఖాళీ స్థలంలో తనవంతు రాసి ఫైల్‌మూసి ఇచ్చేశాడు.

ప్రముఖ దినపత్రికల రిపోర్టర్లు ఖాళీలేక ఓ పక్కగా నిలబడి ఆ విషయమే మాట్లాడుకొంటున్నారు. నిఖిలేష్ వాళ్ళ పక్కనే నిలబడ్డాడు.

ఆచర్చ సాగుతుండగానే ఓ పాతికేళ్ళ యువకుడు నిఖిలేష్‌ని కళ్ళతో పలకరిస్తూ వస్తున్నాడు. అతనెవరో నిఖిలేష్‌కి గుర్తురాలేదు.

"నన్ను గుర్తుపట్టలేదా" అన్నట్లున్నాయ్ ఆ యువకుడు కళ్ళలో భావాలు. తలబద్దలు కొట్టుకొంటు



న్నా నిఖిలేష్‌కి ఎక్కడా అందడంలేదు.

"మీది సూజివీడు కదా..!" ఆ యువకుడు ప్రశ్నించాడు.

"ఆ... అవును.." ఆ యువకుని ఆపాదమస్తకం పరిశీలిస్తున్నాడు. నిఖిలేష్.

"మీరు గోపాలరావుగారి అబ్బాయ్...?" ఆయువకుడు ఆగాడు.

"యా... మీరు"?- అడగడం నిఖిలేష్‌వంతయింది.

"నన్ను గుర్తుపట్టలేదా నిఖిల్... దీవక్‌ని... లాయర్ గంగాధరంగారబ్బాయిని..."

గుర్తుకొచ్చాడా యువకుడు "నువ్వు నాక్లాస్‌మేటివి కదూ..."

దీవక్, నిఖిలేష్ చిన్ననాటి సంగతుల్లోకి, స్వగ్రామ వివరాల్లోకి వెళ్ళిపోయారు. అరగంటసాగిన అభిమానపు పొంగు ఇద్దర్నీ గ్రామ వాతావరణంలో తేలి ఆడించి రిలీఫ్ కలిగించింది.

"నువ్వు ఏంచేస్తున్నావ్..."? అడిగాడు దీవక్..

"నిజం"లో రిపోర్టర్‌గా పనిచేస్తున్నానని, తన వివరాలని అందించి తిరిగి నిఖిలేష్ అదే ప్రశ్న వేశాడు. "నేనూ" అంటూ నసిగాడతను! "అఖిల భారత పరిశోధనాత్మక న్యూస్‌ఏజెన్సీ పెట్టాను. నాలుగేళ్ళయింది." చెప్పుకుపోతున్నాడు దీవక్.

"నేనెప్పుడూ-వినలేదే-"?

''వినుండవ్''-!

''ఏ పత్రికలకి మీ న్యూస్ ఇస్తారు?-''

''ఏదో చిన్నచిన్న పత్రికలకి ఇస్తున్నాం. ఈ ఏడాది నుంచి అప్‌కంట్రీ సర్వీస్ మెదలుపెట్టాలి''..! దీవక్ అన్నాడు.

''అదెలా..?''

''ఏవుందీ మేము రిపోర్టులు.. అంటే పరిశోధనాత్మక వార్తలు రాస్తాం. వాటిని వివిధ రాష్ట్రాల్లోని పత్రికలకు పంపుతాం. దానికింకా టైమ్ పడుతుందిలే. దీవక్ చెబుతూనే ''ఒక్క నిముషం'' అని అదృశ్యమయ్యాడు.

అయిదు నిమిషాల్లో మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు. అతనికూడా నలుగురున్నారు.

వాళ్ళని నిఖిలేష్‌కి పరిచయం చేశాడు.

నిఖిలేష్‌ని 'నిజం' పత్రికలో ఎ.వన్ రిపోర్టర్‌గా వాళ్ళకి వర్ణించేస్తున్నాడు. నిఖిలేష్ వారిస్తున్నా దీపక్ ధోరణి ఆగలేదు.

కాన్ఫరెన్స్‌హాల్లో తాగుతున్న జనంలో కదలిక వచ్చింది. భారీ పరిశ్రమ అధ్యక్షుడు, అధికారులు వెంటరాగా భారీగా కదులుతూ వచ్చి ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన ఆసనంలో ఆశీనులయ్యారు.

నమస్కారంతో ప్రారంభమైన ఆయన సమావేశ ప్రసంగం ఒక్క ప్రశ్నకీ నోచుకోకుండా ప్రెస్‌నోట్ పంపిణీతో పాటు సాగుతోంది.

ఆ అధ్యక్షుడి ఎదురుగా కూర్చున్న జనం అదేపనిగా చిరునవ్వులు చిందిస్తూ తలలు ఆడిస్తున్నారు.

రాత్రి పదవుతోంది. ప్రసంగం పూర్తి కావొస్తోంది.

నిఖిలేష్ వెళ్ళిపోవడానికి రడీ అవుతున్నాడు.

దీపక్‌పరుగు పరుగున నిఖిలేష్ దగ్గరకి వచ్చాడు.

'నిఖిలేష్... మాట' - బయటకు రమ్మంటూ పిలిచాడు.

'ఏవిట్రా దీపక్...' నవ్వుతూ వెళ్ళాడు నిఖిలేష్.

'నువ్వు ఏమనుకోకపోతే ఓ విషయం 'నిఖిలేష్ కేసి చూశాడు.

'ఫర్వాలేదు... నాదగ్గర ఈ ఫార్మాలిటీస్ ఏవిట్రా' - నిఖిల్ దీపక్ భుజం మీద చెయ్యివేస్తూ అన్నాడు.

'నువ్వు నాతో రావాలి... ఈ నైట్' అన్నాడు దీపక్

'ఎక్కడికిరా'?

'ఈ నైట్ నాతో ఎంజాయ్ చెయ్యరా...!'

'నీతోనా...?' పకపకానవ్వాడు నిఖిలేష్.

'ఛ... నాతోకాదు... ఓ మంచి బ్యూటీ ఉంది. మనకి గెస్ట్‌హౌస్ రూం రడీ... ట్రాన్స్‌పోర్టు కూడా అరేంజ్‌డ్. హాయిగా మాట్లాడుకొని ఎంజాయ్ చేసివద్దాం... ఓకే' దీవక్ మెరిసే కళ్ళతో చూశాడు.

'నేను రాను...' నిఖిలేష్ ముక్తసరిగా చెప్పాడు.

'అదేమిట్రా... నువ్వు వస్తావనే అన్నీ అరేంజ్ అవుతున్నాయి. ప్లీజ్‌రారా...' దీపక్ బతిమాలుతున్న ధోరణి ప్రదర్శించాడు.

'నేను అరేంజ్ చెయ్యమని అడిగానా' నిఖిలేష్ కంఠం ఘాటుగా ఉంది. 'కలవక కలవక కలిశాం. నీతో హాపీగా గడుపుదామని... నీకా ఇంట్రస్ట్ లేకపోతే వదిలేద్దాం... కానీ గెస్ట్ హౌస్‌కి మాత్రం తప్పనిసరిగా రావాలి. జస్టిఫర్ కంపెనీ సేక్' ధోరణిమార్చాడు.

'నాకు కుదరదురా... వార్త రాయాలి' - నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు నిఖిలేష్.

'ఇదేం వార్తరా... అయినా ఈ వార్తని ఈ రోజు రాయకూడదని అంతా అనుకొన్నారు. ఎలాగూ ఇపుడు రాసేదిలేదుగా'...

'నో...నో...ప్లీజ్ నన్నువదిలేయి...' అంటూన్న నిఖిల్ మాట వినిపించుకోక దీపక్ బలవంతం చేస్తున్నాడు.

'నా మాట వినరా... వేరే వార్త రాయాలి... అది చాలా ముఖ్యమైంది... నేను వెళ్ళక తప్పదు...' నిఖిలేష్ మొండిగానే చెప్పాడు.

'పది...పన్నెండేళ్ళ తర్వాత కలిశాం మనం. నీకోసమని వాళ్ళతో చెప్పి అన్నీ సిద్ధం చేశాను. నువ్వు నాకూడా వస్తావని నా ఫ్రెండ్సుని వెయిట్ చెయ్యమన్నాను' దీపక్ నిఖిలేష్‌ని కాలుకదపనీయకుండా పెదవి విప్పనీయకుండా మాటల వలఅల్లుతున్నాడు.

'లేదురా... దీపక్ - ఇంపార్టెంట్ వార్త రాయాలి. నన్నువదిలేయి''

'ఏం... ఇంపార్టెంట్‌రా...? రేపురాసుకో వచ్చుగా' దీపక్ నిఖిలేష్ వార్తని తీసిపారేసినట్టు సూచించాడు.

'పోరా... నీకీ విషయం ఎంత ముఖ్యమో నాకు ఆ వార్త అంత - ఇంకపోతాను' తప్పించుకోవడానికి

నిఖిలేష్ మార్గాలు అన్వేషిస్తున్నాడు.

"అంతముఖ్యమైన వార్తలు ఏమున్నాయిరా... ఏదో నన్ను - తప్పించుకోవడానికి చూస్తున్నావ్ - అంతేకదా' - దీపక్ ఆరోపిస్తున్నట్లు చూశాడు.

'ఛ...కాదురా... సివిల్ సప్లైస్ గొడవ... ఏదో... ఆయిల్ గురించి' అని ఆగాడు నిఖిలేష్. ఎలాగోలా దీపక్‌ని తప్పించుకోవాలనే పట్టుదల పెరిగింది. ప్రజల కష్టాలనూ, సమస్యలనూ వెంటనే రాయాలనీ, అది పత్రికా ప్రతినిధుల బాధ్యతనీ, అది మరచిపోతే వృత్తికే ద్రోహం చేసిన వాళ్ళమవుతామనీ, స్వార్థం కోసం వృత్తిని దెబ్బతీయరాదనీ ఓ చిన్న సైజు ప్రసంగం చేసి దీపక్‌ని వదిలించుకోవడానికి తిప్పలు పడ్డాడు నిఖిలేష్. బంజారాహెటల్ బయటకు వచ్చే సరికి రాత్రి పావుతక్కువ పదకొండు అయింది.

ఆఫీసుకి వెళ్ళి నూనె కుంభకోణం వార్తని సమగ్రంగా రాసి ఫోటోతో సహా డస్కులో న్యూస్ ఎడిటర్‌కి ఇచ్చాడు నిఖిలేష్.

న్యూస్ ఎడిటర్ ప్రశ్నలకి ఓపిగ్గా సమాధానాలు చెప్పి, హెడ్‌లైన్ రాయడంలో కూడా సహకరించి ఇంటికి వచ్చేసరికి పన్నెండు దాటింది. నిఖిలేష్‌కి అలసటే తెలియడంలేదు సరిగదా హాయిగా ఉంది.

ఆ వార్తను తలచుకొంటేనే శరీరం తేలికయినట్లుంది. అందమైన ఆలోచనలు మనసంతానిండి సంతోషాన్ని కలిగిస్తున్నాయి.

ఆ రాత్రంతా ఆనందంతో ఉక్కిరిబిక్కిరయిన మనసు నిఖిలేష్‌కి కలత నిద్రనే ప్రసాదించింది.

ఆ కలత నిద్రలోనే వెలుగుకోసం... ఆ వెలుగు తెచ్చే 'నిజం' కోసం ఎదురు చూశాడు.

గదిలోని కిటికీలోంచి ముందు వెలుగుచిమ్మింది.

వెలుగువెంట 'నిజం' కిటికీ చువ్వల్లోంచి రివ్వుమంటూ దూసుకొచ్చి నేలమీద పడింది.

నిఖిలేషని చలికూడా ఏమీ వెయ్యలేకపోయింది. బద్ధకం ఎగిరిపోయింది.

పత్రికని ఆత్రంగా అందుకొన్నాడు.

'నిజం' మొదటి పేజీలో తన వార్తే బేనర్

మొదటి హెడ్‌లైన్ 'వంటనూనె కుంభకోణం!' మంత్రి అదృశ్యహస్తం,

పేపర్లో ఏడుకాలమ్స్ పతాకశీర్షికతో పాటు ఫోటో కూడా చేర్చి పెద్ద బాక్స్ కట్టారు.

అత్యంత ఆకర్షణీయంగా తన వార్తని తీర్చిదిద్దినందుకు 'డస్కుని' మనసులోనే అభినందించుకొన్నాడు.

రాత్రి పదకొండు గంటలకు ప్రూఫ్‌రీడర్ల బల్లమీద కూర్చొని తాను వార్త రాస్తున్నప్పుడు, ఒక్కొక్క పేజీనే అందుకొని ఎడిట్ చేస్తూ కంపోజిటర్లకు ఇచ్చిన చీఫ్ సబ్ ఎడిటర్ గుర్తుకొచ్చాడు.

హెడ్‌లైన్ గురించి సబ్ ఎడిటర్లతోనూ, సీనియర్ న్యూస్ఎడిటర్‌తోనూ సంప్రదించిన డస్కు ఇన్‌ఛార్జి కళ్ళల్లో మెదిలాడు.

వార్త అంత ఆలస్యంగా ఇచ్చినా చకచకా కంపోజ్ చేసిన కంపోజిటర్లు... స్టాఫ్ చూపించిన ఆసక్తిని గుర్తు చేసుకొంటున్నాడు.

ఆనందతరంగాలు నిఖిలేష్‌ని నిలబడనివ్వడంలేదు.

ఆరింటికే తయారైపోయాడు.

సరిగ్గా పావుతక్కువ ఏడింటికి నవ్వు ముఖంతో ప్రవీణ్ నిఖిలేష్ గదికి వచ్చాడు.

వాళ్ళ ఆనందం వర్ణనాతీతంగా ఉంది.

నిఖిల్, ప్రవీణ్‌లకి టిఫిన్, కాఫీ అందించి తన వంతు ఆనందాన్ని పంచుకొన్నాడు శ్రీధర్.

సమయం తొమ్మిదవుతోంది.

నిఖిలేష్, ప్రవీణ్‌లను ఆశ్చర్యంలో ముంచెత్తుతూ ఆఫీసుకార్లో వచ్చాడు సెక్యూరిటీగార్డు ఆరుముగం. నిఖిలేష్‌కి నమస్కారం పెట్టి ఓ కాగితం అందించాడు.

ఆరుముగాన్ని పంపించేసి 'ప్రవీణ్... ప్రెస్ కాన్ఫరెన్సు... సివిల్ సప్లయీస్ మినిస్టర్ ప్రెస్ కాన్ఫరెన్స్' ఆనందంగా ప్రవీణ్‌ని కుదిపేస్తూ అంచినంత పని చేశాడు.

"ఎన్నింటికి...?" ప్రవీణ్ కూడా అదేస్థితిలో అడిగాడు.

"పదిన్నరకి-"

నిఖిలేష్‌కి మంత్రి జగన్నాథరావు ముఖం దీనంగా...హీనంగా కళ్లముందు కనిపిస్తోంది.

క్షణక్షణానికీ తనలో బలం పెరిగిపోతూ ఎదిగిపోతున్నాడు. ఆ మనోబలం నిఖిలేష్‌ను ఆకాశానికి ఎత్తేస్తోంది. నిఖిల్ తలవంచి చూసినా స్పష్టంగా కనబడకుండా నేలమీద లిల్లీపుట్ కంటె చిన్నగా ఆ

మంత్రి అస్పష్టంగా గోచరిస్తున్నాడు.

సమయాన్ని గడపడం కోసం నిఖిలేష్, ప్రవీణ్ లు తంటాలు పడుతున్నారు.

కానీ, ఏమాత్రం తొందరలేని సమయం తనప నిని యథావిధిగా నెట్టుకొస్తోంది.

టైమ్ పదిన్నర దాటేసరికి కొన్ని యుగాలయిన ట్లుగా ఉంది.

పౌరసరఫరాలశాఖ మంత్రి జగన్నాథరావు ఛాంబర్ కిక్కిరిసి ఉంది. ఆ ఛాంబర్‌లో ఠీవిగా నడుస్తున్నాడు నిఖిలేష్.

''అదిగో 'నిజం' వస్తోంది'' ఎవరో అరిచారు.

ప్రవీణ్ అంతవరకూ నిఖిలేష్‌తో వచ్చి ఆఖరివ రుసలో కూర్చున్నాడు.

నిఖిల్ ముందుకుసాగి ముందువరుసలోని ఓ సీటు ఆక్రమించుకొన్నాడు.

''మీరు నిజం నుంచా?'' మంత్రి దీనాతిదీనంగా అడిగినట్లనిపించింది.

''యా''-నిఖిలేష్ కంఠంలోంచి గర్వం, ధీమా కొట్టుకొని బయటకు వచ్చాయి.

''టిఫిన్ తీసుకోండి''- బ్రతిమాలుతున్నట్లుగా ఉంది మంత్రి మర్యాద.

''నో...థేంక్స్'' మళ్లీ అదే దర్పం పలికింది నిఖిలేష్ నోట.

''కాఫీ అయినా...?''

మంత్రి మర్యాద చేయడం కోసం పడే అవస్థ చూసి ప్రవీణ్‌కేసి విజయగర్వంతో చూశాడు నిఖిలేష్.

నిఖిల్‌ను కళ్లతోనే ప్రశంసించాడు ప్రవీణ్.

ఎదురుగా ఉన్న మంత్రిమార్కు ఆసనంకంటె తాను కూర్చొన్న కుర్చీనే ఉన్నత శిఖరంలా నిఖిలేష్ భావిస్తున్నాడు.

అంత ఎత్తునుంచి ఆ మంత్రిని చూస్తున్నట్లుగా ఫీలవుతున్నాడు.

మంత్రి నోటిని దాటి మాటలు బయటకు వస్తున్నాయ్.

''మీకు తెలును... ఈ సమావేశం ఎందుకు పెట్టానో...?''

''రాజీనామా చేస్తున్నారా???'' ఎవరో అడిగేశారు.

''అంత తొందరపడితే ఎలా... నన్ను చెప్పని వ్వండి''- మంత్రి సర్దుకొన్నాడు.

ఆ మంత్రి పడేపాటు... అనుమానాస్పదమైన చూపులూ... కంగారు మాటలూ... నిఖిలేష్‌కు ఆనందాన్ని కలిగిస్తున్నాయి.

''ముఖ్యంగా ఈ సమావేశాన్ని రాష్ట్రంలో కొత్తగా ప్రవేశపెడుతున్న నూతన పంపిణీ విధానాన్ని చెబుదామని ఏర్పాటుచేశాం... ఈనోట్ అదే'' అంటూ ఓ ప్రెస్‌నోట్‌ను పి.ఎ.చేత పంచిపెట్టించాడు.

''రామాయణంలో పిడకలవేట... ఇదేమిటీ... మీ మీద పత్రికలో వచ్చిన ఆరోపణల సంగతేమిటి?'' మూలగా కూర్చున్న ఓచీఫ్‌రిపోర్టర్ మంత్రిని నిలదీశాడు.

''వస్తున్నాను. ఆ సంగతీ చెబుతాను... కంగారు పడకండి'' మంత్రి కంఠం మారింది.

''నిజం' పత్రికను చేతిలోకి తీసుకొన్నాడాయన'' ఆ వార్తకేసి చూస్తూ... నవ్వుతూ... ''చూశారా... నామీద ఎంత ఆరోపణ చేశారో... ఈ పత్రిక పేరు 'నిజం'. రాసిందిమటుకు 'పచ్చి అబద్ధం'. జర్నలిజం పేరుతో స్వేచ్ఛ ఉందికదాని ఇష్టం వచ్చినట్లు రాశారు. వ్యక్తిగతంగానూ, రాజకీయంగానూ, ప్రజల్లోనూ నన్ను దెబ్బతీసేవిధంగా అబద్ధాన్ని నిజమనుకొనేటట్లు మసిపూసి మారేడుకాయచేసి పెద్ద పెద్ద అక్షరాలతో ఏనాడో... ఎక్కడో తీసిన ఓపాతఫోటో సంపాదించి వార్త రాశారు. ఇది జర్నలిజమా? ఇదేనా పత్రికలు చేయాల్సినపని. మీకు తెలుసు ఎందరో మహానుభావులు పత్రికలు పెట్టి మనదేశ స్వాతంత్ర్యం కోసం ఎంతో చేశారు...! ప్రజల్లో దేశభక్తినీ, త్యాగనిరతినీ కలిగిస్తూ ఎంతలా ఉత్తేజం కలిగించారు? ఎన్ని బాధలు... ఎన్నెన్ని కష్టాలు... అన్ని పడినా వాళ్లంతా దేశస్వాతంత్ర్యమే ముఖ్యమనుకొని ముందుకు నడిచారు. బ్రిటిష్ నిరంకుశత్వాన్ని నిరసించారు. పోరాడారు. అదెంత దేశసేవ... ఎంత దేశభక్తి... అలాంటి దేశసేవ చెయ్యాల్సిన పత్రికలు తమ బాధ్యతను పూర్తిగా విస్మరించి అభూతకల్పనలు చేస్తూ, పచ్చి అబద్ధాలతో ప్రజల్లో సంచలనం కలిగిస్తూ డబ్బు సంపాదించుకొనే స్థాయికి దిగజారాయి. ఎల్లో జర్నలిజం పత్రికలకూ... పెద్దగా పేరు సంపాదించిన ఈ 'నిజం' పత్రికకూ తేడా ఏమిటని నేను అడుగుతున్నాను మీముందు. నేను ఛాలెంజ్ చేస్తున్నా. ఈ వార్తలో నాబావ ఇంటి ఎడ్రస్, గోడౌన్ వివరాలు రాశారు. గోడౌన్ ఉన్నమాట వాస్తవం. కానీ అక్కడ వేలసంఖ్యలో వంటనూనెటి

న్నులు ఉన్నాయా...?'' మంత్రి ఆగి నవ్వేరు. ''హు... ఎంత అబద్ధం. ఈ క్షణమే మిమ్మల్నందర్నీ ఆ గోడౌన్ దగ్గరికి తీసుకువెళతాను. నిజానిజాలు మీరే తేల్చుకోండి. ఆ గోడౌన్‌లో ఒక్క నూనెటిన్ను కనిపిస్తే మీముందే అక్కడికక్కడే నామంత్రి పదవికి రాజీనామా ఇస్తాను'' అని తన దీర్ఘోపన్యాసాన్ని ముగించి ఛాంబర్ బయటకు వచ్చాడు జగన్నాథరావు. అప్పటికే ఆ ఛాంబర్ ముందు పోర్టికోలో నాలుగైదుకార్లు సిద్ధంగా ఉన్నాయి. బిలబిల మంటూ ఆ పత్రికా ప్రతినిధులు ఆ కార్లలోకి చొరబడ్డారు.

నిఖిలేష్, ప్రవీణ్‌లకు ఏంజరుగుతోందో అర్థం కావడంలేదు. ఆ అయోమయపరిస్థితిలోనే మిగతా వాళ్లతోపాటు కార్లలో ఎక్కారు.

ఆ కార్లు సికింద్రాబాద్‌వైపు దూసుకుపోతున్నాయి.




'నిజం' ఎడిటర్ సౌజన్యారావు, రిపోర్టర్స్ ఇన్‌ఛార్జి అమరేందర్, అరవింద్, నిఖిలేష్, ప్రవీణ్‌ల మధ్య చర్చ పతాకస్థాయిని అందుకొంది.

నిన్న ఉదయం ఉన్న వేలాది ఆయిల్‌టిన్నులు ఆగోడౌన్ నుంచి ఎలా అదృశ్యం అయ్యాయి?

నిన్న రాత్రికి రాత్రే ఖాళీ చేశారా? అదెలా?

ఈరోజు ఉదయం మనపత్రిక మార్కెట్లోకి వచ్చే వరకూ ఆవార్త ఎవరికీ తెలియదుగా? నిన్నరాత్రి పదకొండుదాటిం తర్వాత ఆవార్త గాసినపుడు మినిస్టర్‌కి తెలిసే అవకాశం ఎలా ఉంటుంది?

పైగా ఆ గోడౌన్‌లో ఒక్క ఆయిల్‌టిన్ను కూడా లేదా?

అదీకాక ఆ గోడౌన్‌లో పదికుటుంబాల వాళ్ళు ఉన్నారా?. వాళ్ళు ఇళ్ళు కట్టే పాలమూరులేబరా?. వాళ్ళు ఎలా వచ్చారు?

మంత్రి బావ వాళ్ళకి ఉదారంగా ఆశ్రయం ఇచ్చాడా..?

ఎడిటర్ సౌజన్యారావు నిఖిలేష్, ప్రవీణ్ అందించిన వివరాలను మళ్ళీ పరిశీలిస్తున్నాడు.

'వాళ్ళు ఎంతకాలం నుంచి ఆ గోడౌన్‌లో ఉన్నామన్నారూ..?' నిఖిలేష్‌ని అడిగాడు సౌజన్యారావు.

'జగన్నాథరావు వాళ్ళని ఇంటర్వ్యూ చేశాడండి-' అని మొదలెట్టి మంత్రివాళ్ళని 'ఎంతకాలంనుంచి ఉంటున్నారు?' అనడిగితే 'ఏదో బాబయ్యా... ఇక్కడ తలదాచుకొంటున్నాం. మూడు నెలలయింది దొరా' అని జవాబిచ్చారని నిఖిలేష్ వివరించాడు.

'వాళ్ళు ఆగోడౌన్‌లో ఎలా వున్నారూ?' సౌజన్యారావు అడిగాడు.

''గోడౌన్ బయట వంటలు చేసుకొంటున్నారు. కొందరు కుక్కి మంచాలు వేసుకొని పడుకొన్నారు. చాపలమీద ముసలాళ్ళు పిల్లల్ని ఆడిస్తున్నారు. ఆడవాళ్ళు బియ్యం బాగు చేసుకొంటూ కనిపించారు. కొంతమంది పనుల్లోకి వెళ్ళిపోయారు. మిగిలిన వాళ్ళు మంత్రికి జవాబు చెప్పారు' నిఖిలేష్ పూర్తిచేశాడు.

'నిన్నటి కావలా గూర్ఖా కనిపించాడా?' సౌజన్యారావు ప్రశ్నించాడు.

'లేదు సార్. వాడికోసం వెదికాం'- నిఖిలేష్ వినయంగా జవాబిచ్చాడు.

'నిఖిల్... నిన్న... నరిగ్గా గుర్తుతెచ్చుకో అదే గోడౌన్‌కి వెళ్ళారా... లేక మంత్రి ఇంకో గోడౌన్‌కి తీసుకెళ్ళాడా??' సౌజన్యారావు ప్రవీణ్‌కేసి కూడా చూస్తూ అన్నాడు.

'అదేసార్... ఇంటినెంబరు కూడా నోట్ చేసుకొన్నాం. వార్తలో కూడా రాశాం. మంత్రి అదే చూపించాడు' నిఖిల్, ప్రవీణ్‌లు అందుకొన్నారు.

''నీకు ఆవేశం ఎక్కువ నిఖిలేష్. సౌమ్య రేప్ అండ్ మర్డర్ వార్తలో కూడా చాలా కంగారు పడ్డావ్??' అమరేందర్ ఆచర్చకి అడ్డుపుల్ల వేశాడు.

'లేదులేండి... సౌమ్యకేసులో నిఖిలేష్ రాసింది నిజమే'-అరవింద్ సమర్థించాడు.

'అలాకాదు అరవింద్‌గారూ... ఇలాంటి సందర్భాల్లో... అందులోనూ మంత్రుల విషయాల్లో మరిన్ని జాగ్రత్తలు తీసుకోవలసింది...' అమరేందర్

మళ్ళీ చర్చకు నాంది పలికాడు.

''నో...నో అమరేందర్. వ్వాట్ అవర్ బోయెస్ డిడ్ ఈజ్ కరెక్ట్. బట్ ఇట్ ఈజ్‌దగేమ్ ఆఫ్ జగన్నాథ రావ్' సౌజన్యారావు కూడా సమర్థించాడు.

'ఇది ఓకేసార్. మనవాడు ఇలాంటి విషయాల్లో కొంచెం స్పీడుగా పోతూంటాడు' అమరేందర్ సౌజన్యారావుకి నచ్చచెప్పడానికి చూశాడు.

'స్పీడుగా పోకపోతే లాభంలేదు. అయినా ఇంత లావాడెలా మేనేజ్ చేశాడు... ఇదంతా ఓ నాటకంలా లేదూ 'సౌజన్యారావు అమరేందర్‌ను అడిగాడు.

'రియల్లీ దీసీజ్ డ్రామా సార్' అమరేందర్‌కి సమర్థించక తప్పలేదు.

ఆ సుదీర్ఘ చర్చలో తలెత్తిన ప్రశ్నలకూ, వాదనలకూ, సందేహాలకు సమాధానాలు చెబుతోంటే మంత్రి సింహాసనం అమాంతంగా తమనెత్తి మీదకు వాలి తమను అధఃపాతాళ లోకాలకు అణచివేస్తున్నట్లూ, మంత్రి పాదందగ్గర చిటికెనవేలు సమీపంలో తమతలడున్నట్లూ అనిపిస్తోంది నిఖిలేష్, ప్రవీణ్‌లకి.

మంత్రి జగన్నాధరావు అమాంతంగా పర్వతమంత ఎత్తు ఎదిగినట్లు కనిపిస్తున్నాడు.

చిన్న ఎర్రచీమల్లా ఆ జగన్నాధరావు పాదం చివర్లో తాము‌న్నామా అనేభావం కలుగుతోంది.

ఆ ఇనుపపాదం కింద తమతలలు పగిలిపోతాయనే భయం ఎక్కడో మొదలైంది. ఆ చర్చలు సాయంత్రం వరకూ సాగి సాగి జగన్నాధరావు చెప్పింది నిజమా? గోడౌన్‌లోనుంచి రాత్రికిరాత్రే వంటనూనె టిన్నులు ఎలా మాయమయ్యాయి? అనే ప్రశ్నలతో కర్రవిరగకుండా పాము చావకుండా రేపటి పేపర్లో ఏం రాయాలనేది నిర్ణయించారు.

అందరూ తనని చేతకానివాడ్ని చూసినట్లుగా చూస్తున్నట్లు నిఖిలేష్‌కి అనిపిస్తోంది.

గుండెలు పిండేస్తున్నంత బాధ.

ఏంచెయ్యడానికీ తోచని దయనీయ పరిస్థితి.

అందరి చూపులనీ తప్పించుకుంటూ రాత్రి ఎనిమిదిన్నరకి ఆఫీసుదాటి రోడ్డున పడ్డాడు. సాయంత్రమే మార్కెట్‌లో విడుదలయిన ఓ పత్రికలో 'నిజమా?... అబద్ధమా??'-మంత్రి ఛాలెంజ్! అంటూ పతాక శీర్షికలో వార్త ప్రచురించారు. ఆ రోజు జరిగినదంతా వివరంగా రాసేశారు.

పాన్‌షాపు దగ్గర ఆగి ఓపేపరు కొనుక్కొని చూస్తున్న నిఖిలేష్ ముందు ఆటో ఆగింది. అజయ్ దిగాడు.

'నిఖిల్... మాట' అజయ్ నిఖిలేష్‌ని పక్కకు పిలిచాడు.

మోటారు సైకిల్ స్టాండువేసి అజయ్‌ని అనుసరించాడు నిఖిలేష్.

'అంతా మోసంగురూ... నువ్వు రాసిన వార్త కరెక్ట్. కానీ దొంగనాకొడుకు దగా చేశాడు. మంత్రికి నిన్నరాత్రే మీ'నిజం'లో వార్త వస్తోందని తెలిసింది. రాత్రికి రాత్రే ఆ టిన్నులన్నీ మాయంచేశారు. దొంగనాకొడుకులు జనాన్ని తీసుకొచ్చి డ్రామా వేయించారు' అజయ్ ఆవేశంగా తిడుతున్నాడు.

'ఎలా తెలిసిందంటావ్ జగన్నాధరావుకి' నిఖిలేష్ ఎంతకీ అంతుపట్టని ప్రశ్నవేశాడు.

'ఎలా తెలియడమేమిటి గురూ - వాడే... ఆ సన్నాసి దీపక్‌గాడు'

అజయ్ ఇంకా పూర్తి చెయ్యలేదు. నిఖిలేష్‌కు ముచ్చెమటలు పోశాయి. కళ్ళుతిరుగుతున్నాయి. తల బద్దలై పోతోంది. అదిరోడ్డని గుర్తుకొచ్చి తమాయించుకొంటున్నాడు.

'నీకెలా తెలిసింది అజయ్' నిఖిలేష్ గొంతు నీరసంగా అంది.

'వాడేగురూ - దీపక్‌గాడు. అజంతా బార్‌లో ఎడాపెడా తాగుతూ వాగుతున్నాడు. నాకు విపరీతమైన కోసంవచ్చింది. నిజంగా తన్నడానికి సిద్ధమయ్యాను. ఛ... వాడ్ని కొట్టినా రోడ్డున పోయే కుక్కనికొట్టినా ఒకటేనని వదిలేశాను. ఛీ..ఛీ...'

అజయ్ ఆవేశంతో ఊగిపోతున్నాడు.

ఆ క్షణంలో అజయ్ ఎడారిలో ఒయాసిస్సులా కనిపించాడు. గంటకుపైగా అజయ్, నిఖిలేష్‌లు అదే విషయాన్ని అనేకకోణాల్లో చర్చించారు.

దీపక్ ఓ గ్రాడ్యుయేట్. వాడికి ఉద్యోగం దొరకలేదు. ఎక్కడా ఏపని చేసే అవకాశమే కరువైంది. చివరికి మినిస్టర్ జగన్నాధరావు కాళ్ళు పట్టుకొన్నాడు, ఉద్యోగం వేయించమని. కొన్నినెలలు తిరిగాడు. విసిగిపోయాడు. ఆఖరికి జగన్నాధరావు చలవతో ఓన్యూస్ ఏజెన్సీ తెరిచాడు. దానిపని జగన్నాధరావుకి సేవ చెయ్యడం.

అజయ్ ఆ వివరాలు చెబుతోంటే ఓ అప్పుడిలా

కనిపించాడు.

'వీళ్ళు దొంగనాకొడుకులు... తేనె పూసిన కత్తులు... నన్ను బేవార్సు అంటారు. నిజమే నేను బేవార్సు. నా పనులు నేను చేసుకొంటాను. డబ్బులు సంపాదించుకొంటాను. పనులు చేసుకోకుండా బతికే మహారాజు జర్నలిస్టుల్లో ఎవడున్నాడు గురూ - ఒక్కడ్ని చూపించు. ఆ మహారాజుకి రెండుచేతులూ ఎత్తి నమస్కారం పెడతాను. ఏంచేసినా ఇలాంటి దారుణాలు చెయ్యను. ఏదిచేసినా చెప్పి చేస్తాను. పదిమందినీ కొట్టి బతికేవాడి దగ్గర నేను కొడతాను. అంతేకాని ఇలా మనవాళ్ళనే వెన్నుపోటు పొడిచే సన్నాసి లక్షణం లేదు. వాడు 'బాడ్‌కావ్'గాడు... వాడ్నసలు ముక్కలు ఏరగ్గొట్టాలి' అజయ్ కోపంతో మండిపడుతున్నాడు.

నిఖిలేష్‌కి అజయ్ మాటలు మనోధైర్యాన్ని కలిగిస్తున్నాయి. జర్నలిజం రంగంలో అడుగుపెట్టిన తర్వాత అంతసూటిగా మాట్లాడే వ్యక్తిని నిఖిలేష్ చూడలేదు. అజయ్ ఎలాంటివాడయినా తాను చేసిన తప్పులను కూడా బహిరంగంగా చెప్పుకుంటున్నాడు.

'నీ వార్త జనంలో గొప్పసంచలనాన్ని కలిగించింది గురూ - ఈరోజు 'నిజం' చూస్తూనే అది నువ్వు రాసిన వార్తే అనుకున్నాను. తెలిసినా ఎన్ని కుంభకోణాలు ఎవడురాస్తున్నాడు. మన జనానికి స్వంత పైరవీలు, పెద్దవాళ్ళతో సంబంధాలు పెంచుకొనే తాపత్రయం తప్పించి వార్తలు రాసే గుణంలేదు. పైరవీ చెయ్యని జర్నలిస్టు మంచివార్తలు రాస్తాడు. వార్తే రాయనివాడు ఇలాంటి వెధవపని చేస్తాడు. ఏదయినాగురూ - ఎక్కడచూసినా 'నిజం' పత్రికే. పోలీసులు... ఎస్.ఐ.లు, సి.ఐ.ల దగ్గర్నుంచి కమిషనర్‌వరకూ నీ వార్తే చదివి చర్చించుకుంటున్నారు. ఆవార్త చదువుతూ మహా ఆనందపడిపోతున్నారు. రోడ్లమీద... బస్సుల్లో... సెక్రటేరియట్‌లో... ఒకటే అనుకోవటం అదిరిపోయిందిలే. ఈడికి... అదే ఈ మినిస్టర్ జగన్నాధరావుకి, వ్యతిరేకవర్గం వాళ్ళు తెగసంబరపడిపోతున్నారు. ఆ శ్రీనివాస్‌గాడు లేడూ... వాడేనయ్యా హోంమినిస్టర్ తమ్ముడు... వాడు పార్టీ ఆఫీసులో మీపేపర్లు పంచుతున్నాడు.''

అజయ్ ఫుల్‌స్టాప్ లేకుండా చెప్పేస్తున్నాడు. 'ఇదంతా నీకెలా తెలుసూ...?' అడక్కూడదనుకుంటూనే నిఖిలేష్ అడిగాడు.

'రిపోర్టర్ని సోర్సు అడక్కూడదు గురూ అయినా నీకు చెప్పడానికేముంది... హోంమినిస్టర్ మేనల్లుడు ఒకడున్నాడులే... వరమలుచ్చా వాడు నాకు బాగాతెలుసు. మనిషి గుణం లుచ్చాగుణమైనా నాతో మంచిగా ఉంటాడు. ఏదో పనులవీ చేసి పెడతాడుకదాని వాడితో తిరగక తప్పదుగా... వాడెటువంటి వాడైతే మనకేంగురూ - మనతో ఎలా ఉన్నాడనేది కావాలిగా... వాడు జర్నలిస్టులను బాగా చూస్తాడు. ఎంజాయ్ చేస్తే వాడితో చెయ్యాలిగురూ - వాడు నీవార్తని బాగా పొగిడాడు. ఓ సారి వీలుంటే నిన్ను పరిచయం చెయ్యమన్నాడు. స్వయంగా అభినందిస్తాడట.''

అజయ్ నిఖిలేష్‌ని ఆకట్టుకొనేలా మాట్లాడుతున్నాడు.

నిఖిలేష్‌కి మౌనమే శరణ్యమయ్యింది.

అజయ్ వెళ్ళిపోయాడు.

దీపక్ చేసిన ద్రోహం నిఖిలేష్‌ని నిలువెల్లా దహిస్తోంది.

చిన్ననాటి స్నేహితుడు కదా అని చెబితే ఎంత ద్రోహానికి తలపడ్డాడు?

మంత్రికి ఆ విషయం చెప్పడంవల్ల దీపక్ లాభపడతాడా?

తాత్కాలికంగా లాభపడినా జర్నలిజం రంగానికే చీడపురుగుకాడా?

దీపక్‌ని ఏంచెయ్యాలి?

నిఖిలేష్ ఏంచెయ్యగలడు?

దీపక్ చేసిన అన్యాయానికి తన సమాధానం?

మౌనమా?

అలాంటి వాళ్ళను ఎవరు మాత్రం ఏంచెయ్యగలరు?

జర్నలిస్టుల సంఘాలు, జర్నలిస్టులూ దీపక్‌ని బహిష్కరిస్తాయా?

దానివల్ల ప్రయోజనం?

తాను నష్టపోయినది తిరిగి వస్తుందా?

అలాంటి వాడ్ని సంఘమే శిక్షించాలా?

ఎవరా సంఘం?

ప్రభుత్వమా?

నాయకులా?

ప్రజలా...?



పత్రిక సమావేశాలు ఏర్పాటు చేసే పెద్దలా?? ప్రభుత్వాన్నే మోసంచేసే నాయకుల అండదండగా ఇకనాయకుల గురించీ, అధికార్ల గురించీ ఎందుకు ఆలోచించాలి?

పాపం... ప్రజలు! వాళ్ళకి దీపక్‌లాంటివాళ్ళు ఉంటారని ఎలా తెలుస్తుంది?

ఆ పెద్దలు వాడ్ని పిలిచారో...? ... లేదో...? వాళ్ళకి ఏడివిషయం తెలిస్తే కదా...?

దీపక్‌లాంటి వాళ్ళ సంఖ్య జర్నలిజం రంగంలో ఇంతదారుణంగా ఎలా పెరుగుతోంది?

ఎవరు దీనికి కారణం?

వాళ్ళ సంఖ్య పెరుగుతూ పోతే జర్నలిజం రంగం ఏమవుతుంది?

ప్రజాస్వామ్య పరిరక్షణే ధ్యేయంగా బాధ్యత నిర్వర్తించాల్సిన జర్నలిస్టులు మోసపోరా?

నైతికంగా దెబ్బతినరా?

మానసికంగా కుంగిపోరా...??

వీళ్ళని అరికట్టేదెవరు?

మోసగాళ్ళుగా విషపుమొక్కలుగా వీళ్లని గుర్తించేదెవరు?

నిఖిలేష్ కళ్ళముందు వేలాది దీపక్‌లు కదులుతున్నారు.

భావితరాల జర్నలిస్టులకు ఈ నీచుల బారి నుండి రక్షణ ఉంటుందా?

యువతి మానభంగం, హత్

నిఖిలేష్ అన్యమనస్కుడయ్యాడు.

★ ★ ★

"ఆ రోజు రాత్రి ఎనిమిదిన్నర దాటింది.

సికింద్రాబాద్ రైల్వే స్టేషన్ హడావిడిగా ఉంది. ఆ రద్దీలో తప్పించుకోవడానికి ఇబ్బందికరంగా ఉన్న పరిస్థితిలో ఓ ఆడగొంతు అరుస్తోంది.

"నన్ను వదిలేయండి... ప్లీజ్... లీవ్ మీ... హెల్ప్... యూ రాస్కెల్స్... ఇడియట్స్... లీవ్‌మీ..."

పిచ్చిగా అరుస్తోంది ఆ గొంతు.

"వదలండి... వదలండి" అంటూ గింజుకొంటున్న ఓ పాతికేళ్ళ వయసున్న అమ్మాయిని... నలుగురు బలవంతంగా లాక్కుపోతున్నారు.

ఇదేం దారుణమని నేనూ వెళ్ళాను. నాలా అనుకొన్న చాలా మంది వాళ్ళని అడ్డుకొన్నారు.

"ఎవరా అమ్మాయి...? ...ఏమీ అన్యాయం?" అడిగారు.

గుమిగూడిన జనాన్ని వారిస్తున్నాడో ముసలాయన. ఆ అమ్మాయి ఆయన కూతురేనట. వాళ్ళు తన బంధువులట. కూతురికి మతి స్థిమితం తప్పిందట. వైద్యం కోసం ఎక్కడెక్కడో తిరుగుతున్నాడట.

"పాపం... ఆ అమ్మాయి చాలా అందంగా ఉందిసార్. మన ఎర్రగడ్డ ఆస్పత్రికి ఆ రోజు రాత్రే తీసుకెళ్ళారు. ఆ అమ్మాయి తెలుగు ఇంగ్లీషు బాగా మాట్లాడింది సార్. పాపం ఆ ముసలాయన్ని చూస్తే జాలేసింది. ఆ పిల్లని తీసికెళ్లడానికి వాళ్ళకు ఎంతో కష్టమయింది సార్."

చెప్పుకు పోతున్నాడు సికింద్రాబాద్ స్టేషన్లో ఆర్.టి.సి. బస్సులు ఆగే బస్‌స్టాండ్ ఎడమవైపున్న పాన్ షాప్ యజమాని. ఆ పాన్‌షాపు కార్లు నిలిపే స్థలానికి పక్కనే ఉంది.

'ఎనిమిదిన్నరకు ఈ సంఘటన జరిగిందంటున్నావ్—అప్పటికి నీ షాపు తెరిచే ఉందా...?' నిఖిలేష్ అడిగాడు.

'లేదు సార్. బంద్ చేసా. దోస్త్ సైకిల్ తీసుకెళ్ళాడు. ఎదురు చూస్తూ షాపుముందు నిలబడ్డా"

"ఆ అమ్మాయిని నువ్వు గుర్తు పట్టగలవా'?

'కనిపిస్తే గుర్తు పడతా సార్'—

'ఆ అమ్మాయిని వాళ్ళు ఎలా తీసుకు వెళ్ళారు?'

"నలుగురు ఉన్నారు సార్. వాళ్ళు బలవంతాన ఇదే ఇలానే తీసుకు పోయారు"—!

"నేనడిగింది బలవంతాన లాక్కొచ్చి ఎలా—ఎందులో తీసుకెళ్ళారు—?" నిఖిలేష్ ప్రశ్నించాడు.

'ఓ కారులో సార్. లైట్ బ్లూ కలర్ అంబాసిడర్—'

'ఆ కారు వరకూ నువ్వు వెళ్ళావా'—?

"ఇక్కడే సార్... చూడండి అక్కడ పార్కు చేసారు."

'ఎవరూ...?'

"గుర్తు లేదుసార్... వాడ్నడిగితే చెబుతాడు." ఆ పక్కనే ఎవడితోనో మాట్లాడుతున్న మరొకడ్ని పిలిపించాడు పాన్ షాపు యజమాని.

'అరె... ఆ రోజు పిచ్చి పిల్ల అని ఎక్కించుపోయినారు చూడు... రాత్రి ఓ కార్లో తీసుకుపోయినారు కదర. ఆ కారు కలర్ లైట్ బ్లూ'— గుర్తు చేశాడు పాన్ షాపు యజమాని. వాడు గుర్తు తెచ్చుకోవడానికి రెండు నిమిషాలు పట్టింది.

'నువ్వేం చేస్తుంటావ్...?' వాడ్నడిగాడు నిఖిలేష్.

'ఈ కారు స్టాండ్‌ల పన్జేస్తా' వాడు జవాబిచ్చాడు.

'ఆ కారుని బాగా గుర్తు పడతా సార్'— వాడు మళ్ళీ చెప్పాడు.

'ఎలా...?'

'ఆ రోజు రెండుమూడు సార్లు వచ్చింది... డ్రైవర్ పైసలు ఇవ్వడానికి గొడవ చేసిండు... నేను వదులుతా... వసూలుచేసిన' వాడు తన తెలివిని తనే ప్రశంసించుకొంటున్నాడు.

"నువ్వు పైసల్ కోసం కారుని గుర్తు పెట్టుకొన్నావ్— ఆ కారులోనే ఆ పిచ్చి అమ్మాయిని తీసుకెళ్ళారని గ్యారంటీ ఏమిటి?' అన్నాడు నిఖిలేష్.

'సార్ ఆ కార్లోనే ఆ అమ్మాయిని తీసుకెళ్ళారు సార్. నేనక్కడే ఉన్నాను. ఆ కారు చాలా బాగుంది సార్. బ్యాక్ అద్దానికి లైనింగ్ మీద చిన్న చిన్న బల్బులు పెట్టిను సార్. అద్దంలోంచి రెండు పోతులు కనిపిస్తాయి సార్'— వాడు కారుని వర్ణిస్తున్నాడు.

'రెండు పోతులా...అంటే పొట్ల గిత్తలా... ఏ రంగులో ఉన్నాయ్.'?

'తెల్లగున్నాయ్... మంచిగున్నాయ్. ఎదురెదురుగా పెట్టినాడేమో మంచి షో కొట్టింది సార్'—!

'అది సరే నువ్వు అంతసేపు ఆ కారుని చూశావ్. రెండు మూడు సార్లు ఆ కారు వచ్చిందంటున్నావ్. ఆ కారు నంబర్ గుర్తు లేదా...?'

'సరిగ్గా యాద్ లేదు సార్—!

'అలా కాదయ్యా... బ్లూ కలర్ అంబాసిడర్....అవునా...'

'అవ్'

'కారు వెనుక అద్దంలోంచి రెండు తెల్లని పొట్ల గిత్తలు మంచిగ షో కొట్టినయ్...'

'అవ్ సార్'

'మరి కారు నెంబరు... అనలా కారుకి నెంబరే లేదా?'

వాడు నవ్వాడు... 'ఉంది సార్. అదీ ఎ.పి.ఎస్. కాదు... ఎ.పి.కె... లేదు సార్ ఎ.పి.ఎస్. సార్. నంబరు... ఆరు... సున్నా... ఏమో సార్... సరిగా యాద్ లేదు. కారు నంబర్లు యాద్‌కి ఉండదు సార్' వాడు చెప్పలేకపోయాడు.

'సరే... ఆ పిచ్చెక్కిన అమ్మాయిని తీసికెళ్ళిన వాళ్ళల్లో ఎవర్నయినా గుర్తు పట్టగలవా... ?'

'అందర్నీ గుర్తు పట్టలేను... ఓ మనిషి యాదున్నాడు. పొడుగ్గా ఉంటాడు సార్. క్రాఫ్ స్టయిల్‌గా ఉంది. బాగా పైసలున్నా మనిషిలా కొట్టాడు. మెడలో గొలుసు... చేతికి కూడా ఏదో గొలుసు లాంటిది తొడిగిండు' వాడు ఆ మనిషి గురించి తనకు తెలుసున్న వివరాలన్నీ అందించాడు.

'ఇంకా ఆ కార్లో ఎవరెవరు ఎక్కారు?' నిఖిలేష్ ప్రశ్నించడం ఆపలేదు.

పిచ్చి అమ్మాయి... ముసలాయన... ఆ అమ్మాయిని తీసుకొచ్చిన వాళ్ళూ ఎక్కారుసార్' అని చెప్పి వాడు నిఖిలేష్‌ని 'ఇవన్నీ మీరెందుకు అడుగుతున్నా'రని ఎదురు ప్రశ్నలు వేయడం మొదలు పెట్టాడు.

'పోదామా...?' నాగేష్ పిలిచాడు.

'ఓ..కే..' నిఖిలేష్ తలూపుతూ ఆ పాన్ షాపులోనే సిగరెట్‌పెట్టికొని ఓ సిగరెట్ ముట్టించాడు.

'ప్రవీణ్ వస్తానన్నాడు...ఏమయ్యాడు' నాగేష్ అడిగాడు.

'ఏదో పనుందట. సెక్రటేరియట్‌కి వస్తానన్నాడు' నిఖిలేష్ మోటారు సైకిల్ స్టార్ట్ చేశాడు.

ఇద్దరూ పావుగంటలో సెక్రటేరియట్‌లోని ప్రెస్ రూం దగ్గరకి చేరారు. ప్రెస్ రూంకి ఎదురుగా చెట్లకింద ఉన్న ఓ స్కూటర్ సీటుమీద కూర్చుని ప్రవీణ్ ఎవరితోనో కబుర్లు చెబుతున్నాడు.

'రండి..లోపలికి పోదాం. రూం ఖాళీగానే ఉంది' అంటూ మొదట ప్రవీణ్ ప్రెస్ రూంలోకి దారితీశాడు. నిఖిల్, నాగేష్ అనుసరించారు. ఆ రూంలో వీళ్ళు ముగ్గురూ సోఫాలోనూ, దానికెదురుగా ఉన్న కుర్చీల్లోనూ ఎదురెదురుగా కూర్చున్నారు. పాన్‌షాపు వాడూ, కార్లస్టాండ్ వాడూ చెప్పిన దంతా నెమరేసుకొంటున్నారు.

''పిచ్చిదని చెబుతూ సౌమ్యను కార్లో బలవంతాన తీసుకెళ్లారా?'' చర్చకు నాంది పలికాడు నిఖిలేష్.

'ఇదేదో మాస్టర్ ప్లాన్. ట్రైన్ దగ్గర్నుంచీ పిచ్చిదని చెబుతూ బలవంతంగా తీసుకువచ్చారంటే వాళ్లూ ఆ రైల్లోనే ఆమెతోపాటే ప్రయాణం చేసి ఉండాలి. ట్రైన్‌లోనే ప్లాన్ చేసి ఉంటారు.' నాగేష్ పాయింట్ అందించాడు.

'యు ఆర్ కరెక్ట్- అంటే ఆ రైల్లో సౌమ్యతోపాటే ముగ్గురో... నలుగురో ప్రయాణం చేసి ఉంటారు. కానీ ఇక్కడో చిక్కుంది...?. ఆ ముసలాడు ఎవరు? ఆ కారు ఎవరిది?? కోణార్క్ ఆలస్యంగా వచ్చింది.

''ఆలస్యంగా వచ్చిన కోణార్క్‌లో తమ వాళ్ళు వస్తారని ఆ కారు వచ్చిందా? అలాగే వచ్చి ఉండాలి.'' ప్రశ్నలూ... సమాధానాలు నిఖిలేష్ వేసుకొంటున్నాడు... చెప్పుకొంటున్నాడు.

'కారు రావడం పెద్ద సమస్య కాదనుకోండి. ఆ ముసలాడెవడో? సస్పెన్సు కారెక్టర్...వాడో సమస్యగా ఉన్నాడు. ముందు వాడెవడో ఆలోచించాలి' నాగేష్ అన్నాడు.

'ఏదో పైసలిచ్చి ముసలాడ్ని సృష్టించి ఉంటార్లే నిఖిలేష్. డబ్బులిస్తే ఎన్నినాటకాలైనా వేసే వాళ్ళు ఎంత మంది లేరూ ఎవడ్నో ట్రైన్ లోనే పట్టుకొని ఉంటారు....'ప్రవీణ్ అందుకున్నాడు.

'దానివల్ల ముసలాడికి పెద్దగా ఉపయోగమేముంటుంది ప్రవీణ్...అదీకాక వాడూ ఆ కార్లోనే మిగతా వాళ్ల కూడానే వెళ్లాడు'

నాగేష్ చెబుతూనే ఆలోచనలో పడ్డాడు.

'వాడికేముంది డబ్బు తీసుకొని ఉంటాడు. వాళ్ళ

కూడా ఆ కారుఎక్కి మధ్యలో దిగిపోయి ఉంటాడు.'

ప్రవీణ్ అంచనాను నిఖిలేష్ కొట్టిపారెయ్యలేదు.

'నాగేష్ ఎర్రగడ్డ మెంటల్ ఆస్పత్రికి ఫోన్‌చేద్దాం. 'నిఖిలేష్ గుర్తుచేశాడు.

ఫోన్ చేశారు.

అదే తేదీన ఓ యువతిని చేర్చుకున్నారు. ఎన్ని గంటలకు?... అంటే టైమ్ సరిగా చెప్పలేక పోయారు. పేరు మాత్రం సౌమ్యకాదు. సత్యవతి. ఆ మానసిక రోగి సత్యవతిని నాలుగురోజుల కిందటే ఇంటికి పంపించేశారు. మెంటల్ ఆసుపత్రి వాళ్ళు చెప్పింది విని ముగ్గురూ నీరస పడిపోయారు.

'కాఫీ తాగుదాం-' ప్రవీణ్‌లేచాడు. ముగ్గురూ ప్రెస్ రూం దాటి బయటకు వస్తుండగా ఎదురుగా నడిచి వస్తోంది భారతి.

'ఎక్కడికి...?' ఆగమన్నట్లుగా అడిగింది.

'కాఫీకి'...నిఖిలేష్ మిగతా ఇద్దరికేసి చూస్తూ చెప్పాడు.

'నేనూ మీ కూడా జాయిన్ అవ్వచ్చా' నవ్వుతూ వాళ్ళకేసి చూస్తూ అంది భారతి. 'రండి...' నాగేష్ పిలిచాడు.

'స్కూటర్ ఏమయింది.?' నిఖిలేష్ అడిగిన ప్రశ్నకు స్కూటర్ సర్వీసింగ్‌కు ఇచ్చినట్లు... ఆ స్కూటర్ లేకపోతే ఓ చెయ్యి విరిగినట్లుగా ఉందనీ చెప్పడం ప్రారంభించి స్కూటర్ వల్ల తానెంత సుఖపడుతున్నదీ వివరించింది భారతి.

కాఫీ తాగుతూ నాగేష్ సౌమ్య విషయం ఎత్తాడు. అదో పావు గంట చర్చ నడిచింది.

'సౌమ్యా...?' సాగదీసింది భారతి. మళ్ళీ తనే అంది 'ఆ రేప్‌కేస్' నిఖిలేష్ ముఖంలోకి చూస్తోంది.

నాగేష్ పోతానంటూ కేంటీన్ నుంచే రోడ్డు వేపు వెళ్ళిపోయాడు. నిఖిలేష్,ప్రవీణ్‌లు ఆఫీసుకి బయలుదేరడానికి సిద్ధం అవుతున్నారు. 'నిఖిల్...' భారతి పిలిచింది.

'స్కూటర్‌లేదు. కొంచెం చిక్కడపల్లిలో వనుంది...డ్రాప్ చేస్తావా?' అడిగింది.

'సరే' అనక నిఖిలేష్‌కి తప్పలేదు.

ప్రవీణ్‌కి చెప్పి మోటారుబైక్ తీశాడు.



'ఏవిటీ సంగతి' అన్నట్లు చూస్తున్న ప్రవీణ్ చూపులను తప్పించుకొంటూ భారతిని వెనక ఎక్కించుకొని రోడ్డెక్కాడు నిఖిలేష్.

'సౌమ్య కేసు మళ్ళీ తిరగ తోడుతున్నావా'...? భారతి అడుగుతోంది.

'ఆ.. ఏం..?' ఆగిపోయాడు నిఖిలేష్.

'ఎంత వరకూ వచ్చింది ఇన్వెస్టి గేషన్...' భారతి కుతూహలం చూపించింది. చూచాయగా కొన్ని వివరాలు చెప్పాడు నిఖిలేష్.

'అయిపోయిన గొడవ కదా... ఇప్పుడుఎందుకా ఇన్వెస్టిగేషన్... వదిలెయ్యరాదూ..' భారతి సలహా ఇచ్చింది.

ఆలోచనల్లోంచి తుళ్ళి పడ్డాడు నిఖిలేష్.

'అదేం అలా అంటున్నావ్..?' బండి స్లోచేస్తూ అన్నాడు.

'ఏం లేదు... గూండా వెధవలు... నీకేదయినా ప్రమాదం తలపెట్టగలరు. ఎందుకొచ్చింది చెప్పు.... ఇపుడు రాసినా ఫలితం ఏముంటుంది?...'

భారతి మాటలకి ఏదో మత్తు శరీరం నుంచి ఒక్కసారిగా దిగిపోయినట్లనిపింది.

'అలా భయపడితే ఒక్కవార్తకూడా రాయలేం. నీకు ఈ ఆలోచన ఎలా వచ్చింది....?' నిఖిలేష్ సూటిగా ప్రశ్నించాడు.

'ఎలా రావడ మేమిటీ... అలా అనిపించిందంతే...' భారతి తప్పించుకొంది.

భారతి చూపించిన సందులోకి బండిని మళ్ళించాడు నిఖిలేష్.

* * *

చిరువెలుగులు చిందిస్తూ ఆ బార్‌లోని దీపాలు అందానికి అర్థం చెబుతున్నాయి.

టేబుళ్ల చుట్టూఉన్న కుర్చీల్లో కూర్చున్నవాళ్లు మందుకొడుతూ శరీరాన్ని తేల్చుకొంటూ మత్తుగా మాట్లాడుకొంటున్నారు.

సంగీతం... పాశ్చాత్యపద్ధతి... అర్థం కానట్టుగా ఉంది.

అప్పుడప్పుడూ చెవులు బద్దలుకొట్టేలా వాయిద్యాల మీదా కళాకారులు ప్రతాపం చూపిస్తున్నారు.

ఆ సంగీతశబ్దం తప్పిస్తే బారంతా హాయిగా ఉంది.

బార్ ఎంట్రెన్స్‌కి కుడివైపు మూలలో కూర్చొన్నారు డేవిడ్, లూథర్, నిఖిలేష్.

డేవిడ్ హాట్ డ్రింక్ తాగుతున్నాడు. లూధర్ బీరు తాగుతున్నాడు. నిఖిల్ కాజూ తింటూ ఏపిల్ జ్యూస్ తాగుతున్నాడు.

"ఆయిల్ కుంభకోణం మీరే రాశారట...?" లూథర్ మాట్లాడటం ప్రారంభించాడు. తలూపడం తప్పించి మరోమాట మాట్లాడలేదు నిఖిలేష్.

"ఆ జగన్నాధరావు ఎంతకైనా తగినవాడు... ఇంకా నయం. ఆ గోడౌన్ అయి నా ఉంచాడు. తెల్లారేసరికి అది కూడా పీకించి 'ఇక్కడ గోడౌన్ ఉందా' అని వాడే ఆశ్చర్యపోయినా అనుమానించక్కర్లేదు" లూథర్ చెప్పుకుపోతూంటే నవ్వుతూ వింటున్నాడు డేవిడ్.

"మీరు ఆవార్త పబ్లిష్ చేస్తున్నట్లు ముందుగా వాడికెలా తెలిసింది?" నిఖిలేష్‌ని చూస్తూ లూధర్ అడిగాడు. నిఖిలేష్ క్లుప్తంగా జరిగినా సంగతి వివరించాడు.

"హూ... ఎవడిని నమ్మాలో... ఎవడ్ని నమ్మకూడదో తెలీక ప్రతీక్షణం ఛస్తున్నాం. ఏపనీ దొరకనివాడూ, ఏమీ చేతకానివాళ్లూ జర్నలిజం రంగంలోకి దూకేస్తున్నారు. ఈరోజున జర్నలిస్ట్ అనిపించుకోవడం చాలా సులభమయిపోతోంది. నాలుగు డబ్బులు సంపాదించడానికి ఏమార్గం దొరకలేదనుకోండి ఓ చిన్న న్యూస్ఏజన్సీ తెరిస్తే చాలు... హాయిగా బతికేయవచ్చు. దాన్ని ఓ మంత్రికో... ప్రతిపక్ష నాయకుడికో తాకట్టుపెడితే మరింత హాయి. దాంతో ఆ ఏజన్సీకీ, దాంట్లో పనిచెయ్యని జనానికి అక్రిడేషన్ కార్డులు సంపాదించవచ్చు. అదుంటే ఆర్.టి.సి. వాళ్ల కళ్లు మూసి, సిటీబస్సులో తిరగడానికి ఫ్రీపాసు. రాష్ట్రంలో ఏప్రాంతానికి పోవాలన్నా హాఫ్... కాదు వన్ఫోర్త్ అనుకొంటా ఛార్జీ... అవునాండి" లూధర్ నిఖిలేష్‌ని సందేహం తీర్చండి అన్నట్లు చూశాడు.

"నాకు సరిగా తెలీదండి" నసిగాడు నిఖిలేష్.

"మీకు ఆ కార్డు లేదా...?" నీరసంగా చూశాడు లూధర్.

"లేదు" నవ్వుతూ చెప్పాడు నిఖిలేష్.

"ఆఁ..." అని ఆశ్చర్యపడుతూ అక్రిడేషన్ ఉన్న వాళ్ల లిస్ట్ తీశాడు లూధర్.

డేవిడ్ కి ఇదేమీ అర్థంకావడంలేదు. ఆ లిస్ట్‌కేసి చూశాడు. రెండువందల పదహారుమంది ఆ లిస్ట్‌లో ఉన్నారు.

"ఈ లిస్ట్ మీ దగ్గర..." అంటూ మధ్యలోనే ఆగాడు.

"ఏంలేదు. మొన్న జర్నలిస్ట్‌లకి డిన్నర్ ఇవ్వడానికి మా మేనేజింగ్ డైరెక్టర్‌సాహసించాడు. ఎంతమంది ఉంటారో అంచనా ఇమ్మన్నాడు. నేను ప్రెస్‌క్లబ్‌కి వెళ్లి మనవాళ్లని కలిసి అంచనా వాళ్లనే చెప్పమన్నాను. మనవాళ్లు సమాచారశాఖ దగ్గర అక్రిడేటెడ్ రిపోర్టరలలిస్ట్ తీసుకొని వాళ్లందర్నీ పిలవమన్నారు. ఆ సలహా తీసుకొని ప్రెస్‌క్లబ్ మెట్లు దిగివస్తొంటే మీ పత్రిక ప్రతినిధి రాంనాథ్ కనిపించాడు. కాసేపు మాట్లాడుకొన్నాం.

"నీకేమయినా పిచ్చా" అన్నాడు.

"ఏం" అనడిగా. ఇలాగే ఇంతకుముందు హోంమినిస్టర్ రిపోర్టర్లకి డిన్నర్ ఇద్దామని అక్రిడేటెడ్ లిస్ట్ తెప్పించాడట. తీరా ఆ లిస్ట్ చూసేసరికి హోంమంత్రి అంతటివాడే ఖంగుపడి తక్షణకర్తవ్యం కింద ఆ డిన్నర్ కేన్సిల్ చేశాడట. 'ఏదో అర్జంట్ కాన్ఫరెన్సుకి హాజరవ్వాలి. హోంమినిస్టర్ తర్వాత చూద్దాం' అన్నారని పి.ఎ. అందరికీ చెప్పాడట. రాంనాథే నాకు చెప్పాడు" లూధర్ దాదాపుగా ముగించాడు.

"మరి మీ ఎం.డీ. ఏంచేశారు...?" నిఖిలేష్ డేవిడ్ ని గమనిస్తూ లూధర్‌ని అడిగాడు.

"ఆ లిస్ట్ చూశాడు. తిరిగి నాకు ఇస్తూ తర్వాత ఆలోచిద్దాంలే నీ దగ్గరే ఉంచు అన్నాడు" లూధర్ నవ్వుతో డేవిడ్, నిఖిలేష్ కూడా కలిశారు.

"మీరు 'నిజం'లో చేరి ఎంతకాలమైంది?" డేవిడ్ నిఖిలేష్‌ని అడిగాడు.

"రెండేళ్లు దాటుతోంది" నిఖిలేష్ నవ్వుతూ చెప్పి డేవిడ్ ఎందుకడిగాడో అర్థంకాక "ఏం...?" అన్నాడు.

"లూధర్ చూపిస్తే మీరిపోర్ట్సు చూశాను. బాగున్నాయ్" డేవిడ్ అభినందించాడు.

"థేంక్స్" నిఖిలేష్ చెప్పాడు. "మీరు ఏంబిజినెస్ చేస్తున్నారు...?"

"ఎలక్ట్రానిక్ గూడ్స్. ఓ చిన్న షాపుంది" డేవిడ్ లూధర్‌కేసి చూశాడు.

"అలా చెప్పడం వీడికి ఫాషన్. చిన్నదేమిటి, చాలా పెద్ద షాపుంది" లూధర్ డబాయించాడు.

డేవిడ్ నవ్వాడు.

"మీరు సౌమ్యని చూశారు కదూ...?" అంటూ నిఖిలేష్ డేవిడ్ ముఖకవళికల్ని గమనిస్తున్నాడు.

"యస్" ముక్తసరిగా అన్నాడు డేవిడ్.

"ఎక్కడ?" వెంటనే అందుకొన్నాడు నిఖిలేష్.

"గండిపేటలో" అని నిఖిలేష్ చూస్తున్నాడు డేవిడ్.

"ఎప్పుడూ...?" నిఖిలేష్ కొంచెం తాపీగానే అడిగాడు.

"ఆ మర్డరయిన ముందురోజు రాత్రి" ఎక్కడా తడుముకోకుండా డేవిడ్ నిబ్బరంగా చెప్పాడు.

"గండిపేటలో ఎక్కడ"

"పోలీస్‌స్టేషన్‌కి ఆ మైలుదూరంలో కొన్ని ఇళ్లున్నాయ్. అవి చాలా పాతఇళ్లు. వాటిలో మొదటి ఇంటి దగ్గర" సిప్ చెయ్యడానికి డేవిడ్ ఆగాడు.

"మీరు ఆ ప్రాంతంలో ఏదైనా కారుని చూశారా?"

"ఏవో కార్లు కనిపించాయి. వాటిని నేను పెద్దగా పట్టించుకోలేదు. నేను కూడా కార్లోనే వెళ్లాను."

"ఎందుకూ?" లూథర్‌ని చూస్తూ డేవిడ్ ని అడిగాడు నిఖిలేష్.

"ఓ గర్ల్‌ఫ్రెండూ నేను వెళ్లాం. అక్కడ రూమ్స్ దొరుకుతాయి. నీట్‌గా ఉంటాయి. హేపీగా ఎంజాయ్ చేసివద్దామని వెళ్లాను. నా కది మామూలే. బహుశా మీకు లూథర్ చెప్పే ఉంటాడు" డేవిడ్ ఏమాత్రం బిడియపడకుండా లూథర్‌కేసి చూస్తూనవ్వుతూ చెబుతున్నాడు. ఆరోజు రాత్రి జరిగిన సంఘటనను వివరించమన్నాడు నిఖిలేష్. ఆనాటి అనుభవాన్ని డేవిడ్ నిఖిలేష్ ముందుంచడానికి ఉద్యుక్తుడయ్యాడు.

డేవిడ్ అలవాటు ప్రకారం రాత్రి పదింటికి ఆ ఇళ్లలో 'రూం'కోసం ప్రయత్నిస్తున్నాడు. ఆ ప్రయత్నంలో ఉండగానే మొదటి ఇంట్లో గొడవ జరుగుతోంది. అలాంటి గొడవలు అక్కడ సర్వసాధారణం. డబ్బు దగ్గర ఏదో గొడవ రావడం... ఆ రూం ఖాళీచేసి వెళ్లిపోవడం జరుగుతూంటుంది. వాళ్లు వెళ్లిపోతే ఆ 'రూం' దొరికించుకోవచ్చుననే అభిప్రాయంతో డేవిడ్ ఆ ఇంటికి వెళ్లి తలుపు తట్టాడు. తలుపు తెరిచిందెవరో తెలీదుకానీ అవి తెరుచుకొన్న వెంటనే ఓ అమ్మాయి దూసుకొని బయటకు వచ్చింది. ఆ పరుగులో చీర అడ్డంపడి ఆ ఇంటి మెట్లమీదే పడిపోయింది. ఆ అమ్మాయిని లేవనెత్తుదాం అని డేవిడ్ అనుకొనేలోగా ముగ్గురు ఆమెను ఎత్తుకొని లోపలికి తీసువెళ్లారు. ఆ సమయంలో ఆమెను స్పష్టంగా చూశాడు డేవిడ్స్. ఆ అమ్మాయి 'హెల్ప్‌మీ' అని దీనంగా అరిచింది. ఈలోగా డేవిడ్ తలమీద బలమైన దెబ్బ పడింది. కళ్లు బైర్లు కమ్మి కిందపడిపోయాడు.

"నేను తేరుకొని చూసేసరికి నాపక్కనున్న గర్ల్‌ఫ్రెండ్ ఇంచుమించు ఏడుస్తున్నట్లుగా మొహంపెట్టి నాకేసి చూస్తోంది. అంతవరకూ కార్లో కూర్చున్న నా గర్ల్‌ఫ్రెండ్ నన్ను ఎవరో కొట్టడం చూసింది. ఆ దెబ్బకు పడిపోయిన నన్ను చూస్తూ ఏంచెయ్యాలో తోచక గాభరా పడుతోంది. తలమీద బ్లడ్ రాలేదు కానీ గట్టిదెబ్బ తగిలింది. బాగా బొప్పి కట్టింది. నా ఫ్రెండ్ సాయంతో పైకిలేచాను. ఆ అమ్మాయే గుర్తుకొచ్చినా నా గర్ల్‌ఫ్రెండ్‌మటుకు వెంటనే వెళ్లిపోదామంటూ పట్టుబడింది. ఎందుకో నాకూ అలాగే అనిపించి ఒక్కక్షణం వేస్టుచెయ్యకుండా బయలుదేరి వచ్చేశాం. ఆమర్నాడు ఈ సంగతి లూథర్‌కి చెప్పాను. లూథర్‌కి చెప్పినరోజు సాయంత్రం అర్జంట్ పనిమీద బొంచే వెళ్లాల్సివచ్చింది. నాలుగురోజుల తర్వాత వచ్చిన నన్ను లూథరే అడిగాడు ఈ విషయం గురించి. మీ వార్త చదివాను. ఓ ఇంగ్లీషు పత్రికలో ఆ డెడ్‌బాడీ ఫొటో చూశాను. ఆ అమ్మాయే రేప్ అయింది. పైగా మర్డర్ కూడా చేసేశారు. లూథర్, నేనూ ఈ విషయం పోలీసులకి చెబుదాం అనుకొన్నాం. మీకు తెలుసుగా పోలీసుల సంగతి. మనం ఈ సంగతి చెబితే వాళ్లు అసలు చేసినవాళ్లని వదిలేసి అదంతా మనమీదికే చుట్టివేధిస్తారు. అందుకే ఊరుకొన్నాం. మీరు ఈ కేసు ఇన్వెస్టిగేషన్‌లో ఉన్నారని లూథరే చెప్పాడు. మీకు ఉపయోగపడుతుందనీ, పేపర్లో రాస్తే ఆ మర్డర్ చేసినవాళ్లని పోలీసులు ఎలాగోలా పట్టుకొంటారనీ" తన అనుభవాన్ని చెప్పి "ఏమిటీ మీ అభిప్రాయం" అన్నట్లు చూశాడు డేవిడ్

"ఆ అమ్మాయిని సరిగ్గా గుర్తుపట్టారా...?" అనుమానంగా నిఖిలేష్ అడిగాడు.

"నాకు ఒకసారి చూస్తేచాలు ఏ అమ్మాయయినా గుర్తుంటుంది. అందులోనూ ఆ అమ్మాయిని మర్చిపోవడం అసాధ్యం. షీ వజ్ వెరీ బ్యూటీఫుల్! నో డవుట్ ఆ లేడీ సౌమ్యే! నేను పొరపాటుపడడం జరగనిపని... నేనే కాదు, నాగర్ల్‌ఫ్రెండ్ కూడా చూసింది" డేవిడ్ కాన్ఫిడెన్స్‌గా చెబుతున్నాడు.

 

''ఆ అమ్మాయే సౌమ్య అని ఎలా చెప్పగలరు?'' నిఖిలేష్ క్రాస్ఎగ్జామినేషన్ చేస్తున్నాడు.

''మీకు చెప్పానుగా. సౌమ్య డెడ్‌బాడీని ఓ ఇంగ్లీషు పత్రికలో వేశారని. ఇట్ ఈజ్ క్లియర్'' డేవిడ్ తేల్చి చెప్పాడు.

''ఆ ఇంటిదగ్గర ఆమెనుకాక ఇంకెవరైనా గుర్తు పట్టగలరా...? గుర్తున్నారేమో ఆలోచించండి'' నిఖిలేష్ ప్రశ్న డేవిడ్ ని ఆరాత్రి సంఘటనలోకి తీసుకెళ్లింది. ఆలోచనలో పడ్డాడు.

''యస్... ఓ వ్యక్తి గుర్తున్నాడు. పొడుగ్గా ఉన్నాడు... రిచ్‌మన్‌లా కనిపించాడు. మెడలో గోల్డుచైన్...గోల్డ్‌రింగ్స్! జుట్టు స్టయిల్‌గా ఉంది. ఎక్కడో చూశానా వ్యక్తిని'' డేవిడ్ జ్ఞాపకాలు మీటుతున్నాడు.

''ఎక్కడ చూశారు...?'' నిఖిలేష్ ప్రశ్న దూసుకొచ్చింది.

''ఎక్కడో రోడ్లమీదో... బారుల్లోనో చూసుంటాను. బట్ ఆ వ్యక్తిని మళ్లీ చూస్తే గుర్తుపట్టగలను''.

''మిగతావాళ్లెవరయినా గుర్తున్నారా?''

''లేదు... వాళ్లెవరినీ పెద్దగా పట్టించుకోలేదు. ఈలోగానే దెబ్బతిన్నా''

''వాళ్లు సౌమ్యని ఎందుకు మర్డర్ చేశారంటారు?'' ఈ ప్రశ్నతో నిఖిలేష్ డేవిడ్ ఊహని తట్టిలేపాడు.

''అదే నాకు అర్థం కాలేదు... కానీ ఓ విషయం ఏమిటంటే నేను చూసేటప్పటికి ఆ అమ్మాయి వాళ్లకు లొంగడంలేదు.

ఆ అమ్మాయిని ఎత్తుకు తీసికెళ్ళిన ముగ్గురూ కాక ఆ గదిలో ఇంకా ఎవరో ఉండి ఉండాలి. అంటే వాళ్ళు నలుగురి కంటె ఎక్కువగా ఉన్నారు. వాళ్లంతా కల్సి ఆ అమ్మాయిని బలవంతంగా రేప్‌చేసి ఉండాలి. అలా చేసినా చంపెయ్యరు. రేప్ చేసేటపుడు కూడా ఆ అమ్మాయి బలంగా ప్రతిఘటించి ఉండాలి. అందుకే సిగరెట్ వాతలు పెట్టారు. వీళ్ళంతా మొండికేసి ఆమెను నానాహింసాపెట్టి రేప్ చేసుంటారు. దానికి తట్టుకోలేక ఆమె ప్రాణంపోయిఉంటుంది... ఐ థింక్ సో...' డేవిడ్ తన ఆలోచనను బైటపెట్టాడు.

ఆ చర్చకు అద్భుతగులుతూ సమయం పదకొండున్నర చూపించింది. ఆలశ్యంగానే ఇంటికి చేరాడు నిఖిలేష్.




గదిలో పడుకొన్న నిఖిలేష్‌కు ఆ వ్యక్తే గుర్తొస్తున్నాడు

డేవిడ్ గుర్తుపట్టిన వ్యక్తి ఎవరు?.

ఆ కారు ఎక్కడ కనిపిస్తుంది?

సౌమ్యను అంతఘోరంగా బలాత్కారించి చంపేశారు. ఆ వ్యక్తితో పాటు ఉన్న మరో ముగ్గురు ఎవరు?

ఆ ముసలాడు ఏమయ్యాడు?

ఒకవేళ ఆ దారుణం చేసిన వ్యక్తిని గుర్తుపడితే తాను ఏం చెయ్యాలి?

వార్తరాయాలా?

వార్త రాయడం ఎలా?

ఆ వ్యక్తిని తాను గుర్తు పట్టినంత మాత్రాన డేవిడ్ ధ్రువీకరించినా... సికింద్రాబాదు రైల్వేస్టేషన్ దగ్గరున్న పాన్‌షాపువాడూ, కార్లస్టాండు వాడూ సహకరిస్తారా?

ఆ వ్యక్తే ఆ దారుణం చేశాడు అనడానికి ఆధారాలు ఎక్కడ దొరుకుతాయి?

ఎలా రుజువు చెయ్యాలి?

సౌమ్య... పాపం... దారుణానికి గురై చనిపోయింది. డేవిడ్ ముందే పోలీసులకు చెప్పడానికి లేదంటున్నాడు. పాన్‌షాపు వాడూ, కార్ల స్టాండు వాడూ సౌమ్యను గండిపేటఇంట్లోకి ఎత్తుకొని తీసుకుపోవడం చూడలేదు. అది చూసిన డేవిడ్ ముందుకు వచ్చి సాక్ష్యం చెప్పడు.

అయినా ఆ వ్యక్తి కనిపించాలిగా...

ఆ కారు ఎక్కడ కనిపిస్తుంది??

కలతనిద్రపోయాడు నిఖిలేష్.

★ ★ ★

"అవినీతి ఎక్కడున్నా ఖండిస్తాను. అన్యాయం, లంచగొండితనాలను ప్రతిఘటిస్తాను. పైరవీలు చేసేవాళ్ళ గుట్టురట్టు చేస్తాను. నిఖిలేష్... చూస్తూండు... వీళ్లందరి భరతం పడతాను"

పిచ్చేశ్వరరావు ప్రెస్ క్లబ్ ముందు నిలబడి అరుస్తున్నాడు.

పిచ్చేశ్వర్రావు తానేగొప్ప జర్నలిస్టుగా తనకు తానే ప్రకటించుకొంటూంటాడు.

జర్నలిజం రంగమంతా తన ముందు ఆఫ్టరాల్ అనేసే మనస్తత్వంతో అందర్నీ ఏదో చేస్తానంటూ అర్థంకాని మాటలతో అనవసరంగా ఆవేశపడుతూంటాడు.

ఎప్పుడో రెండువేలు సర్క్యులేషన్ ఉన్న ఓ పత్రికలో పిచ్చేశ్వర్రావే గొప్ప రిపోర్టర్‌గా చెలామణి అయ్యేవాడట. ప్రస్తుతం ఖాళీ. ఏంచెయ్యాలో తోచక ప్రెస్ క్లబ్‌దగ్గరా, సెక్రటేరియట్ ప్రెస్ రూంలోనూ అరుస్తూ కనిపిస్తాడు.

'ఈ ఆర్భాటమంతా ఎందుకు పిచ్చేశ్వర్రావ్. చేసేదేదో చెయ్యరాదూ... అనవసరంగా వాగుతావెందుకు'...?

నిఖిలేష్ మందలించాడు.

'అద్గుగో... నువ్వూ నాకు వ్యతిరేక వర్గంలో చేరావు. నాకు మద్దతు ఇవ్వడం లేదు. అవునులే... ఎంతమంది నీతికి నిలబడగలరు...' పిచ్చేశ్వర్రావు వాగుడు ఆపలేదు.



'నీ మంచి గురించి చెప్పినా ముప్పేనా... ఏం మనిషివయ్యా... ఎదుటివాడు ఎందుకంటున్నాడో క్షణం కూడా ఆలోచించవు. నీ ధోరణి నీది. అందుకే నిన్నెవడూ భరించలేడు' నిఖిలేష్ కోపంగా అన్నాడు.

''అవునుగురూ... నేనేకదా లోకువగా దొరికాను. వాళ్ళకీ నీకూ తేడా ఏవుందీ... ఎవరన్నా బాధపడను కానీ... నువ్వు అంటేమటుకు నేను తట్టుకోలేను'' పిచ్చేశ్వర్రావు బాధపడుతున్నాడు.

అసలే మనిషి సన్నం. లోతుకున్న కళ్ళు. వాటికి అద్దాలు... కళ్ళల్లోంచి చిందిన నీళ్ళు టపటపాముక్కుమీదనుంచి జారి అతని చొక్కాని తడిపేస్తున్నాయి.

'ఛ...ఛా... అలా ఆడపిల్లలా ఏడుస్తావా. నేను ఇపుడు నిన్నేం అన్నాను. ఏమిటయ్యా చెప్పూ... నేనేం తప్పుమాట్లాడాను. ఏడిచేమగాణ్ణి నవ్వే ఆడదాన్ని నేను ఛస్తే నమ్మను. పైగా పెద్ద జర్నలిస్టునని నీకునువ్వే ప్రకటించుకొన్నావ్...

అవినీతిని ఖండిస్తా... అక్రమాన్ని అణుస్తా... పైరవీ కార్ల పీకనొక్కుతా... ఇలాంటి నినాదాలు ఇస్తూంటావ్? ఈ ఏడుపుచూస్తే అవన్నీ చెయ్యగలవనే నమ్మకం నాకే కలగడం లేదు. నీ మీద గురికలగాలిగా... నీకు మద్దతు ప్రకటించాలంటె... ఏడుస్తూ కూర్చొంటే ఇక అవన్నీ ఎపుడు చేస్తావ్ నాయకా' ఆటపట్టిస్తూ నాటకఫక్కీలో పిచ్చేశ్వర్రావును ఓదార్చాడు నిఖిలేష్.

చిన్నగా నవ్వు ప్రారంభించి... పెద్దగా పగలబడి నవ్వాడు పిచ్చేశ్వర్రావు.

'నీలాంటివాళ్ళది ఈపాటి సపోర్టు ఉండాలిగానీ అవన్నీ అమలు పరచకుండా ఉంటానా నిఖిలేష్' పిచ్చేశ్వర్రావు నవ్వును ఆపుకొంటూ చెప్పాడు.

'ఏం సపోర్టయ్యా...?' చెప్పు ఇస్తానన్నట్లుగా నిఖిలేష్ అన్నాడు.

'ఏంలేదు గురూ... నేను ఈ జర్నలిస్టుల సంఘానికి వ్యతిరేకంగా, పోటీ సంఘం పెట్టాలనుకొంటున్నాను. దానికి నీ మద్దతు కావాలి...'' పిచ్చేశ్వర్రావు అర్థించాడు.

'భలే వాడివే... మొన్న జరిగిన యూనియన్ ఎలక్షన్లలో నీకు డిపాజిట్ కూడా రాలేదు. మూడంటే మూడే ఓట్లు వచ్చాయి. ఇక నువ్వు పోటీ సంఘం పెడితే సభ్యులు ఎక్కడ దొరుకుతారు' నవ్వాడు నిఖిలేష్.

'ఫిలిప్పీన్స్‌లో మార్కోస్‌లాగ వీళ్ళునన్ను అన్యాయం చేశారు నిఖిలేష్... అక్కడి ప్రజల్లో తిరుగుబాటు వచ్చి అక్వినో అధికారంలోకి వచ్చింది. నా గురించి అలా తిరుగుబాటు చేసే జనంలేక భారీ ఎత్తున జరిగిన రిగ్గింగ్‌లో ఓడిపోయాను. మన దేశమే తిరుగుబాటుకు సిద్ధం కాలేదు ఏం చేస్తాం...' పిచ్చేశ్వర్రావు తెలివిగా సమర్థించుకోవడానికి ప్రయత్నించాడు.

'ఇలాంటి చేతకాని కబుర్లు చెప్పకు... ఎవరు రిగ్గింగ్ చేశారు. మనకు తెలియని ముఖాలు ఉన్నాయా... నా దగ్గర చెబితే చెప్పావు ఎవడిదగ్గరా వాగకు. నీ తెలివికి సన్మానం చేస్తారు' నిఖిలేష్ వ్యంగ్యంగా హెచ్చరించాడు.

'అలాగే చూస్తూండు నిఖిలేష్... ప్రోగ్రెసివ్ జర్నలిస్టుల సంఘం పెడతా'.... పిచ్చేశ్వర్రావు ప్రకటించాడు.

'నీకు సంఘాల గొడవెందుకయ్యా.. చేసే ఉద్యోగం సరిగా చెయ్యరాదూ.. మంచివార్తలు అలా ఉంచి మామూలు వార్తలు రాయడం కూడా మానేశావు. ఏడాదికి ఒక్కమంచి వార్తయినా రాశావా...?. వృత్తిపరమైన విషయాల్లో పోటీలు లేవు... ఈ సంఘాల గొడవెందుకు?'' నిఖిలేష్ పిచ్చేశ్వర్రావుని వాయించాడు.

'వార్తలు రాసి ఎవడు బాగుపడ్డాడయ్యా.. గొప్ప వార్తలు రాసిన అరుణ్‌శౌరీ ఇపుడెక్కడున్నాడు? అది ఎప్పుడో వదిలేశాను.' తేల్చి చెప్పాడు పిచ్చేశ్వర్రావు.

'పోటీ సంఘం పెట్టడం వల్ల నీకు ఉపయోగం..?'' నిఖిలేష్ సూటిగా అడిగాడు. 'ఇపుడున్న యూనియన్ నిరంకుశత్వాన్ని అరికడతాను' ఆవేశంగా పిచ్చేశ్వర్రావు అన్నాడు.

'ఎలా...?...?''

'ఇప్పుడున్న జర్నలిస్టుల సంఘంలో కొందరే పైరవీలు చేసి బాగుపడుతున్నారు. ఎంతోమందిని పైకి రానివ్వటంలేదు. మా సంఘంలో అందరికీ అవకాశం కలిగిస్తాను. నీలాంటి వాళ్ళ సహకారంతో కొత్త సంబంధాలు పెంచుతాం. విజృంభించి వాళ్ళను మించి పనులు చేయించి పెడతాను... ఈ యూనియన్ మోనోపలీని దెబ్బతీస్తాను'' పిచ్చేశ్వర్రావు అసలు ఉద్దేశాన్ని బయటపెట్టాడు.





'ఛీ...నీకు పనులు జరగడం లేదని పోటీ సంఘం పెడతావా...నీలాంటి వాళ్ళకి నామద్దతు కాదు కదా సానుభూతి కూడా ఉండదు.ఇప్పటికే చాలా టైమ్ తినేశావ్...వృధాగా నీతో వాదనకు దిగాను..ఛ..ఛ..' అంటూ పిచ్చేశ్వర్రావు ఆగమని బ్రతిమాలుతున్నా నిఖిలేష్ వినిపించుకోకుండా ప్రెస్‌క్లబ్ వదిలి ముందుకు బండి నురికించాడు.

బషీర్‌బాగ్ సెంటర్‌కి వచ్చేసరికి మోటార్‌సైకిల్ పక్కకు లాగేస్తోంది. వెనకటైరు పంక్చర్. దగ్గర్లో ఉన్న ఓ మెకానిక్‌కి మోటార్‌బైక్ ఇచ్చి గంటలో వస్తానని చెప్పి ఆటోకోసం నడకసాగించాడు.

ఎదురుగా కారు..అదేకారు..వెనక అద్దంలోపల రెండు పొట్లగిత్తలు...తెల్లగా పోటీకి రడీగా ఉన్నాయి. ఒకదాన్ని ఒకటి చీల్చడానికి సిద్ధంగా కనిపిస్తున్నాయి.. అద్దం లైనింగ్‌కి చిన్న చిన్న బల్బులు. అదేకారు.. లైట్ బ్లూకలర్..అంబా సిడర్...నెంబర్...ఆకారు నెంబర్ ఎ.పి.ఎస్-ఆరు సున్నా తొమ్మిది సున్నా.

కరెక్ట్! అదేకారు. సందేహం లేదు.. ఖచ్చితంగా ఇదే.. ఇదే ఆకారు.

నిఖిలేష్ గుండె దడదడ కొట్టుకొంటోంది. ఉద్రేకం పెరిగి ఆవేశంగా మారుతోంది. అడుగు ముందుకి పడటంలేదు. బలవంతంగా ధైర్యాన్ని తెచ్చుకొని ముందుకు సాగాడు.

కారుని పరీక్షిస్తూ అక్కడే నిలబడ్డాడు. భుజంమీద భారంగా చెయ్యిపడింది. గిర్రున వెనక్కు తిరిగాడు.

'అజయ్..' కంగారుగా ఉంది నిఖిలేష్ కంఠం.

'అదేమిటి గురూ..అంత కంగారు పడ్డావ్..' అజయ్ మామూలుగా అనునయించాడు.

అజయ్ పక్కనున్న వ్యక్తి. పొడుగ్గా ఉన్నాడు. క్రాఫ్ స్టయిల్‌గా ఉంది. మెడలోగోల్డుచైన్.. చేతికి రింగ్స్..ఎడమచేతికి బంగారు కడియం..ఖరీదైన వ్యక్తి...అవును..ఆవ్యక్తే డేవిడ్ వర్ణించినవ్యక్తి. సికింద్రాబాద్ స్టేషన్లో కార్ల స్టాండువాడు గుర్తుపట్టిన మనిషి వీడే..వీ..డే... నిఖిలేష్‌లో ఆవేశం ఉరకలు వేస్తూ కట్టలు తెంచుకొంటోంది.

'ఈయనే మోహన్‌రావ్... హోంమినిస్టర్ మేన ల్లుడు. నేను చెప్పానుకదా... నిన్ను కలవాలన్నాడ నీ...నీవార్తని పొగిడాడనీ...'

అజయ్ ఆపడంలేదు. ఆవ్యక్తినే చూస్తున్నాడు నిఖిలేష్.

ఆవ్యక్తి చెయ్యి అందించాడు... 'గ్లాడ్‌టుమీట్ యూ...' అన్నాడు.

అప్రయత్నంగా నిఖిలేష్ అదే జవాబిచ్చాడు. చేతులు కలిశాయి. నిఖిలేష్ చేతిలోంచి విద్యుత్‌ఘాతంలాంటి భావం శరీరమంతా ప్రవహించింది. ఆవ్యక్తి కారుడోర్ లాక్ తీస్తున్నాడు.

'ఈ కారు మీదేనా..?' నిఖిలేష్ అంత సీరియస్‌గా ఎందుకడిగాడో అజయ్‌కి అర్థంకాలేదు.

'కాదు... మా బాబాయిది...' ఆ వ్యక్తి ముక్తసరిగా చెప్పి నిఖిలేష్‌ని అనుమానంగా చూశాడు.

'అలా అడుగుతున్నావేంటి గురూ- ఈ కారు మోహన్రావుదే... అజయ్, నిఖిలేష్ భుజంమీద మళ్ళీ చెయ్యివేశాడు.

'ఈ కారుని ఎక్కడో చూసినట్లు గుర్తు...' అని మోహన్రావుకేసి సూటిగా చూశాడు నిఖిలేష్.

'ఎపుడూ ఈయనే వాడుతుంటాడు. ఏ రోడ్డుమీదో చూసిఉంటావ్.. దీనిగురించి ఎందుకు పోనీరాదూ..' అజయ్ సర్దుతూ చెప్పాడు.

'కాదు...' మోహన్రావుని మింగేస్తాడా అన్నట్లుగా ఉంది నిఖిలేష్ కంఠం. మోహన్రావు ముందు కంగారుపడినా ఆపైన తేరుకొని మందహాసంచేస్తూ 'వస్తానని' చెయ్యి ఊపి రివ్వున దూసుకుపోయాడు.

అదేకారు... అదే మనిషి...

'పద నా ఆటో అక్కడుంది..' నిఖిల్ చెయ్యి పట్టుకొని అజయ్ తన స్వంతఆటోకేసి నడిపించడానికి ప్రయత్నించాడు. నిఖిలేష్ ఆ కారు కనుమరుగయ్యేవరకు తీక్షణంగా చూస్తూనే ఉన్నాడు. నిలబడిన ఆ ప్రదేశం నుంచి కాలు ఒక్క అడుగుకూడా కదపలేదు.

'అంత సీరియస్‌గా ఉన్నావేం నిఖిల్' - అజయ్ నవ్వడానికి తంటాలుపడుతూ అన్నాడు.

'ఈ మోహనరావుని ఎక్కడో చూశాను అజయ్. ఇంతకుముందు నాకు.. ఎక్కడ... ఎక్కడో కనిపించాడు.' ఆలోచనలన్నీ నిఖిలేష్‌ని ముంచేశాయి.

'వాడో బేవార్సు.. ఎక్కడయినా చూసిఉంటావ్‌లే. వాడ్ని పెద్దగా పట్టించుకోకు. వాడి గురించి అంత టైమ్ వేస్టుచెయ్యకూడదు... రావయ్యా పోదాం' అంటూ నిఖిలేష్‌ని కుదుపుతున్నాడు అజయ్.

'కాదు.. అజయ్.. వీడ్ని ఇపుడు నీతోకాకుండా

మనవాళ్ళెవరితోనో ఎక్కడో చూశాను... ఖచ్చితంగా వీడే...' నిఖిలేష్ ముఖం ఎర్రబడింది.

నిఖిలేష్ పాత జ్ఞాపకాలన్నీ తిరగవేస్తున్నాడు. ఎక్కడా అందడంలేదు.

'నిఖిలేష్... దీనికెందుకయ్యా... అంతలా ఆలో చిస్తావ్... ఎక్కడో చూసుంటావ్... ఏభారతికూడానో కనిపించిఉంటాడు.'

అలవోకగా అన్న అజయ్ మాట నిఖిలేష్ మెద డులో పాదరసంలా పనిచేసింది.

గుండె మండుతోంది. కళ్లముందే సుందర స్వ ప్నాలు భయంకర నరకాలుగా కనిపిస్తూ భయపె డుతున్నాయి.

రాక్‌కేజిల్స్ హొటల్‌లో ఆ రాత్రి భారతి కూడావ చ్చిన వ్యక్తి మోహన్‌రావా? భారతి కజిన్...?

నిఖిలేష్ సిగరెట్ అంటించాడు. అది భస్మమవు తూ గుండెలకు ఇచ్చే సెగ నిఖిలేష్ ఆవేశపు అంచుల్లోంచి వెళుతోంది.

అజయ్ ఆటో పెట్రోల్‌ని మండిస్తూ రోడ్డుమీద పొగలురేపుతూ ముందుకు నడుస్తోంది.

★ ★ ★

భారతి ఎందుకంత నాటకం ఆడింది.

తాను ఏనాడూ ఆమెను ప్రేమిస్తున్నట్లు చెప్పనేలేదు.

ఆమే తనని ప్రేమ వలలోకి లాగింది.

తననే భారతి సర్వస్వంగా భావించిందని నిఖిలేష్ అప్పటిదాకా అనుకుంటున్నాడు.

భారతి.. మినిస్టర్ మేనల్లుడు మోహన్‌రా వుతో..

ఛీ..ఛీ... ఎంత నీచమైన, హేయమైన గుణం.

నిఖిలేష్ మెదడులో యుద్ధం మొదలైంది. భారతి తనకు అన్యాయం ఎందుకు చేసింది? మినిస్టర్ మేనల్లుడు సౌమ్య కేసులో ఉన్నాడని భారతికి తెలుసా?

తెలిసేఉంటుంది. లేకపోతే ఆనాడు తనని ఎందుకు హెచ్చరిస్తుంది? గూండాలు ఏదైనా చేస్తారని ఎందుకు బెదరగొట్టింది?

మోహన్రావుతో సంబంధంవల్ల భారతికి ఏం ఉపయోగం?

భారతి చెప్పిన కొత్త పత్రిక మోహన్‌రావుది కాదుకదా?!.

ఈరకంగా చూస్తే, భారతితో తను చెప్పిన సౌమ్య కేసువివరాలన్నీ మోహన్‌రావుకి తెలిసే ఉంటాయా?.

ఖచ్చితంగా తెలుస్తాయి.

భారతి ఎంత ద్రోహంచేసింది?

ఎంత దగాచేసింది? నమ్మించి ప్రేమ నటించి స్నేహానికే సమాధికట్టింది. అపకారికి కూడా ఉపకారం చెయ్యాలనే సూత్రాన్ని పక్క నుంచినా, ఓ జర్నలిస్ట్‌గా చూసినా ఇలాంటి నికృష్టపువనికి పూనుకొంటుందా?

ఛీ..ఛీ.. ఆమెను జర్నలిస్ట్ అనడం పొరపా టు. హొయలు వలికిస్తూ జర్నలిజం ముసు గులో దాగిన విషవృక్షం భారతి.

అజయ్, మౌలానాలాంటివాళ్ల వల్ల జర్న లిజం పరువేపోతుంది. సమాజంలో జర్న లిస్టల విలువకే ప్రమాదం వాటిల్లుతుంది.

కాని దీపక్, భారతిలాంటివాళ్ళు జర్నలిజా న్ని సమూలంగా నాశనంచెయ్యడానికి ప్రయ త్నిస్తున్నారు.

ఈ విషపుమొక్కల్ని పీకెయ్యడానికి ఏంచె య్యాలి?

నిఖిలేష్ ఉద్రేకంగా భారతి ఇంటివేపు సాగాడు.

'భారతీ—' ఆవేశంగా అరిచాడు నిఖిలేష్

నిఖిలేష్ నిప్పులు చెరుగుతున్నాడు. అతని కళ్ళల్లో ఎర్రని జ్వాలలు ప్రజ్వరిల్లుతున్నాయ్. మని షంతా కోపంగా ఊగిపోతున్నాడు.

"ఏం...నిఖిల్...రా...కూర్చో'- ఆ కోపాన్ని చల్లార్చ డానికి చిరునవ్వులు చిందిస్తూ నిఖిలేష్‌ని భారతి ఆహ్వానించింది.

'నే...నేను నీతో కబుర్లు చెప్పడానికి రాలేదు..." ఇంకా అరుస్తున్నట్లుగా ఉంది నిఖిలేష్ గొంతు.

'ఎందుకింత ఆవేశం...ఏమిటా కోపం... రా...నిఖి ల్...ఇలావచ్చి కూర్చో...' భారతి ప్రేమగా పిలుస్తూ నిఖిలేష్ భుజంమీద చెయ్యి వేయడానికి ప్రయ త్నించింది. ఆ చెయ్యికి దొరక్కుండా తప్పుకున్నా డు నిఖిలేష్.

'నామీద ఎందుకింత కోపం' గోముగా...ముద్దుగా





మాట్లాడింది భారతి.

'కోపమా-అదే నా ఆస్తి. అంతకుమించి మరేంలేదు. కానీ నీ నరనరాల్లో ద్రోహబుద్ధే. దానికంటె నాకోపం చెడ్డది కాదు. ద్రోహంతో నువ్వు నిలువెల్లా విషంగా తయారయ్యావ్' గర్జించాడు నిఖిలేష్.

'ద్రోహమా...' భారతి ముఖంలో రంగులు మారాయి. మామూలుగా ఉండటానికి తంటాలు పడుతోంది.

'నీతో గంటల తరబడి మాట్లాడడానికీ...లేకపోతే నువ్వుచేసిన ద్రోహాన్ని వివరించడానికి నేను రాలేదు. ఒకేఒక్కమాట అడుగుతా... నాకు సరైన సమాధానం చెప్పు'' ఎర్రబడిన నిఖిలేష్ నేత్రాలు ఉరిమినట్లనిపించాయి.

'ఏమిటది...?' భారతి ధైర్యంగా అడిగింది.

'నీ..కజిన్...ఆరోజు రాక్‌కేజిల్స్ హెూటల్లో...దూరంగా నిలబెట్టి వచ్చావ్ గుర్తుందా... ఆ కజిన్ ఎవరు?' నిఖిలేష్ ప్రశ్న భారతి గుండెల్లో శూలంలా దిగింది.

''ఆ...అతనా...' తడబాటుగా నిఖిలేష్‌కేసి చూసింది. వెంటనే చూపుమార్చింది.

'అతనూ...' భారతి నోటమాట రావటంలేదు...కంగారు...భయం ఆందోళన.

'నాకు తెల్సు...హెూం మినిస్టర్ మేనల్లుడు మోహనరావ్...అవునా?'' గర్జించాడు నిఖిలేష్.

'కా...కాదు...మా కజి...కజిన్' భారతి ఖంగుతింది. కంగారు...తడబాటు.

'అబద్ధం. నన్ను మభ్య పెట్టాలని చూడకు. నీ నాటకాలు నాదగ్గరకాదు. ఛీ...స్నేహం నటించావ్. నా హెల్ప్ తీసుకున్నావ్. ప్రేమగా మాట్లాడావ్... ప్రేమ కూడా నటించిన ఛీ... యుఆర్ ఎ ఛీట్. అందుకే ఇంత ద్రోహానికి తలపడ్డావ్...' నిఖిలేష్ విసుగూ...ఏవగింపూ... అసహ్యం ప్రదర్శించాడు.

'నేను...నీతో ప్రేమ నటించానా' పటప్...ఇష్టం వచ్చినట్లు మాట్లాడితే నోరుమూసుకొంటానను కొంటున్నావా? ఇంత ఇడియట్‌లా మాట్లాడతావనుకోలేదు...''

భారతి మాటలకు నిఖిలేష్ ఎగిరిపడ్డాడు.

'ఎవరి గురించో... ఏం మాట్లాడుతున్నావో... నీకేనా అర్థం అవుతోందా... ఎందుకింతలా అరుస్తున్నావ్...'? భారతి ఎదురు తిరిగింది.

'ఏదో...ఫ్రెండ్ కదాని మర్యాదగా లోపలికి పిలిచాను... సరదాగా మాట్లాడాను. దానికి విపరీతార్థాలు తీసుకొని నన్నే నిలదీస్తున్నావ్...నేను ఎవరితో తిరిగితేనీకేం...?. అవును, అతను... మా కజిన్... కజిన్‌కాదు...అయితే నీకేం...? యస్! అతను మినిస్టర్ మేనల్లుడు మోహన్‌రావ్... నాకు కావలసినవాడు. అతనితో స్నేహంగా తిరిగితే తప్పేమిటి...??'

భారతి ప్రశ్నలు నిఖిలేష్ గుండెను చీల్చాయి. 'ఛీ...ఛీ... ఆడజాతిలో నీలాంటి వాళ్ళను చూడలేదు...' ఛీదరించుకున్నాడు.

'ఇవుడు చూస్తున్నావుగా...' కళ్ళతోనే హేళనగా చూసింది. 'ఒక మర్డరర్‌వాడు...రేపిస్ట్...అలాంటి గూండా... దౌర్భాగ్యుడితో సంబంధాలు పెట్టుకొని... స్నేహానికే కొత్త అర్థం చెప్పావ్. ప్రేమ చరిత్రలను తిరగరాశావ్... ఛ...ఛ...' అంటూ భారతి ముఖంమీద ఉమ్మెయ్యడానికి సంస్కారం అడ్డొచ్చి వెనక్కు చూడకుండా ముందుకు సాగిపోయాడు నిఖిలేష్.

★ ★ ★

రిడ్జ్ హెూటల్ నుంచి మోహనరావు కారు ఆదర్శ నగర్‌వేపు తిరిగింది. ఆకారుని నడుపుతూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు మోహన్‌రావు.

''ఇదంత ఆలోచించాల్సిన విషయంకాదు మోహన్'' మోహనరావుపక్కన కూర్చొన్న రాబర్ట్ అన్నాడు.కారు వెనుక భాగంలో ఇంకోఇద్దరు కూర్చొన్నారు. ఆ కారుమెల్లగా ఆదర్శనగర్ డౌన్‌రోడ్డులోకి దిగుతోంది.

'వాడు నిన్ను గుర్తుపట్టాడంటావా?' వెనుక కూర్చొన్నఓ వ్యక్తి అడిగాడు. ఆ నలుగురూచాలా కాలంగా స్నేహితులు! మినిస్టర్ మేనల్లుడి సహకారంఉంటే మిగిలిన ముగ్గురూ ఏపనినైనా సాధించగల సమర్థులు.కారు ఆదర్శనగర్ చివర్లో ఉన్న ఓభవనంలోకి ప్రవేశించింది.కారు పార్కు చేసి ఆముగ్గురితో సహా ఆ భవనప్రాంగణంలోని లాన్ లో కూర్చొన్నాడు మోహన్‌రావు.

''వాడు నన్ను గుర్తుపట్టాడు'' మోహన్‌రావ్‌ఆలోచనలను పక్కకు నెడుతూగట్టిగా చెప్పాడు.

'ఆఫ్టరాల్... ఓ రిపోర్టర్‌గుర్తు పడితే ఏ మవుతుందిమోహన్... వాడేం చేస్తాడు...?'రాబర్ట్ అడిగాడు.

'వాడు నన్ను గుర్తు పట్టడమేకాదు. ఆ పిల్ల కేసునితిరగదోడుతున్నాడు.ఎంక్వయిరీలు చేస్తున్నాడు. ఆసామ్మి మనవల్లే చచ్చిందని వాడుప్రచారం చేస్తే ఏమవుతుందోతెలుసా...?' మోహన్‌రావుచిరాగ్గా మాట్లాడాడు.

"ఏమీ కాదు. అంతగా ఎవడైనాగట్టిగా మాట్లాడితే నేనుచూసుకొంటా" మరొకమిత్రుడు హామీ ఇచ్చాడు.

'ఏం చూసుకొంటావ్. అసలేఅది మనతో ఎంజాయ్ చెయ్యలేకచచ్చింది. ఆ కేసుని ఎక్కడా పొక్కనివ్వకుండాచేసుకొందామంటే వాడేపెద్దగా రాసేశాడు. ఇపుడు నన్ను గుర్తు పట్టేశాడు'. మోహన్‌కోపంగా చెబుతున్నాడు.

"ఏ మవుతుందంటావ్..." రాబర్ట్ అడిగాడు.

'అది తెలిస్తే ఇంత ఆలోచనఎందుకు...?' మోహన్‌రావ్‌అంటూండగానే భారతి స్కూటర్ మీదఆ భవనంలోకి వచ్చింది.

'ఒరే... ఇప్పుడే వస్తాను"— అంటూ మోహన్‌రావు లేచి గబగబానడుస్తున్నాడు. స్కూటర్ స్టాండ్ వేసి కంగారుగా వస్తోంది భారతి

మోహన్‌రావుని చూసి తన కంగారుని తమాయించుకొంటూ భారతి ఆగింది. 'ఏమిటి భారతి ఈ టైమ్‌లో ఇలా వచ్చావ్?' మోహన్‌రావు అడిగాడు.

'కొంప మునిగింది మోహన్. ఆ నిఖిలేష్ నన్ను నానా మాటలూ అని కోపంగా వెళ్ళిపోయాడు. రేపట్నుంచి వాడు నాగురించి ప్రచారం చేస్తాడు'... భారతి తడబడుతూ చెప్పింది.

'అసలు వాడేం అన్నాడు?

"నన్ను ఛీట్ అన్నాడు."

'ఎందుకూ—?'

నీతో తిరుగుతున్నందుకు. నువ్వు ఓ రేపిస్ట్‌వనీ, మర్డరర్‌వనీ అంటూ ఏ వేవో వాగాడు"

'నువ్వే మన్నావ్?'

"షటప్... గెటౌట్ అన్నా"

'నా గురించి ఇంకా ఏ మన్నాడు...?"

"అవన్నీ నాకు గుర్తు లేవు. కానీ వాడు నీ గురించి అంతా తెలుసు కున్నాడు."

'నువ్వేలా చెప్పగలవ్...?"

"వాడి కోపం... ఆవేశం... చూస్తే చాలా భయమేసింది. నిన్నో పరమదుర్మార్గుడంటూ వాడు ఉద్రేకంతో ఏవేవో అన్నాడు"

'సరే వాడి సంగతి మేం చూసుకొంటాం. అనవసరంగా కంగారు పడకు. వాడు నన్నే కాదు. నిన్నూ ఏం చెయ్యలేడు' మోహన్‌రావు భారతికి ధైర్యం చెప్పి పంపించివేశాడు.

'ఇక లాభం లేదు రాబర్ట్. వాడు ఏదో ఒకటి చెయ్యడానికి ప్రయత్నిస్తాడు.' మోహన్‌రావు సీరియస్‌గా అన్నాడు.

"వాడేం చేస్తాడు. వాడి సంగతి మేం చూసుకొంటాం. వాడ్ని ఇపుడు వదిలిపెడితే రేపు మనల్నందర్నీ బయటకు లాగుతాడు. వాడికా అవకాశమే లేకుండా చేద్దాం." రాబర్ట్ మోహన్‌రావు 'ఏం చెబుతాడా' అన్నట్టు ఆగాడు.

'మీరు ప్రొసీడ్ అవ్వండి'—మోహన్ వాళ్ళకి ఉద్రేకం కలిగించాడు.

★ ★ ★

జగన్నాథ రథచక్రాలు వెనక్కు మళ్ళుతున్నాయ్.

నిఖిలేష్ ఆ రోజు పనంతా ముగించుకొనే ప్రయత్నంలో ఉన్నాడు.

చీకటి రాజ్యమేలుతోంది.

సమాజానికి వెలుగు పంచడానికి నిఖిలేష్ తన వంతు కృషి చేస్తున్నాడు.

పుడమిమీద రాక్షస నీడలు వ్యాపిస్తున్నాయ్.

వాటిని వెంటాడి పట్టుకోవడానికి నిఖిలేష్ యువ రక్తం ఉరకలు వేస్తోంది.

అధికార మదంతో మత్తెక్కిన దుష్ట శక్తులు చీకటి జెండా ఎత్తాయి. ఎంతటి వెలుగైనా హరించెయ్యగల చీకటి ధ్వజమెత్తింది. సమయం ఆ చీకటితో చిక్కగా కల్సి పదకొండున్నర దాటింది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. దుర్మార్గం కోరలెత్తి కరాళ నృత్యం చేసినా వినపడని రాత్రి అది. నిఖిలేష్ మోటార్ సైకిల్ శ్రీనగర్ కాలనీవైపు వెళుతోంది. సరిగ్గా శ్రీనగర్ కాలనీ గ్రౌండ్ దగ్గర ఓ కారు మోటార్ సైకిల్‌కి అడ్డంగా వచ్చింది. సడన్ బ్రేక్ వేసి మోటార్ సైకిల్‌ని ఆపేశాడు... ఆ కారు లోంచి గబగబానలుగురు దిగి నిఖిలేష్‌ని చుట్టుముట్టారు.

"నువ్వేనా నిజం రిపోర్టర్ నిఖిలేష్" ఒకడు

 

గట్టిగా అడిగాడు.

'ఏం... ఎందుకూ... మీరెవరూ...?' నిఖిలేష్ వాళ్ల ని చూస్తూ కొంచెం కంగారుగానే అడిగాడు.

"మా గురించి నీకెందుకురా' బాడ్‌కావ్'... నువ్వో రిపోర్టర్... నీదో 'నిజం', మోహన్‌రావునే ఇష్టం వచ్చినట్లు తిడతావురా మా..." మరొకడు తిట్టాడు.

"ఈ బచ్చా గాడితో మాటలేంటిరా..." అంటూ చేతిలోని చైన్‌తో నిఖిలేష్‌ని క్రూరంగా కొట్టాడు ఇంకొకడు.

"మోహన్‌రావు తలచుకొంటె నీ నిజం పత్రికనే ఎత్తించెయ్యగలడురా లుచ్చా..."

ఆ బెల్టు దెబ్బ మాట దెబ్బకన్నా ఘోరంగా ఉంది.

అమ్మా అని అరిచాడు నిఖిలేష్.

ఆ ఆర్తనాదం ఎవరికి వినిపిస్తుంది.

"అమ్మరా... నీ యమ్మా... అదెక్కడుందిరా... బాడ్‌కావ్... నీ అమ్మని..."

నీచమైన తిట్టు రక్తాన్ని చిందించే చైను దెబ్బ.

తా నొక్కడు వాళ్ళు నలుగురు.

వాళ్ళ చేతుల్లోని బెల్టులూ... చైనులూ నిఖిలేష్ శరీరాన్ని చిత్రవధ చేస్తున్నాయి.

వాళ్ల నీచాతి నీచమైన తిట్లు గుండెను పిండేస్తున్నాయి.

ఏమీ చెయ్యలేని అసహాయ స్థితిలో నిఖిలేష్ ఆ నిశ్శబ్ద నిశీధి సమయంలో పరిగెడుతున్నాడు.

ఎక్కడో దూరాన కనిపించే మినుకు మినుకు మంటున్న వెలుగు జ్యోతుల దగ్గరకు వెళ్ళడానికి సకల శక్తులూ సమీకరించుకొంటున్నాడు.

వారి దాడి తీవ్ర రూపం దాల్చింది.

నిఖిలేష్ శరీరం మీద పదునైన కత్తి దిగింది. ఆ చీకటిలో ఎన్ని కత్తి పోట్లో...

మినుకు మినుకు మంటూ అంత వరకూ కనిపించిన వెలుగు జ్యోతులు మాయమయ్యాయి. అంధకారం మిగిలింది.

నిఖిలేష్ అరుస్తూ కింది పడిపోయాడు.

ఆ శరీరం మీద రక్తపుటేరులు ప్రవహిస్తున్నాయి.

ఎంత రక్తం భూమాతకు సాక్ష్యంగా దొరికిందో...

మరెంత రక్తం ఎర్రని వేడి చుక్కలుగా చీకటి దాహానికి ఆహుతయ్యిందో...

ఆ చీకటి తప్పులకు సాక్ష్యం ఎక్కడ...?

ఆ దుష్ట శక్తులు ఆ చీకటిలోనే మాయమయ్యాయి.

నడిరోడ్డుమీద ఆఖరి క్షణాల కోసం పరితపించే స్థితిలోని నిఖిలేష్‌ని తెల్లవారుజామున ఆ రోడ్డున పోయే పాల వ్యాన్ వాళ్ళు ఆసుపత్రికి తరలించారు.

చీకటి ధ్వజం ప్రతాపానికి డాక్టర్ల కృషీ పని చెయ్యడం లేదు.

తిండికోసం అమ్ముకొన్న రక్తం ఆ ప్రాణాన్ని నిలబెడుతుందా??

డాక్టర్లు విశ్వప్రయత్నం చేస్తున్నారు.

ఎక్కడ ప్రారంభమయిందో ఆ జీవిత యాత్ర. ఆశయాల బందీకదో శిక్ష?

రాజీ మంత్రం తెలియని జీవికి దుష్ట సమాజం ఇచ్చే తీర్పు అదేనా?

ఏమీ పట్టించుకోలేని అపస్మారక స్థితిలో నిఖిలేష్ ఊహకందని లోకాలకు పయనమవుతున్నాడా...???




'నిఖిలేష్..జిందాబాద్..'

ప్రెస్‌క్లబ్ మారుమ్రోగుతోంది. 'నిఖిలేష్ జిందాబాద్...'

'జర్నలిస్టులపై దాడులు...ప్రజాస్వామ్యంపై దాడులే'...

'నిఖిలేష్...జిందా బాద్'.

'నిఖిలేష్‌పై దాడి'...ఖండించాలి'.

'ప్రభుత్వ వైఫల్యాన్ని... ఖండించండి'.

"గవర్నమెంట్...డౌన్‌డౌన్". "ప్రజాస్వామ్యాన్ని హతమార్చే గూండాలు...నశించాలి".

'ప్రజాస్వామ్యం... వర్ధిల్లాలి'.

'నిఖిలేష్...వర్ధి ల్లాలి'...

'జర్నలిస్టుల 'ఐక్యత...వర్ధిల్లాలి'.

'నిఖిలేష్‌పై దాడిచేసిన గూండాలను...అరెస్టు చెయ్యాలి'...

నినాదాలతో జర్నలిస్టుల ఊరేగింపు ప్రెస్‌క్లబ్ నుంచి బయలుదేరింది.

ఆ ఊరేగింపులో పాతిక మంది ఉన్నారేమో...

అయినా నినాదాల జోరు దారినపోయే ప్రజలకి వినిపిస్తోంది.

దాన్నో వింతగా చూసిన ప్రజలు వెనక్కుపోతున్నారు.

ముందుకు పోదలచినవాళ్ళు ఆ పాతిక మంది హడావిడినీ దాటుకొనిపోతున్నారు.

నగరంలో అలాంటివి మామూలైన పోలీసులు తమ డ్యూటీగా కదులుతున్నారు.

ముగిసిన ఆ ఊరేగింపు సభ చేసింది.

నిఖిలేష్‌మీద హత్యా ప్రయత్నం చేసిన గూండాలను అరెస్టు చెయ్యాలనీ...

ఈ దారుణం చేసిన ముఠాను పట్టుకోవడంలో విఫలమైన పోలీసులను సస్పెండు చెయ్యాలనీ,...

పోలీసు అధికారులను బదిలీ చెయ్యాలనీ...

నిఖిలేష్‌కి నష్టపరిహారం చెల్లించాలనీ,...

జర్నలిస్టులకు శాశ్వత సంక్షేమ నిధి ఏర్పరచాలనీ...



ఇలా ఎన్నో అంటూ జర్నలిస్టులు ప్రసంగాలు చేస్తున్నారు.

వార్తలు సేకరించే పత్రికా ప్రతినిధులపై జరిగే దాడులన్నీ ఏకరువు పెట్టారు.

ఆ సభ నిఖిలేష్‌పై దాడిని ఖండిస్తూ ఒక తీర్మానం చేసింది.

ఈ దాడిని తీవ్రంగా పరిగణించాలనీ, వెంటనే సి.ఐ.డి.లను పెట్టి విచారణ చేయించాలని, దోషుల ను కఠినంగా శిక్షించాలని జర్నలిస్టుల సంఘం ప్రభుత్వాన్ని కోరింది.

ప్రభుత్వం నిఖిలేష్ మీద దాడిచేసిన దోషులను అరెస్టు చేసే వరకూ మంత్రుల ప్రెస్‌కాన్ఫరెన్సు లూ...ఇతర సమావేశాలనూ బహిష్కరించాలనీ, నల్ల బ్యాడ్జీలు ధరించి అసెంబ్లీ సమావేశాలను కూడా రెండురోజులపాటు బహిష్కరించి అసెంబ్లీ ముందు ధర్నా జరపాలని జర్నలిస్టుల సంఘం మరో తీర్మానం ఆమోదించింది.

నిఖిలేష్ దాడిపై చర్చలు...సందేహాలు...అను మానాలు...ఖండనలు...ఛీత్కారాలు...ఎన్నో...ఎన్నె న్నో ప్రెస్‌క్లబ్ రెండో అంతస్థులో నిండిపోతున్నాయి. అక్కడి బార్‌లోని మందు సీసాలు ఖాళీ అయిపో తున్నాయి. ఆనాడు ఆ జనంలో పొంగిన ఆవేశాన్ని ఆ సీసాల మత్తు ఆపలేకపోతోంది. కొంత మంది ప్రముఖులు ఈ మత్తుకి దూరంగా నిఖిలేష్ గు రించి చర్చిస్తున్నారు.

'ఆ నిఖిలేష్‌కి ఇంత పబ్లిసిటీ ఎందుకయ్యా?'

'భలే చెప్పారు. వాడో కుర్రకుంక. ఎవడ్నో బెది రించి ఉంటాడు'. 'అంతేనయ్యా'...సగం తాగిన మరోమత్తు గొంతు పలికింది. 'మన వాళ్ళకి బొత్తిగా ఆలోచన లేదు. 'నిజం' వాడ్ని పట్టుకొని వాడివెనక వేళ్ళాడతారు. వాడేమయినా చచ్చాడా'.

'వాడు ఛావడు...చస్తున్నట్లు నటిస్తాడు. ఇదో రకం నాటకం. పబ్లిసిటీ కోసం...'

'వాడే ఏర్పాటు చేసుకొని ఉంటాడు ఇదంతా..లే కపోతే వాడ్నెవడయ్యా కొట్టేది?'

''అలా కాదులెండి పిచ్చిగా అరుస్తోంటే..పిచ్చి కుక్కనయినా కొట్టక ఊరుకొంటారా'..?

'అంతేనంటావా..?'

'అయినా ఆ నిజం మేనేజిమెంటు ఒకటి. ఎప్పుడూ ప్రభుత్వానికి వ్యతిరేకమే'.

'పత్రికలు ప్రజాస్వామ్యంలో ప్రతిపక్షంలా వ్యవ రించాలి కదండీ'.

'ఓ..చెప్పావు లేవయ్యా..ప్రతిపక్షం అంటే రోజూ తిట్టడమేనా?'

'అదేం ఉందిలెండి...పేపర్ పాలసీ'

'పేపర్ పాలసీ అంటే ఓ అర్థం ఉండాలి కదా'

'మీరెన్ని చెప్పండి 'నిజం' పత్రికకున్న పేరు ఎవరికుంది'

'ఆ మా పత్రికకీ ఉండేది పేరు..ఆ కాలం పోయింది. అందుకే పడిపోయింది. జనం పిచ్చివా ళ్ళయ్యా...కల్తీవార్తలు నమ్ముతారు. వాళ్ళకి కావల సింది తిట్టడమే. మేము ఒక్క మంత్రిని విమర్శి స్తామా. మంచి రాస్తాం. మంత్రుల కార్యక్రమాలు ప్రజలకి తెలియపరుస్తాం. అసలు ఎందుకు విమ ర్శించాలి...?''

'విమర్శించకపోతే ఎలా..ఎవడిష్టం వచ్చినట్లు వాడు ప్రవర్తిస్తాడు. వాళ్ళమీద చెక్..ఎలా ఉంటుంది'??

'ఎవడయ్యా వాళ్ళని చెక్ చేసేది. మనం చెకింగ్ ఇనస్పెక్టర్లమా'

'ప్రజాస్వామ్యాన్ని కాపాడే శక్తి పేపర్లకుందని మీరే రాస్తే చదివాను..మనమే ఆ పని చెయ్యకపోతే ఎలా..?''

'అంటే ఈ నాయకుల్ని ఎన్నుకొన్నవాళ్ళు పనికి మాలినవాళ్ళా.. వాళ్ళే చూసుకొంటారా గొడవ. మధ్యలో మనమెవరం ఆ పని చేయడానికి'...

'సర్లెండి...అవాదనెందుకు..ఇంతకీ హోం మిని స్టర్ విషయం ఏం చేద్దాం?''. అసలు విషయంలోకి లాక్కొచ్చాడు ఓ సీనియర్ రిపోర్టర్. ఫతేమైదాన్ క్లబ్..మొదటి అంతస్థులో ఓ మూల సాగుతోందీచ ర్చ! కొందరు జర్నలిస్టులు ఈ సమావేశానికి ప్రత్యే కంగా ఆహ్వానించబడ్డారు. హోంమినిస్టర్ లిస్టులో ఏ వరసలో తమ పేర్లు ఉన్నాయో తెలియని జర్నలిస్టులు వాళ్ళు. నా పేరే మొదట ఉందంటే కాదు..నా పేరే ఉందని వాదనకి దిగి కొట్లాటకు దిగగల సమర్థత వాళ్ళకుంది.

''ఇంకా మన పెద్దాయన రాలేదు..?'' అన్నారొక రు.

''కబురు అందలేదేమో.''

'ఆ...అందే ఉంటుంది...ఆయన డైరెక్టుగా మిని

స్టర్‌నే కలుస్తాడేమో...''

'ఛ...అలా చెయ్యడయ్యా...మనతో చర్చించ కుండా ఏ నిర్ణయానికీ రాడు..ఆ భయం నీకొద్దు..'

'మరి ఇంకా బయలుదేరలేదంటావా...?'

''హోంమినిస్టర్ పి.ఎ.ని అడిగాను..'బయలుదేరారు'...అన్నాడు.''

'ఎవరు..హోంమినిస్టరా..?'

'కాదయ్యా...మన నాయకుడు...'

'ఓ...పరమహంసా...వస్తాడ్లే'

'ఇంతకీ హోంమినిస్టర్ రాడా...? ఎంతసేపూ ఈ వెయిటింగ్...?'

'అలా కంగారు పడకండయ్యా...వస్తాడు...టైమ్ అవుతోంది.

వాళ్లంతా హోంమినిస్టర్‌కి కావలసిన వాళ్ళు. అందులోనూ మినిస్టర్ పి.ఎ. ఏర్పాటు చేసిన పార్టీ అది. బేరర్లు చాలా మర్యాదగా ప్రవర్తిస్తున్నారు.

మామూలుగా అయితే ఎవర్నీ అంతగా పట్టించుకోనట్లుండే ఆ బేరర్లు ఈ జనాన్ని 'ఏం కావాలంటూ' క్షణానికోసారి అడుగుతున్నారు.ఆ క్లబ్‌లో సభ్యత్వం దొరకడమే కష్టం. దాన్నో ప్రతిష్టగా భావిస్తుంటారు. ఆ ప్రెస్టేజీ కోసం వేలకువేలు ఖర్చు పెట్టడానికి వెనకాడని వాళ్ళు ఉన్నారు. ఈ జనానికిమటుకు సభ్యత్వంతో పనిలేదు. ఏ క్లబ్‌కయినా వెళ్ళగలరు. ఎక్కడయినా ఏదైనా తాగగలరు. - విషంతప్ప.

జేబులో పదిపైసలు లేకపోయినా రాచమర్యాదలు అందుకోగలరు. పేరుపక్కన ఆ ఒక్కపదం లేకపోతే ఈ జనంలో సగం మందిని ఆర్థికంగా వెనుకబడిన వర్గాల్లో చేర్చాల్సిందే.

'హోంమినిస్టర్ వస్తున్నారు'..ఎవరో చెప్పారు.

'నమస్కారం' అంటూ ప్రవేశించాడు హోంమినిస్టర్. వాళ్ళు తలలు ఆడిస్తూ నవ్వారు. హోంమంత్రి ఆసీనుడై ఆ జనాన్ని పరికించి చూశాడు..

''పరమహంస..' రాలేదా...?'' అడిగారు హోంమినిస్టర్.

'రాలేదు..'

'రాలేదా...నాతో వస్తానని చెప్పాడే...'-

'కృష్ణమూర్తీ...పరమహంస...' అని మినిస్టర్ అంటూండగానే పరమహంస కనిపించాడు.

'రా..రా...నీకోసమే ఎదురు చూస్తున్నాం'..మంత్రి పలకరించాడు.

'ఎందుకు సార్..ఎదురు చూడటం..'?

'భలేవాడివి నువ్వు లేకపోతే ఎలా..?'

'ఏం..ఎందుకు..?'

'అదేమయ్యా అలా మాట్లాడుతావ్ సీనియర్‌వి..ఓ సలహాకీ సంప్రదింపుకీ..ఉండాలి కదా..'

'ఏం సలహా సార్..కొంప మునిగింది...'?

'ఏం జరిగింది..ఆ నిఖిలేష్ వెళ్ళిపోయాడా??'' ఆ జనంలోంచి ఎవరో అడిగారు.

'ఛ..ఛ..ఆ మాట అనకండి..వాడు చస్తాడా...?'' పరమహంస విసుక్కొన్నాడు.

''మరి ఇంకేమయిందయ్యా...'' హోంమంత్రిగారు ప్రశ్నించారు.

''ఏవుంది సార్... మా వాళ్లంతా మిమ్మల్ని బాయ్‌కాట్ చేస్తున్నారు?''

''నేనేం చేశాను.. ?''

''మీరంటే మిమ్మల్ని కాదు. మంత్రుల ప్రెస్‌కాన్ఫరెన్సులన్నీ బహిష్కరించాలని నిర్ణయించారు. మీరు హాజరయ్యే సభలకు కూడా మేం రాకూడదు.''

''ఇప్పుడొచ్చావ్‌కదయ్యా... కూర్చో'' మంత్రి నవ్వారు.

''అంటే నేను వచ్చానని అంటున్నారా. అలా అనుకోవద్దు. నేనిప్పుడే వెళ్లిపోతా. జర్నలిస్ట్ అంటే అంత చులకనగా ఉన్నాడా... నో... నో... నేవెళ్లిపోతా''.

పరమహంస ఆవేశం నటిస్తున్నాడు.

''ఇదేవచ్చింగి పరమహంసా నీకు... ఉత్తినే కోప్పడతావ్... బాబూ నువ్వు రాలేదయ్యా. నేనే రమ్మన్నాను. వచ్చావ్... సరా... కూర్చో''.

''ఆ... అలా చెప్పండి. నేను వచ్చానంటే ఎలా ఒప్పుకుంటాను. మీరు పిలిస్తే వచ్చాను''.

''సరే ఏంతీసుకొంటావ్?...''

''ఏమిటీ...?''

''ఏవిటంటావేమిటి? డ్రింక్!''

''మీరసలు ఏమంటున్నారు. ఆ ఏమనుకొంటున్నారు. నేను తాగుబోతునా... డ్రింక్ ఎందుకూ. అసలు అదెందుకు...?'' పరమహంస కోపంతో

చిందులు వేస్తున్నాడు.

"హాట్‌డ్రింక్ పోతేపోనీండి... బీరయినా తాగండి" వరమహంసతో ఇరవైఏళ్లు పరిచయమున్న ఓ జర్నలిస్టు అన్నాడు.

"నన్నేమనుకొన్నావ్ సత్యమూర్తి... నేను హాట్‌డ్రింక్ తాగలేననుకుంటున్నావా... బేరర్... విస్కీ తీసుకురా" వరమహంస ఉద్రేకపడ్డాడు.

"మా కెందుకీ పార్టీ?" వరమహంస మినిస్టర్‌ని అడిగాడు.

"ఏమిటి వరమహంసా అంత సీరియస్ అవుతావు? ఏదో మామూలుగానే పార్టీ ఇస్తున్నా" మినిస్టర్ చెప్పాడు.

"వరమహంస ఓ పెగ్గు తాగాడు. మిగతావాళ్లు స్థిమితపడ్డారు.

"నేను సీరియస్ అవడంకాదు. బయటపరిస్థితి టెన్షన్‌గా ఉంది. జర్నలిస్ట్ సంఘం తీర్మానాలు చేసింది" వరమహంస తాపీగా అన్నాడు.

"నిజానికి మేం ఈ సమావేశానికికూడా రాకూడదు. ప్రెస్ కాన్ఫరెన్స్‌లకీ, మంత్రుల సమావేశాలకే మేం హాజరుకాకూడదు"- సత్యమూర్తి మినిస్టర్‌ని చూస్తూ అన్నాడు.

"ఏం... ఎందుకయ్యా" వరమహంస విసుక్కొన్నాడు.

"మీకు తెలియంది ఏవుందీ... మనవాళ్లు నిర్ణయించారుగా..." సత్యమూర్తి జవాబిచ్చాడు.

"ఏవిటీ వాళ్లు నిర్ణయించేది. ఎవడో ఎవడ్నో కొడితే మనం మంత్రుల సమావేశాలు బహిష్కరించాలా... ఎవరయ్యా వాళ్లకీ హక్కు ఇచ్చింది" వరమహంస రెట్టించాడు కోపాన్ని.

"అదే వరమహంసా నా పాయింటూనూ..." మినిస్టర్ సర్దుకొన్నాడు.

"ఏం పాయింటండీ... జనాల్ని కొడుతోంటే మీరేం చేస్తున్నారు. జర్నలిస్ట్‌లని కొట్టడం ఏమిటీ... అసలేంటి మీ పాయింటు" విరుచుకుపడ్డాడు వరమహంస... రెండోపెగ్గు పూర్తిచేసి.

"ఇంకో పెగ్గు" బేరర్‌కి మినిస్టరే వరమహంస తరఫున ఆర్డరిచ్చాడు.

"ఎవరికి... నాకొద్దు... మీరు తాగండి... ఏవిటీ హడావిడి...?" వరమహంస మినిస్టర్‌ని గదమాయించాడు.

"నేను తాగనని నీకు తెలుసుకదయ్యా... సరే దానిదేముందిలే కానీ ఎందుకయ్యా ప్రతీ పార్టీలోనూ ఇలా హడావిడి చేస్తావ్... పైగా నేను హడావిడి చేస్తున్నానని అంటావ్...?" మంత్రి ఎదురుప్రశ్న వేశాడు.

"మేం జర్నలిస్ట్‌లం. మాకు మందూ... పార్టీలు... ఏంపనికి రావు. ఎవరి దయాధర్మం మాకువద్దు. మీరేదో పార్టీ ఇస్తే మీమాట వింటామనుకొంటున్నారా...? అది అసలు లాభంలేదు" దర్పం చూపించాడు వరమహంస.

"సీనియర్ జర్నలిస్ట్‌వి. నిన్నెవడయ్యా లొంగదీసేది. కానీ సంఘంవాళ్లు చెబితే నీలాంటివాడూ విషయం అర్థం చేసుకోకుండా ఇలా మాట్లాడటం" మంత్రి దీనంగా అన్నాడు.

"ఎవడు చెప్పాడు మీకు. నేను వాళ్లమాట విన్నానని. ఎవడో ఏదో చెబితే వినడానికి నాకు వ్యక్తిత్వం లేదనుకొంటున్నారా...?"

"అదుందనేకదా... నిన్ను పిలిచింది" హోంమంత్రి పొగిడాడు.

"అలా చెప్పండి... ఎవరినీ నేను లెక్కచెయ్యను" వరమహంస ఓ విసురు విసిరాడు మూడోపెగ్గు ఖాళీచేస్తూ.

"ఇంకా కావాలా...?"

"ఏమిటీ...?"

"అదే నువ్వు తాగేది..."

"మూడు పెగ్గులే తాగగలను అనుకొంటున్నారా... నా కెపాసిటీ మీకు తెలీదు. ఐ క్రియేటెడ్ చీఫ్‌మినిస్టర్స్. ఐయామ్ రెస్పాన్స్‌బుల్ ఫర్ సోమెనీ పీపుల్‌టు బికమ్ మినిస్టర్స్" వరమహంస ఇంగ్లీషులో మాట్లాడటం మొదలుపెట్టాడు.

"ఇప్పుడు ఇంగ్లీషులో ప్రసంగాలు చెయ్యకు. ఇంతకీ ఈ సమావేశాన్ని బహిష్కరిస్తున్నట్లా..." మంత్రి కంగారుపడ్డాడు.

"నేనా... ఈ సమావేశాన్ని బహిష్కరించడమా..." గట్టిగా నవ్వాడు వరమహంస.

తేలిక పడ్డాడు హోంమంత్రి.

"నేనిపుడు ఏంచెయ్యాలి నువ్వే చెప్పాలి..." మంత్రి అర్థించాడు.

"నేనేం చెబుతాను. జర్నలిస్ట్ సంఘం తీసుకొన్న నిర్ణయం మంచిది కాదు. దాన్ని నేను సమర్థించను.




మావాళ్లు సమర్థించరు'' ఏవంటారు అన్నట్లు చూశాడు మిగతావాళ్ల వైపు.

వాళ్లు పరమహంస ఏంనిర్ణయించినా తలలు ఊపడమే కర్తవ్యంగా ఉన్నారు. ఏం మాట్లాడటంలేదు.

''నీ సమర్థత నాకు తెలుసు పరమహంసా... అందుకే...''

మంత్రి మాటల్ని తుంచుతూ ''ఏంసమర్థత మీకు తెలుసు... అలా నా గురించి అంచనా వెయ్యొద్దు. ఏదో వచ్చాను. అదైనా మీరు రమ్మన్నారు కాబట్టి...'' పరమహంస మంత్రిని ఢీకొన్నాడు.

''నీతో ఎలా మాట్లాడినా ప్రమాదమే...'' మంత్రి నవ్వాడు.

''ప్రమాదమా... ఎందుకూ... మేం మీకు అపకారం చేసేవాళ్లంకాదే...'' పరమహంస మినిస్టర్ మాటల్ని ఎదురు తిప్పాడు.

''నువ్వేమయినా చెయ్యగలవ్ పరమహంసా... జర్నలిస్టుల సంఘానికి వ్యతిరేకంగా నిర్ణయం ఎవరు తీసుకోగలరు. అంత సాహసం ఎవరికి ఉంటుందీ...'' మినిస్టర్ లౌక్యం ప్రదర్శించాడు.

మళ్లీ ఓ పెగ్గు తాగాడు పరమహంస.

''సాహసమా... మా అదీ సాహసమేనా...' ఏ నిర్ణయమండీ అది సరైనదైతే నేను తిరగబడను. అది చాలా తప్పు. ఓ జర్నలిస్టుని ఎవరో కొడితే ప్రభుత్వాన్ని తిడుతున్నారు''

పరమహంస వాక్యం పూర్తి కాకుండానే మినిస్టర్ అందుకొన్నాడు ''అదే నేనూ అనేది...''

''మీరనేది ఏమిటండీ... నేనే అంటున్నాను. అసలు మా పత్రికలు ఎందుకున్నాయ్...'' చెప్పండి అన్నట్లు చూశాడు.

మంత్రి మౌనం వహించాడు. పరమహంసకేసే చూస్తున్నారు మిగతావాళ్లంతా...

''ఎందుకున్నాయ్... వార్తలు అందించడానికి. ఎవరికి...? ప్రజలకి. ఏవంటారు... చెప్పండి'' పరమహంస నిలదీశాడు.

''అవును... అవును'' ఏంచెప్పాలో తెలియక మంత్రి అవస్థ పడుతున్నాడు.

''నా ప్రాణం పోయినాఫర్వాలేదు. వార్తలు ప్రజలకు అందిస్తాను. ఎంతమంది జర్నలిస్టులు వార్తల కోసం త్యాగం చేశారు. ఇదేం పట్టుదు ఆ సంఘానికి. వార్తలు ఇవ్వడం మానేస్తారట. నిఖిలేష్‌పై దాడి జరిగితే అది ప్రజలకేం సంబంధం...? ప్రజలకు అందించాల్సిన వార్తలను ఎందుకాపుతారు? అసలీ బహిష్కరణలు ఏమిటి...? ఎవర్ని బహిష్కరిస్తారు? ఓ జర్నలిస్ట్ గురించి ప్రభుత్వాన్నే బహిష్కరిస్తారా...? ప్రజల్నే బహిష్కరిస్తారా...? పాత్రికేయులంటే... ఎవరు?'' మీరు చెప్పండన్నట్లు కళ్లు ఎగరేశాడు పరమహంస.

ఎవ్వరూ బదులివ్వలేదు... అందరికేసీచూశాడు పరమహంస.

'పాత్రికేయులంటే ప్రభుత్వానికీ ప్రజలకీ వారధి లాంటి వాళ్లు. మనకేదోజరిగిందని ప్రభుత్వం వార్తలు ప్రజలకు అందించకుండా ఉంటామా సత్యమూర్తీ. చెప్పు...చెప్పవయ్యా' సత్యమూర్తిని రంగంలోకి లాగాడు పరమహంస.

'అంతేనండి... ఏదయినా మనపని మనం చెయ్యాలి. ఒక్కడికోసం ఓ వ్యవస్థ ఆగిపోతుందా...'సత్యమూర్తి అంటున్నాడు.

'యుఆర్‌కరెక్ట్... అదేనేననేదీ... పరమహంస ఆగాడు.

'ఎంతయినా హెూంమంత్రి సమావేశాన్నికూడా బహిష్కరించడమా... ఓ నేరం జరిగింది. అందులోనూ జర్నలిస్ట్‌మీద దాడి. మరి దానిగురించి ప్రభుత్వపరంగా చెప్పేది ఎవరు...?' హెూంమినిస్టర్ ఆయనే స్వయంగా సమావేశం పెడతానంటే మనవాళ్లు బహిష్కరించడం నిజంగా అన్యాయం. ఇది మంచిదికాదు. అందుకే పరమహంసా నేనూవచ్చింది...' అంతవరకూ తాగడంలోనే మునిగిపోయిన ఓ వృద్ధజర్నలిస్ట్ వ్యాఖ్యానించాడు.

'మీరుచెప్పింది అక్షరాలా నిజం రావ్‌గారూ...' పరమహంస మెచ్చుకొన్నాడు.

హెూమ్‌మంత్రి ఆనందపడ్డాడు. 'మీరంతా పరిస్థితి అర్థంచేసుకొన్నారు. అదేనాకు పదివేలు...' మంత్రిప్రశంసించాడు.

'ఏపరిస్థితినైనా అర్థంచేసుకోగలం... ఇదేమన్నా మొదటిదా...మీకు కొత్తేకావచ్చు... మేం ఇలాంటివెన్నోచూశాం... ఎంతమందికోసలహాలిచ్చాం. ఇలాంటి సమయాల్లోనే ఒకరికి మరొకరు తోడునిలవాలి. లేకుంటే ఏమవుతుంది... అనవసరంగా న్యూసెన్సు... నాకాన్యూసెన్సు ఇష్టంలేదు... 'పరమహంస చిరాకుపడ్డాడు.

'ఇంతకీ మినిస్టర్‌గారు ఏంచెబుతారో...' సత్యమూర్తి గొణిగాడు. 'ఏం... ఆయన చెప్పేవిషయం మీద అంతఆసక్తి చూపిస్తున్నావ్.ఇంతవరకూవచ్చి ఏంచెప్పకుండానే వెళ్ళిపోతారా...?''

మళ్లీ పరమహంసే దులిపేశాడు.

'అదేనయ్యా మహానుభావా... అసలు ఆయన విషయం ఇంతవరకూ చెప్పలేదు ...' సత్యమూర్తిన వ్వాడు.

'చెబుతారు...చెప్పకుండా వెళ్ళడానికి ఆయన రాలేదు. ఈయన ఎంతతెలివైన రాజకీయనాయకుడు అనుకొంటున్నావ్. అయిదేళ్ళకాలంలో కాకలు తీరిన నాయకులందర్నీ పక్కకునెట్టి రాజకీయాల్లో ఎన్నోమెట్లెక్కి హోంమంత్రి అయ్యాడంటే ఈయన కెపాసిటీ ఎవరికుంది ఈరోజున...' రావ్ పొగిడాడు

మంత్రి ఉక్కిరిబిక్కిరయినా తేరుకొని 'ఏదో అభిమానం' అన్నాడు.

'ఇంతకూ మీరేం చెప్పాలనుకొంటున్నారు. టైంఅవుతోంది. మీరుచెప్పడం పూర్తయితే మేం వార్తరాసి ఇవ్వాలి... 'ఏవిటి అన్నట్లుగా మిగతామిత్రులకేసి చూశాడు పరమహంస.

'కృష్ణమూర్తీ...' మంత్రిపిలిచాడు...

'సార్' అంటూ కృష్ణమూర్తి వచ్చాడు...

ప్రెస్‌నోట్ తెమ్మన్నాడు హోంమినిస్టర్

'ఏంప్రెస్‌నోట్...' సత్యమూర్తి అడిగాడు...

''నిఖిలేష్ దాడిమీద హోంమంత్రిప్రెస్‌నోట్... 'ఏదో... తయారుచేశాను... మీరు చూడండి'—హోంమంత్రినవ్వుతూ అందుకోండి అన్నట్లుగా చూశాడు.

'ఈప్రెస్‌నోట్ వ్యవహారం ఎందుకుగానీ... అదిచదివిమీరే వినిపించండి... పాయింట్స్‌రాసుకొని వెళ్ళిపోతాం.

వరమహంస మాటలను ఆదేశంగాతీసుకొన్నాడు హోంమంత్రి.

కృష్ణమూర్తీ ఆ తలుపు దగ్గరికి వెయ్యి... ఎవర్నీ రానివ్వకు...' ఆర్డరేశాడు.

'సార్' అంటూ కృష్ణమూర్తి తలుపుని అంటుకుపోయాడు.

''చాలా విచారకరం. నిఖిలేష్ అనే జర్నలిస్ట్ మీద దాడిజరగడం దారుణమైన విషయం. ఈసంఘటన నన్ను బాధిస్తోంది. విశాలమైన భారతదేశంలో విభిన్నసంస్కృతులు, భిన్నసంప్రదాయాలు ఉన్నప్పటికీ మనమంతా ఒక్కటే. మనలో ఏఒక్కరిమీద దాడిజరిగినా సహించకూడదు. అలాంటిది ఓ జర్నలిస్ట్‌మీద అఘాయిత్యం జరిగింది. ఇలాంటి దారుణాలు జరిగినపుడు దేశమంతా స్పందించాలి. ఏకమై ఖండించాలి. ప్రజాస్వామ్యానికీ పత్రికలు మూలస్తంభాలు. ప్రజాస్వామ్యపరిరక్షణలో పత్రికలు నిర్వహించేపాత్ర అమోఘమైనది. పాత్రికేయులు స్వేచ్ఛగా ఉన్నప్పుడే పత్రికలు వాటి గురుతరమైన బాధ్యతను నిర్వర్తిస్తాయి. అలాంటి పాత్రికేయులమీద దాడి జరిగిందంటే ప్రజాస్వామ్యాన్ని నడిబజార్లో హత్యచెయ్యడమే అవుతుంది. ఈఘాతుకాలను నేను ఏహోదాలోఉన్నా నిరసించి తీరుతాను. రాష్ట్రహోంమంత్రిగా నేను ఎంతో కుమిలిపోతున్నాను. నాహయాంలో ఈదాడిజరగడం విచారకరం. గుర్తుతెలియని గూండాలు అరాచకాన్ని సృష్టించడానికి ప్రయత్నిస్తున్నారు. సమాజంలో అశాంతిని రేపుతున్నారు. ఆతీవ్రవాదాన్ని మనం ప్రతిఘటించాలి. తీవ్రవాదులు చేసే ఈబీభత్సాన్ని అరికట్టాలి. తీవ్రవాదవైఖరిని అణచివెయ్యాలి. దీనిగురించి తీవ్రంగా ఆలోచించాల్సిన సమయం ఆసన్నమయింది. నేనూ మీతో చేతులు కలుపుతున్నా రండి. కలసి పోరాడుదాం. ఈదుష్టశక్తులను సమాజంనుంచి ఏరివేద్దాం. సభ్యసమాజానికి శాంతి నిప్రసాదిద్దాం. అశాంతికి తావులేనిపరిస్థితి నెలకొల్పుదాం. ఏ శాంతిసాధనకై గాంధీ, నెహ్రూలు పోరాడారో... ఆ మార్గంలో నడుద్దాం. వారు నిర్దేశించిన సూత్రాలను అనుసరిద్దాం... కలసినడుద్దాం. ప్రజల్ని కలుపుకొని దుర్మార్గులఆట కట్టిద్దాం.

ఏనాడయితే ఈసంఘంలో దౌర్జన్యం ప్రవేశించిందో ఆనాటినుంచీ ప్రజాస్వామ్యం అరాచకాలకు గురవుతూనే ఉంది. ప్రజాస్వామ్యానికి కళ్లూ, చెవులూ అయిన పత్రికలు, పాత్రికేయులను కాపాడుకోవడం ప్రజలబాధ్యత. ప్రభుత్వకర్తవ్యం. ఈప్రజాప్రభుత్వం ఏనాడూ ఆ కర్తవ్యాన్ని విస్మరించలేదు. ఈనాడు నేను మీముందు ప్రకటిస్తున్నా. దౌర్జన్యంతో ఏదోసాధించాలని చూసిన ఆదుర్మార్గులను పట్టుకొంటాం. వాళ్ళకి కఠినశిక్షలు వేస్తాం.

''పాపం... నిఖిలేష్...'నిజం' జర్నలిస్ట్. నవయువకుడు. అభ్యుదయభావాలు ఉన్నవాడని చెప్పగా విన్నాను. మనసమాజంలో నిఖిలేష్ లాంటిభావా

లు ఉన్న వ్యక్తులు ఉండాలి. వాళ్ళసంఖ్య పెరగాలి. అలాంటి భావాలు ఈపరిస్థితిలో ప్రతీయువకుడిలో కలగాల్సిన అవసరం ఎంతోఉంది. అభ్యుదయప థంవైపు ఈరాష్ట్రాన్ని, ఈప్రజల్ని తద్వారా దేశాన్ని నడిపించగల సమర్థతఉన్న పాత్రికేయులు ఉండి తీరాలి. అటువంటినిజమైన పాత్రికేయులకు సంపూర్ణరక్షణ కల్పిస్తాం. ప్రత్యేక శిక్షణపొందిన పోలీసులను ఈరక్షణా కార్యక్రమాలకు నియమిస్తాం. ఆ రిపోర్టర్ల మీద దాడిజరగకుండా చూసేందుకు ఆ పోలీసులను మఫ్టీలో కాపలాఉంచుతాం.

''జర్నలిస్టులు నాకు ఆప్తులు... ఈ సమాజానికి వారి సేవలు మరపురానివి. నిస్వార్థ సేవకులపై దాడి జరిగిందంటే సమాజానికి తీరని నష్టం వాటిల్లు తుంది. యువకుడు ఆదర్శవంతుడైన నిఖిలేష్ మీద జరిగిన దాడిని నేను తీవ్రంగా ఖండిస్తున్నా ను. దాడిజరిపిన వాళ్ళు ఎంతటి ఉన్నతులైనా... వారేహోదాలో ఉన్నా పట్టుకోవాలని పోలీసు ఉన్నతా ధికారులకు ప్రత్యేక ఆదేశాలు ఇచ్చాము. ఈ కేసు ను వెంటనే దర్యాప్తు చెయ్యడానికి స్పెషల్‌బ్రాంచ్ పోలీసులను కూడా రంగంలోకి దింపాము...''

ప్రెస్‌నోట్ చదవడానికి హోంమంత్రి ఆయాసప డుతున్నాడు.

''అయిందా... ?''పరమహంస మత్తుగా అడిగా డు.

'దాదాపుగా'... అన్నాడు హోంమంత్రి ఆయాస పడుతూనే.

'ఇక చాల్లెండి. ఆ నోట్‌లో ఎనభైశాతం పొల్లు. అదెవడు రాస్తాడు..' పరమహంస విమర్శించాడు.

''ఏదో... జర్నలిస్ట్ మీదదాడి జరిగిందికదా... ఆమాత్రం ఘాటుగా లేకపోతే మీరేమంటారోనని...' హోంమంత్రి ఆయాసం తగ్గింది.

'దానికేం గానీ... పోలీసులు ఏమన్నారో చెప్పండి' సత్యమూర్తి గుర్తు చేశాడు.

హోం మంత్రి మరోపేపరు తీశాడు. ''ఇంతవ రకు పోలీసులు అందించిన సమాచారం ఎలా ఉందంటే''అని ప్రారంభించి, నిఖిలేష్ మీద పాత కక్షల మూలంగానే దాడి జరిగిందనీ, నిఖిలేష్ వృత్తికీ ఈ దాడికీ సంబంధం లేదనీ పోలీసులు పేర్కొన్నారని హోంమంత్రి వివరించాడు. వ్యక్తిగత మైన కక్షల మూలంగా నిఖిలేష్‌ని గుర్తుతెలియని వ్యక్తులు కొట్టారనీ, నిఖిలేష్ శరీరం మీద పది కత్తిపోట్లు ఉన్నాయనీ నుదుటిమీద కూడా పెద్దగా గాయాలు ఉన్నాయని, అందువల్ల నిఖిలేష్ కళ్ళ కు ప్రమాదం ఏర్పడిందనీ, డాక్టర్లు నిఖిలేష్ కళ్ళు ఉన్నాయా? లేవా? అనే విషయాన్ని ఇప్పటికీ నిర్ధా రించలేదనీ, పోలీసులు అందించిన మొదటి విచా రణా నివేదికను తెలియజేశాడు రాష్ట్ర హోంమంత్రి.

''ఇదంతా అలా ఉండనీయండి... ఈ విష యంలో మీరు తీసుకొనే చర్యలు...?''

మూలకూర్చున్న రావ్ గట్టిగా అరిచాడు.

''నేను మీకు ముందే చెప్పాను... గట్టి చర్యలు తీసుకోవడం జరుగుతుంది. మీకు మనవి చేసినట్లు ఈ విషయాన్ని తీవ్రంగా పరిగణిస్తాం. ఈ దారుణం చేసినవారు ఎంతటి వారైనా అరెస్ట్ చేసి కఠినశిక్ష వేస్తాం'' హోం మంత్రి హామీ ఇచ్చాడు.

''ఇంతవరకూ పోలీసులు ఎవ్వరినీ అరెస్ట్ చె య్యలేదా...? దాడిచేసినవాళ్ళలో ఒక్కడినైనా పట్టుకో రా...? మీరేం చెబుతారు ఈ విషయంలో... ???'' మత్తుగా ఉందా ప్రశ్న.

''అరెస్ట్ చెయ్యలేదంటే... బ్రదర్, మీకు తెలి యంది ఏముందీ... ఈ దాడి వ్యక్తిగతమైన కక్షలతో జరిగింది. ఎవరితో ఈ రిపోర్టర్ నిఖిలేష్‌కి విభేదాలు ఉన్నాయ్... అవి ఎలాంటి కక్షలు... ఈ విషయాల న్నీ దర్యాప్తు పూర్తయితే గానీ ఆ దుండగులను గుర్తించడం కష్టం. వాళ్ళని పోలీసులు ఖచ్చితంగా పట్టుకొంటారు. నాకా నమ్మకముంది.'' హోం మిని స్టర్ జోకుగానే చెప్పాడు.

''ఎప్పటికి మీ దర్యాప్తు పూర్తవుతుంది... అది చెప్పండి.. అంతవరకూ మావాళ్ళు ఊరుకోరు...'' సత్యమూర్తి విస్కీగ్లాసు కోసం వెతుకుతూ అడిగాడు.

పరమహంస వినుక్కొంటున్నాడు ''ఏమిటీ ప్రశ్న లని''.

''ఇది న్యాయమా... జర్నలిస్ట్‌మీద దాడి చేసింది ఎవరు... ? ...నేనా... పోలీసులా... ఎవరూ...?. వ్యక్తిగ తమైన కారణాలవల్ల దాడి జరిగితే దాన్ని మీరంతా ప్రభుత్వ వైఫల్యం అంటూ మామీద కత్తి దూస్తే ఎలా...?. చెప్పండి... మీరే తేల్చి చెప్పండి. నేను ఏం చెయ్యాలి... ? . ప్రభుత్వాన్ని ఏం చెయ్యమంటారు? .. మీరేమైనా సూచనలివ్వండి. సలహాలు అందించండి. వాటిని తప్పని సరిగా అమలు చేస్తాం. మనందరం కలిసి ఓ అవగాహనకు వద్దాం.



ప్రభుత్వం తీనుకొనే చర్యలన్నీ మీముందుంచాను. అంతకన్నా ఏం చేస్తే బాగుంటుందో ఆలో చించండి. అమలు చేద్దాం. దానికి నేనెప్పుడూ రడీగా ఉంటాను. నాగురించి మీకు తెలును. మీరు చెప్పిన ఏవనిని నేను కాదన్నాను. ఒక్కటి చెప్పండి.. పరమహంసా... సత్యమూర్తీ... రావ్..'' అంటూ అక్క డున్న ఒక్కొక్కర్నీ పిలుస్తూ ''నేను కాదన్న మీపని ఒక్కటి చెప్పండి'' అని హోం మంత్రి సవాలు చేశాడు. మంత్రిముందు కూర్చొన్న వారిలో కలవరం పుట్టింది. మౌనం ముద్రవేసింది.

★ ★ ★

'కాంతి' దినపత్రిక కార్యాలయంలో రాత్రి పదకొండు గంటలుదాటింది.

ఆ కార్యాలయం ప్రధానద్వారాన్ని సెక్యూ రిటీని దాటుకొని దూసుకొచ్చింది హోంమినిస్టర్ ప్రయివేట్‌కారు.

'థేంక్యూ..... థేం.... క్యూ....' అంటూ కారులోంచి దిగాడు 'కాంతి' ప్రత్యేక ప్రతినిధి పరమహంస.

'గుడ్‌నైట్‌సార్... గుడ్‌నైట్...సార్... మీబ్యాగ్... మర్చిపోయారు... ఇదిగోండి' అందించాడు హోంమంత్రి పి.ఎ.

ఆబ్యాగ్ అందుకొని మళ్ళీ గుడ్‌నైట్... థ్యేంక్స్ చెప్పాడు పరమహంస.

ఆకారు వినయంగా వెనక్కు కదిలింది. పరమ హంస టెలిప్రింటర్లు, రిపోర్టర్లు ఉండే గదులన్నీ దాటుకొని సబ్ఎడిటర్లూ, న్యూస్ ఎడిటర్లూ కూర్చొనే డెస్కులోకి వచ్చాడు. న్యూస్ఎడిటర్ అప్పటికే వెళ్ళి పోయాడు. 'మరెవరున్నారని' అడిగాడు. స్టోన్‌లో చీఫ్ సబ్ఎడిటర్ ఉన్నాడని జవాబొచ్చింది. కంపోజ్అయిన మేటర్‌ని పేజీల్లో పెట్టిస్తూ ఇబ్బందిపడే ఇంపోజర్‌కి సూచనలిస్తూ స్టోన్‌పని చూస్తున్నాడు చీఫ్ సబ్ఎడిటర్ సతీష్.

'సతీష్....' పిలుపువిని పరమహంస కేసి చూ స్తూ దగ్గరగా వచ్చాడతను.

'సతీష్ మొదటిపేజీ మేకప్ అయిపోయిందా?' కంగారుగా అడిగాడు పరమహంస.

'అవుతోంది... ఒపావుగంటలో పూర్తవ్వాలి' సతీష్ అన్నాడు.

'బేనర్ ఏమిటి?' అన్న పరమహంస ప్రశ్నకు జర్నలిస్టల సంఘం తీర్మానాలు అని చెప్పాడు సతీష్.

'అంతకన్నా మంచివార్త ఉంది' అని చెబుతూ హోంమినిస్టర్ ప్రెస్ కాన్ఫరెన్స్ గురించి వివరించాడు పరమహంస.

'హోంమినిస్టర్ ప్రెస్ కాన్ఫరెన్సుని మన జర్నలిస్టలు బహిష్కరించారని అజయ్ చెప్పాడు. అదెలా పబ్లిష్ చేస్తాం' సతీష్ సూటిగా అడిగాడు.

'ఆబహిష్కరించడం సంగతి 'నిజం' వాళ్ళు చూసుకొంటారయ్యా. ఆగొడవ మనకెందుకు. అదో రకం పబ్లిసిటీ... నీకు అంతా వివరంగా చెబుతానుగా... నువ్వుకూడా ఆ'నిజం' ఎడిటర్లా బేనర్ పెడతావా... ఏమిటి...? మన పేపరు ప్రత్యేకత మనం కాపాడుకోవద్దూ... రేపు నీమొదటి పేజీ మేకప్చూసి మన మేనేజ్మెంట్ ఎంత మెచ్చుకుంటుందోచూడు. మేనేజ్మెంట్కాదు నేను ఇపుడిచ్చే వార్త నువ్వు మొదటి పేజీలో పెడితే మొత్తం ప్రభుత్వమే ఇరుకున పడుతుంది.' — పరమహంస రహస్యంగా చెప్పాడు.

'అదెలా....' సతీష్ ఆశ్చర్యపడ్డాడు.

'ఓ జర్నలిస్టమీద దాడిజరిగిందా........?'

'అవును.......!'

'అది తీవ్రవాదుల చర్య అన్నాడు హోంమంత్రి'-...

'అయితే...'?

''అయితే ఏవిటయ్యా... మన రాష్ట్రంలో తీవ్రవాదులు ప్రవేశించి అరాచకాన్ని సృష్టిస్తున్నట్లు స్వయంగా హోంమినిస్టరే ఒప్పుకొన్నట్లు అవదూ...అంటే తీవ్రవాదులు మన రాష్ట్రంలో ప్రవేశించి కార్యకలాపాలు సాగిస్తున్న సంగతి ప్రభుత్వానికి తెలుసనన్నమాట. అయినా ఎందుకు ఊరుకొంది?. ఏ చర్యలు తీసుకొంటోంది..?. ఎవరీ తీవ్రవాదులు...?-ఇలా రోజుకో వార్త రేపట్నుంచి ప్రారంభిద్దాం ఏవంటావ్'' పరమహంస సతీష్ని సలహా అడిగాడు.

'మంచి వార్త పట్టుకొచ్చారు. ఎంత సేపట్లో ఇస్తారు'. సతీష్ అంచనా కోసం అడిగాడు.

'ఏవుందీ రెండు కాలమ్స్ మేటర్...పదినిమిషాల్లో రాసిస్తా...నువ్వు ఇక్కడే ఉంటావా...నేను డస్కలో కూర్చొని ఒకోపేజీ రాసేసి పంపిస్తుంటాను.' పరమహంస ప్లాను చెప్పాడు.

'సరే...ముందు మొదలు పెట్టండి. ఇంకాకంపోజింగ్ కూడా కావాలిగా...' కంగారుపడ్డాడు సతీష్.

'జర్నలిస్టల వార్తలు ఏం వేస్తున్నావ్...?' పరమహంస ప్రశ్నకు అడ్డుపడుతూ ''ముందు మీరు వార్త రాసి రండి. అన్నీ మాట్లాడుకుందాం'' తొందరచేశాడు. సతీష్

మొదటి పేజీ మేకప్ ఆవమని స్టోన్లో తనకూడా ఉన్న సబ్ఎడిటర్కి, ఇంపోజర్కీ చెప్పి సిగరెట్ ముట్టించాడు సతీష్.

మేకప్ ఎలా మార్చాలనేది ఆలోచిస్తున్నాడు. డమ్మీ తీసుకొని మొదటి పేజీలోని అడ్వర్టైజ్మెంట్ల పొజిషన్ చూసుకొన్నాడు. మొదటి పేజీలో 'కాంతి' మాస్ట్ హెడ్ పక్కనున్న పానెల్స్ తప్ప అడ్వర్టైజ్మెంట్లు లేవు. ఓ కార్టూన్ ఉంది. దాన్ని ఇతర పేజీల్లోకి మార్చాలను కొన్నాడు. కానీ అది జర్నలిస్టులకి సంబంధించింది. మూడు కాలమ్స్ కార్టూన్ బ్లాక్ అది. పేజీలో దాన్ని కొంచెం కిందకి దింపాడు. పరమహంస రాసిన మేటర్ కంపోజ్ అయి, ప్రూఫ్ కరెక్షన్ పూర్తయి వచ్చేసరికి పన్నెండు దాటుతోంది.

పరమహంస, సతీష్ పేజీ మేకప్ గురించి చర్చిస్తున్నారు. హోంమంత్రి ప్రెస్ కాన్ఫరెన్స్ ఎక్కడ పెట్టాలి. అది బేనరా?...లేక మొదటి పేజీ అడుగున యాంకరా? మొదటి లీడ్ కాకుండా రెండో లీడింగ్ హెడ్ లైనా? ఈ చర్చ అంతకుముందున్న 'కాంతి' దినపత్రిక మొదటి పేజీ మేకప్ని పూర్తిగా మార్చివేసింది.

★ ★ ★

'కాంతి' దినపత్రిక రాత్రి ఒంటిగంట దాటుతున్నా తుదిమెరుగులు దిద్దుకొంటోంది.

అదే సమయంలో ఉస్మానియా జనరల్ ఆసుపత్రి నిద్రపోతోంది. ఆపక్కనే అఫ్జల్గంజ్ దగ్గరున్న నయాపూల్ వంతెన మీద అపుడపుడు లారీలు, ఆటోలు తమ ఉనికిని తెలిపే శబ్దం చేస్తూ పోతున్నాయి.

ఆసుపత్రిలోని ఇన్టెన్సివ్ కేర్ వార్డులో నిఖి

లేష్ ప్రాణం ఈ బతుకు సాగించాలనే తపనతో డాక్టర్ల తోడ్పాటుతో కొట్టుకొంటోంది.

బరువైన ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఊపిరితిత్తులకు ప్రాణవాయువును అందిస్తున్నాయి.

నిఖిలేష్ జీవితంలో నిజమైన పోరాటాన్ని చేశాడు.

దానికి ఈ లోకంలోని స్వార్థం ఎదురు తిరిగింది. వెన్నుపోటు పొడిచింది.

నిజాలను చాటుతూ కలంపోట్లతో ముందుకు రికే నిఖిలేష్ కత్తిపోట్లు చేసిన గాయాలకు అపస్మారక స్థితిలోనే అల్లాడుతున్నాడు. నీరసించినా నిఖిలేష్ గుండె జీవించడానికి ఆరాటపడుతోంది.

ఆ వ్యక్తిలో ప్రాణం ఉంది. ఆ ఆసుపత్రిలో, అవార్డులో, అలా ఆబెడ్ మీద సీసాలు అందించే రక్తంనాళాల్లోకి చొచ్చుకుపోతున్న ఆ శరీరంగల వ్యక్తి నిఖిలేష్.

మరుక్షణం ఏమవుతుందో తెలీదు. ప్రతిక్షణం భారంగా నడుస్తోంది. ప్రాణం పోవడానికి క్షణంచాలు.

ఆ క్షణం దాటితే ఆ శరీరం అక్కడుండదు. నిఖిలేష్‌గా గుర్తించబడదు.

మార్చురీకి, ఆపైన ప్రాణంలేని కట్టెలాగే కట్టెల్లో మండుతుంది. కాలి బూడిదయి పిడికిటిలోకి వస్తుంది.

అయినా ఆ వ్యక్తిని గుర్తుంచుకొనేది ఎవరు?

ఎంత కాలం...?

కానీ నిఖిలేష్ ఆ క్షణంకోసం ఎదురు చూస్తున్నాడా?

దుష్టశక్తులు సాగించిన దారుణంతో పోరాడి గెలిచి జీవిస్తాడా?

ఆశానిరాశల మధ్య నిఖిలేష్ కొన ఊపిరితోనే మృత్యువుతో పోరాడుతున్నాడు.

నిఖిలేష్ చావు బతుకుల మీద లెక్కలు వేసుకొన్న ఇద్దరు జర్నలిస్ట్ స్నేహితులు ఆ వార్డు బయట వేచి వేచి ఉండలేక చల్లగా జారుకున్నారు. డ్యూటీ డాక్టర్లు, నర్సులు యధావిధిగా తమ డ్యూటీ చేస్తున్నారు. ఈ ఉద్యోగ జీవితంలో ఇలాంటి కేసులెన్నో చూసిన ఆ డాక్టర్లు మామూలుగానే ఉన్నారు.

ఎవరు ఏంచేస్తున్నారో, తన శరీరంలోకి ప్రవహింపచేస్తున్న రక్తం ఎవరిదో, మృత్యువుతో పోరాడేందుకు సహకరించే మందులేమిటో తెలియని నిఖిలేష్‌కి ప్రపంచంలో జరిగే ఇతర విషయాలు ఎలా తెలుస్తాయి?




ఆమర్నాడు మామూలుగానే తెల్లవారింది.

తూర్పు దిక్కున ఎర్రని సూర్యుడూ, ఆలేత కిరణాల వేడికే కరిగిపోయే పొగమంచు ఇవన్నీ మామూలుగానే ఉన్నాయి.

ప్రతి ఉదయంలాగే ఆరోజూ ఉంది.

తెల్లవారకుండానే పాలవాళ్ళ హడావిడి! తెల్లవారుతోంటే దిన పత్రికలు అమ్మేవాళ్ళ సైకిళ్ళ మోతలూ అలాగే ఉన్నాయి.

'కాంతి' దినపత్రిక మార్కెట్‌లోకి వచ్చేసింది. ఆ దినపత్రిక ఎందుకో ఆరోజు నూతనంగా కనపడుతోంది. కళ్ళునులుపుకుంటూ ఆపైన హడావిడిపడుతూ మార్కెట్లకు చేరిన జనాన్ని ఆ పత్రిక ఆకట్టుకొంది. 'కాంతి' ఆరోజు రోజూకన్నా ఎక్కువ అమ్ముడయింది.

'నిజం' పత్రిక తమ రిపోర్టర్ నిఖిలేష్ మీద జరిగిన దాడిని ఖండిస్తూ ప్రధాన శీర్షికతో వెలువడింది.

ఆ పత్రికను ఆరోజు చూసిన వాళ్ళూ...రోజూ చూసేవాళ్ళు "వాళ్ళ రిపోర్టరేగా...బాగా రాసుకున్నారు" అనుకొన్నారు.

ఒక సారి చదువుకొన్నారు. మడిచి పక్కవాళ్ళకి ఇచ్చేశారు. కానీ ఆనాటి 'కాంతి' చర్చనీయాంశమయింది.

సంభ్రమాశ్చర్యాలను కలిగిస్తూ వెలువడిన ఆరోజు 'కాంతి' మొదటిపేజీలో ఆరుకాలమ్స్

ప్రధాన శీర్షిక 'దుష్టశక్తుల ఆటకట్టిస్తాం'-హోంమంత్రి. ఈ హెడ్‌లైన్ కింద 'కాంతి' ప్రత్యేక ప్రతినిధి నివేదిక ఉంది.

ఆ నివేదికలో- సమాజంలో అరాచకాలను సృష్టిస్తున్న దుష్టశక్తులను ఎదుర్కోవడానికి సకల చర్యలు తీసుకొన్నామనీ, తీవ్రవాదాన్ని రెచ్చగొట్టే దుర్మార్గుల ఆటకట్టిస్తామని రాష్ట్ర హోంమంత్రి నేడు విలేకరుల సమావేశంలో ప్రకటించారు. నిన్న రాత్రి దుండగుల దాడికి గురయిన ఒక దినపత్రిక విలేకరి శ్రీ నిఖిలేష్ కేసును స్పెషల్ బ్రాంచ్ పోలీసులకు అప్పగిస్తున్నట్టు హోంమంత్రి తెలిపారు. దుండగులు ఎంతటి వారయినా అరెస్టు చేస్తామనీ, కఠిన శిక్ష విధిస్తామనీ ఆయన విలేకరుల సమావేశంలో హామీ ఇచ్చారు. శ్రీ నిఖిలేష్ మీద జరిగిన దాడి పూర్తిగా వ్యక్తి గతమైనదనీ, పాతకక్షలతో కూడుకున్నదనీ హోంమంత్రి విలేకరుల సమావేశంలో వెల్ల డించారు. ఈ సంఘటన తనను చాలా బాధించిందని, విచారకరమైనదనీ ఆయన అన్నారు. (మిగతా నాలుగో పేజీలో) అని ఉంది.

ఆ నాలుగో పేజీకి వెళ్ళి ఆ నివేదిక మిగతా భాగం చదవాలనుకొనే వారు చాలా తక్కువ.

ఎందుకంటే అదే మొదటి పేజీలో హోంమంత్రి గారి ప్రకటన పక్కనే చిన్నగా అంటె రెండుకాలమ్స్ హెడ్ లైన్‌లో కొనఊపిరితో 'నిజం' జర్నలిస్టు అనే వార్త ఉంది.

ఆ వార్తలో 'నిజం' పత్రిక ప్రతినిధి శ్రీ నిఖిలేష్ పరిస్థితి తీవ్ర ఆందోళనకరంగా ఉన్నాదనీ, కొన ఊపిరితో శ్రీ నిఖిలేష్ మృత్యువుతో పోరాడుతున్నాడనీ రాశారు. అపస్మారక స్థితిలో ఉన్న నిఖిలేష్‌ని పరామర్శించడానికి వచ్చిన ప్రతిపక్ష నాయకుల, రాష్ట్ర మంత్రుల, పార్టీల పెద్దల పేర్లతో సహా ఇచ్చారు. వైద్య సదుపాయాల్లో ఎలాంటి లోపం ఉండబోదని రాష్ట్ర ఆరోగ్య శాఖా మాత్యులు హామీ ఇచ్చారని పేర్కొన్నారు. ఈ సంఘటన పట్ల రాష్ట్ర ముఖ్యమంత్రి తీవ్ర ఆందోళనా, విచారం వ్యక్తం చేసినట్లు కూడా రాశారు. అదే మొదటిపేజీలో ఓ మూలగా ఓ సింగిల్ కాలమ్‌లో ఓ చిన్న హెడ్‌లైను - సమావేశాల బహిష్కరణ అని ఉంది. ఈ హెడ్ లైన్‌కింద 'కాంతి' ప్రతినిధి ఓ నివేదిక రాశాడు.

"నిజం పత్రికకు చెందిన శ్రీ నిఖిలేష్‌పై దాడిని జర్నలిస్టుల సంఘాలన్నీ నేడొక సంయుక్త సమావేశంలో ఖండించాయి. ఈ సంఘాలు ఒక సంయుక్త తీర్మానంలో అన్ని సమావేశాలను బహిష్కరించాలని నిర్ణయించాయి. మంత్రుల ప్రెస్ కాన్ఫరెన్స్‌లనూ, ఇతర అధికార అనధికార సభలనూ, ప్రభుత్వ కార్యక్రమాలను బహిష్కరించాలనీ, నల్ల బ్యాడ్జీలు ధరించాలనీ జర్నలిస్టుల సంఘాలు తీర్మానించాయి. అనంతరం జర్నలిస్టులు పెద్ద ఊరేగింపు జరిపారు. శ్రీ నిఖిలేష్‌పై దాడి చేసిన గూండాలను పోలీసులు అరెస్టు చేసే వరకూ ఈ బహిష్కరణ కార్యక్రమం కొనసాగుతుందని, ఈ రోజు నుంచే ఈ బహిష్కరణ కార్యక్రమం ఆరంభమయిందనీ, ఏ మంత్రుల సమావేశాలకూ విలేకరులు హాజరు కాలేదనీ అంటూ ఆ నివేదికలో ఇంకా భవిష్యత్ కార్యక్రమ నిర్ణయం గురించి రాసిఉంది.

ఆనాటి 'కాంతి' చదివిన పాఠకులు అనేక సందేహాలకు గురయ్యారు. మంత్రుల ప్రెస్ కాన్ఫరెన్స్‌లను విలేకరులు బహిష్కరించినపుడు హోంమంత్రి ప్రకటన ఎలా వచ్చింది?

పైగా విలేకరుల సమావేశంలో ఆ ప్రకటన చేశారని రాశారు. అదెలా?

ఓ పక్క బహిష్కరణ మరోపక్క సమావేశం?

విలేకరులు హాజరుకాకుండా విలేకరుల సమావేశాలు జరుగుతాయా?

ఏమిటీ రాతలు?

పాఠకులకు ఏమీ తెలియదనుకొని ఇలాంటి రిపోర్టులు రాస్తున్నారా?

ఛ...ఛ...ఏది నమ్మాలో...ఏది నమ్మకూడదో తెలియడంలేదు.

ప్రజలకు వాస్తవాలు అందించాల్సిన వార్తా పత్రికలు ఎందుకిలా తయారవుతున్నాయి? ఆ సామాన్య పాఠకుల ప్రశ్నలకు సమాధానం ఎవరు చెబుతారు?

సమయం పదిన్నర దాటుతోంది. ప్రపంచం ఆగిపోలేదు. ఎందుకు ఆగాలి.ఎవరి కోసం ఆగాలి? సాధారణంగా కిక్కిరిసి ఉండే రోడ్లు అలాగే ఉన్నాయి. రాష్ట్ర సచివాలయం గేట్లు ఎప్పటిలాగానే తెరిచారు.

సచివాలయంలోని ప్రెస్ రూంలో వివిధ పత్రి

కల, న్యూస్ ఏజెన్సీల ప్రతినిధులు రోజూ లాగే వచ్చారు.

అయితే ఆ రోజు ఎక్కువ మంది ఉన్నారు.

వారంతా గుంపులుగా విడిపోయి విడివిడి చర్చల్లో మునిగి పోయారు.

సోఫాలో ఇరుక్కొని కూర్చొని కొందరు.

టెలిఫోన్ పెట్టెల మీద, పక్కనున్న కుర్చీల్లో మరికొందరు.

దిన పత్రికలు పడిఉండే పెద్ద టేబుల్ చుట్టూ ఉన్న కుర్చీల్లో ఇంకొందరు.

నిలబడి ఓ గుంపు.

ప్రెస్ రూం తలుపుల దగ్గర మరొక గుంపు.

ప్రెస్ రూం మెట్ల మీద ఇంకొక గుంపు

ఆవేశంగా, వ్యంగ్యంగా, ఆలోచనాపరంగా, వాదోపవాదాల మధ్య సంభాషణలు సాగుతున్నాయి.

ప్రెస్ రూం మెట్లమీద చేరిన రిపోర్టర్లు జర్నలిస్టుల ఐక్యత గురించి చర్చిస్తున్నారు. సమావేశాలన్నిటినీ బహిష్కరించాలని సంఘాలు నిర్ణయిస్తే 'కాంతి' దిన పత్రికలో హోంమంత్రి ప్రకటన ఎలా వచ్చింది? ఆ ప్రెస్ కాన్ఫరెన్స్ ఎప్పుడు ఎలా జరిగింది?

ఆ కాన్ఫరెన్స్‌కి హాజరయిన వాళ్ళెవరు? రిపోర్టర్లు ఆలోచిస్తున్నారు.

'అదికాదుగురూ...ఒక నిర్ణయం తీసుకొన్నాక ఇదెలా జరిగింది? కొంత మంది ఇలా వాళ్ళిష్టం వచ్చినట్టు చేస్తే ఇక సంఘాలెందుకు? తీర్మానాలెందుకు?, ఓ ప్రతినిధి అన్నాడు.

"అదేనయ్యా ఆలోచిస్తున్నాను. నిన్న రాత్రి తొమ్మిదింటివరకు అంతా ప్రెస్ క్లబ్ దగ్గరే ఉన్నాం. హోం మంత్రి ప్రెస్ కాన్ఫరెన్స్‌కి ఎవర్ని ఎప్పుడు పిలిచారో అర్థం కావడంలేదు" తన అభిప్రాయాన్ని చెప్పారు మరొకరు.

"అలా ఎందుకు జరిగిందో ఆలోచించి బుర్ర పాడు చేసుకోవడంకంటె ఇప్పుడేం చెయ్యాలో ఆలోచించండి" ఓ జర్నలిస్ట్ సలహా ఇచ్చాడు.

"ముందు యూనిటీ గురించి ఆలోచించాలి. ఆ తర్వాతే భవిష్యత్తు కార్యక్రమం" గంభీరంగా అన్నాడు ఓ యువ జర్నలిస్ట్.

ప్రెస్ రూంలో వివిధ చర్చలు కొనసాగుతున్నాయి. గూండాలను పోలీసులు పట్టుకోలేకపోయారనే తాజా సమాచారం అందింది. అంతే! పోలీసుల అసమర్థతను రిపోర్టర్లు దుయ్యబట్టారు. పోలీసుల అండ లేకుండానే ఈ దారుణం జరిగిందా అనే అనుమానాన్ని కూడా వ్యక్తం చేస్తున్నారు.

"ఒక వ్యక్తిని అతి దారుణంగా నడిరోడ్డుమీద చావుదెబ్బలు కొడితే ఈ పోలీసులకు చీమ కుట్టినట్టుగా కూడా లేదు. తమకేంపట్టనట్టు ఊరుకొంటున్నారు. ఈ పోలీసు వ్యవస్థను ప్రక్షాళన చెయ్యాలి" ఆవేశంగా ఒకగొంతు అరుస్తోంది.

"పోలీస్ కమిషనర్ రాజీనామా చెయ్యాలి"

"పోలీస్ కమీషనరే కాదు గురూ డి.సి.పి. కూడా రాజీనామా చెయ్యాలి".

"పోలీసులు, పోలీసు అధికారులు ఏం చేస్తారయ్యా. ఇలాంటి ఘోరాలు జరిగినపుడు హోంమంత్రి రాజీనామా చెయ్యాలని డిమాండు చేస్తే బాగుంటుంది"

"హోం మంత్రి రాజీనామా చేస్తారా...భలే వారే! ఇంకా ముఖ్యమంత్రిని రాజీనామా ఇవ్వాలని డిమాండు చేశారుకాదు".

"ఏం తప్పా?".

"ఏదీ తప్పులేదు నాయనా! మనం ఏదైనా డిమాండు చెయ్యొచ్చు. తీర్చేవాడెవడు".

"ఏమయినా ఈ పోలీసులను క్షమించకూడదు. వాళ్ళు చేసే దారుణాలన్నీ ఏకిపారేసి నానా రభసా చెయ్యాలి".

"ఇదిగోగట్టిగా అరవకయ్యా! చాలాసేపట్నుంచి చూస్తున్నాను పోలీసులమీద విరుచుకు పడుతున్నావ్. వాళ్ళేం చేస్తారు? ఆ గూండాలకు ఎవరి అండ ఉందో ఎవరు వాళ్ళని కాపాడుతున్నారో మనకి తెలుసా?"

"అంటే ఎవరి అండయినా ఉంటే ఇలాంటి దారుణాలు చేసేవాళ్ళను వదిలి పెడతారా. నిన్న నిఖిలేష్. రేపు నేను. ఆ మర్నాడు మీరు, ఇలా జర్నలిస్టులు దాడులకు గురవ్వాలా?"

"అని ఎవరన్నారు. మనం అలాంటి గొడవల్లోకి పోతామా. మన పనేదో మనం చూసుకొని పోతే చాలదటయ్యా".

ప్రెస్‌రూంలోని సోఫాలో కూర్చొన్న ఓ ముసలాయన కునికిపాట్లనుంచి అకస్మాత్తుగా మేలుకొన్నాడు. "ఏవిటీ గొడవ" అని అరిచాడు.

"ఏంలేదుసార్. మీరు నిద్రపోండి" ఓ యువ రిపోర్టర్ వ్యంగ్యంగా అన్నాడు.

"ఏయ్ మిస్టర్ జాగ్రత్త. మాట్లాడేటపుడు ఎవరు... ఏమిటో తెలుసుకొని మసలుకో" ముసలాయన హెచ్చరించాడు.

యువరిపోర్టర్ మౌనంవహించాడు. అది గమనించిన ముసలాయనకు బి.పి. పెరిగిపోయింది. "నేను మూడు దశాబ్దాలుగా ఈ జర్నలిజంలో రిపోర్టర్‌గా ఉన్న వ్యక్తిని. నా అనుభవమంత లేదు నీ వయసు. నువ్వు నన్ను ఆటపట్టించాలని చూస్తావా? మీకు జర్నలిజం గురించి తెలియదు... ప్రెస్‌నోట్ లేకపోతే ఒక్కవార్తకూడా రాయలేరు. మీరంతా హేండౌట్ రిపోర్టర్లు. అసలు మిమ్మల్ని రిపోర్టర్లు అనడంకూడా దండుగే" ముసలాయన విరుచుకు పడటం సహించలేక ఆ యువరిపోర్టర్ తిరగబడ్డాడు.

"ఏమయినా మీలా మేము స్థాయి దిగజారలేము. పదిరూపాయలకు ప్రెస్‌నోట్ రాసిఇచ్చే మీకంటే మేము నయమే."

"నేను పదిరూపాయలకు ప్రెస్‌నోట్ రాసిఇస్తానా... ఇది నీకు చెప్పిన అడ్డగాడిద ఎవడు?"

"ఎన్నిసార్లు మీరీ ప్రెస్‌రూంలో రాజకీయ నాయకులకోసం ప్రెస్‌నోట్‌లు రాయలేదు" యువరిపోర్టర్ సవాలు చేశాడు.

"అదే... ఇలాగే ఉంటాయి మీ తెలివితేటలు. నాకు రాజకీయాల్లో ఉండే అనేకమంది స్నేహితులున్నారు. వాళ్ళకి సహాయంచేస్తే దానినికూడా అర్థంచేసుకోలేని నీలాంటి మందమతులు ఉండటంవల్లే ఇలాంటి గొడవలొస్తాయి" ముసలాయన గాండ్రించాడు.

"ఎలాంటి గొడవలండీ?"

"నీలాంటివాడే ఈ నిఖిలేష్‌కూడా. ఏదో రాసిపారేస్తే సరిపోతుందా! ఇష్టం వచ్చినట్లు రాశాడు. ఫలితం అనుభవించాడు. పైగా ఇపుడు విపరీతమైన పబ్లిసిటీ కొట్టేస్తున్నాడు" ముసలాయన నవ్వాడు.

"మీరు మరీ ఎక్కువగా మాట్లాడుతున్నారు. చావుబతుకులమధ్య మన వ్యక్తి, అందునా తోటి జర్నలిస్ట్ కొట్టుకుంటున్నాడనే జాలికూడా లేకుండా మీరు మాట్లాడుతున్నారు. మీలాంటి వాళ్ళు ఉండబట్టే జర్నలిజం రంగం ఇలా నీరసించిపోతోంది" యువకుడు ఆవేశంగా అన్నాడు.

'ఫో...ఫోవయ్యా. గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందట. నువ్వా నాకు చెప్పేది. ఎడ్యుకేషన్ మినిస్టర్‌నిపట్టి వాళ్ళకీ వీళ్ళకీ నాలుగుసీట్లు ఇప్పించుకొంటూ సొమ్ముచేసుకొనే నీ చరిత్ర ఎవడికి తెలియదు. నీలాంటి పైరవీకార్లవల్లే జర్నలిజం దెబ్బతింటోంది" ముసలాయన ఆరోపించాడు.

యువరిపోర్టర్ రెచ్చిపోయాడు. "నీకు వయసు పెరిగిందికానీ బుద్ధిపెరగలేదు. నాలుగు పెగ్గులు ఎవడు పోయిస్తాడాని రోజూ ఇన్విటేషన్లలో పార్టీలు వెతుక్కొనేవాడివి నువ్వా నన్ను అనేది. బీరుకి వార్త, దమ్ముకి వ్యాసం రాసి భజనచేసే నువ్వా మాట్లాడేది. ఏదో పెద్దవాడివికదాని మర్యాద ఇస్తోంటే ఓవర్ అవుతున్నావ్."

ఈ వాదాలు పెరగడంచూసి మరో రిపోర్టర్ జోక్యం చేసుకొన్నాడు. "ఎందుకొచ్చిన గొడవ. ఎవరిపనులు వాళ్ళు చేసుకొంటారు. ముందు మనం ఏంచెయ్యాలో ఆలోచించండి" ఇద్దరికీ చెప్పాడు.

"చూడవయ్యా ఈ ముసలాయన. నిఖిలేష్ చావుబ్రతుకులమధ్య ఉంటే పబ్లిసిటీ కొట్టేశాడని అంటున్నాడు. ఈయనకి అంతమోజయితే నలుగుర్ని పెట్టి కొట్టించుకోవచ్చుకదా. పనికిరాని మాటలు. రాసేది ఉండదు . రాసినా భజన వార్తలు. ఎవడేనా మంచివార్తలు రాస్తే ఏడుపు. అవతలివాడు దెబ్బతిని నలుగురి సానుభూతి సంపాదించుకొంటున్నాడన్నా ఏడుస్తాడు. ఈ ఏడుపుగాళ్ళు ఉన్నంతవరకూ జర్నలిజం రంగం బాగుపడదు. "యువ రిపోర్టర్ స్టేట్‌మెంట్ ఇచ్చినట్లుగా అన్నాడు.'

"ఏడిశావులే. ఈరోజుల్లో మంచివార్తలు రాసేవాడెవడు? ఒకవేళ రాసినా అది నువ్వుకాదుగా. నిఖిలేష్ ఇష్యూని భుజానవేసుకొని పబ్లిసిటీ కొట్టాలని చూస్తున్నావ్. పైగా నేనురాసే వార్తలగురించి మాట్లాడుతున్నావ్. నేను రిపోర్టులు రాయడం మొదలుపెట్టేనాటికి నువ్వీ భూమ్మీదే




లేవు. మేము ఇలాంటివి చాలా చూశాం.''

ముసలాయన వాగ్ధాటికి అడ్డంలేకుండా పోతోంది.

ఈలోగా ప్రెస్‌రూంలో సంచలనం రేగింది. ఎవరో ప్రతిపక్షానికి చెందిన నాయకుడు అక్కడికి వచ్చాడు. రిపోర్టర్లు ఆ నాయకుడిచుట్టూ చేరారు. ఈ ముసలాయన మటుకు సోఫాలోనే కూర్చొన్నాడు. ఆ నాయకుడు అందర్నీ పలకరించి సోఫాలో కూర్చొన్న ముసలాయనను పేరుపెట్టి పిలిచాడు.

"ఆఁ... ఏవిటీ...?'' ముసలాయన దర్పంగా పలికాడు.

"ఏంలేదు గురూగారూ. పాపం ఆ కుర్రాడిమీద దాడిజరిగిందికదా. అందుకే ఓ స్టేట్‌మెంట్ ఇవ్వడానికి వచ్చాను'' నాయకుడు చెప్పాడు.

"సర్లేవయ్యా... ఆ దాడిని ఖండించడానికా... ప్రభుత్వాన్ని దుయ్యబట్టడానికా... నువ్వెందుకొచ్చావో నాకు తెలుసులే... చెప్పు'' ముసలాయన చెయ్యి ఊపాడు.

"మీరే అలాఅంటే ఎలా? కురువృద్ధులు... జర్నలిజం రంగానికే పితామహులు మీరేమయినా అంచనా వెయ్యగలరు.''

నాయకుని పొగడ్తకు ముసలాయన సోఫాలోంచి చివాలున లేచాడు

"నీపాటి అవగాహన జర్నలిస్టులమని ఫోజులుపెట్టి తిరిగేవాళ్ళకి లేదయ్యా... సరేకానీ'' అన్నాడు.

ఆ నాయకుడు కాగితం తీశాడు. అందరూ రాసుకోడానికి రడీగా ఉన్నారా? లేరా? అని పరికించుకొన్నాడు.

"నిఖిలేష్ అనే జర్నలిస్టుమీద దాడి జరగడం శోచనీయం. ఈ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత ఎన్నోదాడులు, దారుణాలు జరిగాయి. మారణకాండలు మామూలయిపోయాయి. స్త్రీలపై అత్యాచారాలు నిత్యకృత్యాలయ్యాయి. దోపిడీలు... దొంగతనాలు సర్వసాధారణమయ్యాయి. పోలీసు వ్యవస్థ నిస్సహాయంగా మారిపోయింది. పాలకులు ఎన్ని దారుణాలు జరిగినా సిగ్గూ, ఎగ్గూ లేకుండా శాంతిభద్రతల పరిస్థితి అదుపులో ఉందని చెప్పుకొంటున్నారు. ఇది రాజ్యమా? ఇది పాలనా? ప్రజాస్వామ్య దేశంలో ప్రజాస్వామ్య పరిరక్షకులైన జర్నలిస్టులమీద దాడులు జరగడం విచారకరం.. అవమానకరం. ఒక జర్నలిస్ట్‌ను దారుణంగా.. అమానుషంగా గూండాలు కొడితే ఈ ప్రభుత్వం ఏంచేస్తోంది. ఇది ప్రభుత్వ అసమర్థతకాదా అని నేను అడుగుతున్నాను. ఈ అసమర్థ ప్రభుత్వం ఎన్నాళ్ళు? దీనికి ప్రభుత్వమే పూర్తిగా బాధ్యతవహించాలి. ఈ దారుణం తన పాలనలో జరిగినందుకు రాష్ట్ర ముఖ్యమంత్రి రాజీనామా చెయ్యాలి.''

ఆ నాయకుడు ఆగాడు.

"ఏవండీ మీరేమంటారు. ముఖ్యమంత్రిని రాజీనామా చెయ్యాలని డిమాండు చెయ్యడం! ఆలోచించండి... ఏవిటీ...'' అంటూ ఇద్దరు ముగ్గురు సీనియర్ రిపోర్టర్లతో ఆ నాయకుడు గుసగుసలుమొదలు పెట్టాడు. ఆపైన "ఎందుకులెండి.. ప్రభుత్వ వైఫల్యం అనండి చాలు'' అన్నాడు.

"ఇది సరేగాని... ఒక విషయం సూటిగా అడుగుతా చెప్పు'' ముసలాయన అందుకొన్నాడు.

"ఏవిటీ...?''

"నువ్వు నీ పబ్లిసిటీకోసం ఈ స్టేట్‌మెంట్ ఇస్తున్నావని నేనంటా.. ఏవంటావు...'' ముసలాయన ఆ నాయకుణ్ని నిలదీశాడు.

"అయ్యా రోజూ చాలామందిమీద దాడులు జరుగుతున్నాయి. అవన్నీ ఇంత ప్రముఖంగా పత్రికల్లో చోటుచేసుకోవడంలేదు. మరి మీరు ఈ రిపోర్టర్‌మీద జరిగిన దాడిని ఎందుకింత హైలైట్ చేస్తున్నారు?'' ఆ నాయకుడు రాజకీయం నడిపించాడు.

"మేము హైలైట్ చేశాం సరే. నువ్వెందుకు ఇంత శ్రద్ధతీసుకొని ప్రెస్‌రూంకివచ్చి స్టేట్‌మెంట్ ఇస్తున్నావు?'' ముసలాయన ఆ నాయకుణ్ని వదలలేదు.

"మహానుభావా నీకో నమస్కారం. నేను పిలిస్తే రానంటారో... వస్తారో తెలీదు. ఒకవేళ మీరువస్తే డిన్నరివ్వాలో, కాక్‌టైల్ ఇవ్వాలో అర్థంకాదు. అవి ఇస్తే ఒకతంటా. ఇవ్వకుంటే మరొకతంటా. ఇప్పుడు మిమ్మల్ని వెదుక్కొంటూ నేనేవచ్చి స్టేట్‌మెంట్ ఇచ్చినా తప్పేఅంటే ఏంచెయ్యాలి'' ఆ



నాయకుడు చేతులు జోడించి అందరివైపూ చూశాడు. చాలామంది నవ్వేశారు.

అయనతో ఎందుకులెండిసార్. ఈ ఇష్యూ వచ్చే అసెంబ్లీలో మీరు గట్టిగా తీసుకోవాలి'' సూచించాడో రిపోర్టర్.

"ఇదే మొదటి ఇష్యూకదండీ. చూడండి ఈ ప్రభుత్వాన్ని ఈ సంఘటనతో ఎలా షేక్‌చేస్తానో' ఆ నాయకుడు ఆవేశం కక్కాడు.

ఆయన నిష్క్రమించగానే మళ్ళీ ఎవరి చర్చల్లో వాళ్ళు పడిపోయారు. జర్నలిస్టులు 'కాంతి' దినపత్రిక గురించి చర్చలు సాగిస్తున్నారు. తీవ్రమైన ఆరోపణలు వాదోపవాదాలు చెలరేగాయి. ఈ ఉద్రిక్త వాతావరణంలో జర్నలిస్టులకు చెందిన ఒక సంఘం నాయకుడు ప్రెస్‌రూంలోకి ప్రవేశించాడు. అక్కడున్న ప్రతినిధులను సమావేశపరచాడు. వాళ్ళని ఉద్దేశిస్తూ ఆ నాయకుని ప్రసంగం మొదలయింది.

"మిత్రులారా... జర్నలిస్టుల ఐకమత్యాన్ని చాటిచెప్పే అవకాశం వచ్చినపుడు మనం ఏకంకావాలి. కానీ మనలో కొందరు మన సమైక్యతను కావాలని దెబ్బతీస్తున్నారు. ఇది చాలా దారుణం...''

అని ఆ నాయకుడు మాట్లాడుతుండగానే ఓ

సీనియర్ అతన్ని అడ్డుకొన్నాడు.

"ఎవరా కొందరు? నువ్వు సూటిగా ఆ వ్యక్తుల గురించి మాట్లాడు" అంటూ నిలదీశాడు.

"చెబుతా... కానీ ఒక్కవిషయం. నిన్నటిదాకా నిఖిలేష్‌మీద జరిగిన దాడిగురించి ఆలోచించాం. ఇపుడు మనం ఏంచేస్తున్నాం. మన నిర్ణయాలకు మనం కట్టుబడి ఉంటున్నామా? ఈ రోజు కొన్ని దినపత్రికలుచూస్తే మనలో కొందరు యూనియన్స్ చేసిన నిర్ణయాలకు కట్టుబడి ఉండటంలేదనేది నిజం. ఎందుకీ పరిస్థితి ఏర్పడుతోంది?"

ఆ నాయకుడు అందరివైపూ చూస్తున్నాడు.

'కాంతి' ప్రస్తావనను ఎవరో తీసుకువచ్చారు.

"మంత్రుల ప్రెస్‌కాన్ఫరెన్సులు బహిష్కరించాలని యూనియన్స్ తీర్మానించినా హోంమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్స్‌కి హాజరయిన రిపోర్టర్లు ఎవరు? ఆ సమావేశం ఎక్కడ జరిగింది?" ఒక రిపోర్టర్ సూటిగా అడిగాడు.

వెంటనే ఒక సీనియర్ పొలిటికల్ రిపోర్టర్ "నువ్వుండు" అంటూలేచి "ఆ పత్రిక గురించి మనమెందుకు మాట్లాడాలి? మనం ఇక్కడికి వచ్చింది భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయించడానికి. మధ్యలో పత్రికల ప్రస్తావన ఎందుకు తీసుకువస్తున్నారు" అన్నాడు.

"ఏమిటండీ పత్రికల ప్రస్తావన ఎందుకు తీసుకురాకూడదు. నిఖిలేష్ చావుబ్రతుకుల్లో ఉన్నాడు. పోలీసులు ఇంతవరకూ ఎవరినీ అరెస్టుచెయ్యలేదు. మంత్రుల సమావేశాలూ... ప్రెస్ కాన్ఫరెన్సులూ బహిష్కరించాలని మనమంతా తీర్మానాలు చేశాం. అయినా ఈ రోజు 'కాంతి' పేపర్లో మొదటిపేజీలో తాటికాయంత అక్షరాలతో హోంమంత్రి ప్రకటనవేసి పైగా అది విలేకరుల సమావేశంలో అన్నారనిరాస్తే ఆ విషయం వదిలిపెట్టాలా? దీనికంతటికీ మూలకారణం ఆ హోంమంత్రేకదండీ" ఒక జూనియర్ రిపోర్టర్ అరిచాడు.

సర్రున మరోసీనియర్ రిపోర్టర్ ఉద్రేకపడుతూ జూనియర్‌ని ఎదుర్కొన్నాడు. "ముందు నీ మాటలు విత్‌డ్రాచేసుకో... నిఖిలేష్‌పై దాడికి మూలకారణం హోంమంత్రి అనడానికి నీ దగ్గర ఆధారాలు ఉన్నాయా?.. ఇదిగో ఇలాంటి తొందరపాటు మాటలే మాట్లాడతారు. ఆధారాలులేకుండా ఏదనుకొంటే అది రాసిపారేస్తారు. ఇష్టంవచ్చినట్లురాస్తే ఎవరూరుకుంటారు?" అన్నాడు.

"నేను నిఖిలేష్‌మీద దాడివిషయంలో మూలకారకుడు హోంమంత్రి అనలేదు. ప్రెస్‌కాన్ఫరెన్స్‌కి మనవాళ్ళని పిలిపించుకోవడం గురించి అన్నాను. మీరు మీ ఇష్టంవచ్చినట్లు ఊహించుకొంటున్నారు. ఇదంతాచూస్తే ఇప్పుడు అనుమానం వస్తోంది ఈ దాడికీ, హోంమంత్రికీ సంబంధం ఉందాని?"

"ఏయ్... ఏంమాటలయ్యా... ఊరుకో. ముందు మనం ఏంచెయ్యాలో ఆలోచించండి. అనవసరంగా టైమ్ వేస్టుచెయ్యకండి" జర్నలిస్టుల సంఘం నాయకుడు సూచించాడు.

ఆ సూచనను తిరస్కరిస్తూ అంతవరకూ మౌనంగా ఉన్న ఒక జర్నలిస్ట్ "ప్రస్తుతం మనం అత్యవసరంగా చెయ్యాల్సిన పని ఒక్కటే" అని గంభీరంగా అంటూ అందర్నీ తనవైపు తిప్పుకొన్నాడు.

"ఏవిటీ ?? ? ? ?? ?"

అందరూ ఒకేసారి ప్రశ్నించారు.

"నిన్నరాత్రి హోంమినిస్టర్‌తో లాలూచీ పడిన వాళ్ళని గుర్తుపట్టి జర్నలిస్టుల సంఘంనుంచి వాళ్ళను బహిష్కరణ చెయ్యాలి."

"దానివల్ల ప్రయోజనం"

"ఈ చర్చలకి అంతం. భవిష్యత్తు కార్యక్రమ ఆలోచనలకు ఆరంభం."

"వాళ్ళనెలా గుర్తుపట్టాలి?"

"వాళ్ళెవరో మనకు తెలియదా... అన్నీ తెలుసుండీ ముసుగులో గుద్దులాడుతున్నాం. వాళ్ళని మనం ఏమీ చెయ్యలేం. ఎందుకంటే కూకటివేళ్ళతో ఈ రంగంలో వాళ్ళు పాతుకుపోయారు. సమర్థులైన జర్నలిస్టులు ఎందరు వచ్చినా వాళ్ళ నీతిసారాన్ని ఈ వేళ్ళు పీల్చేస్తున్నాయి... పిప్పిచేస్తున్నాయి. రాజకీయనాయకులూ అధికారంలోఉన్న పెద్దలూ ఎందుకు మనల్ని గౌరవిస్తారో తెలుసా. మన తెలివితేటలు.. మన అపూర్వమైన రాతలు చూసికాదు. మన పత్రికల్లో వారిమాటలు చక్కదనాన్ని పేర్చుకొని, పేరుచేర్చుకొని పడతాయి. అందుకే వాళ్ళు మనల్ని వదలరు.

వాళ్ళతోటే లోకమనుకొంటూ... వాళ్ళపరిచయాలు పెంచుకోవడమే గొప్పగా గర్వంగా భావించు కొంటూ మనం భుజాలు ఎగరేసుకొంటున్నాం. ఈ ఎగురుపాటుచూసి వాళ్ళు అపుడపుడు పార్టీలు పారేస్తున్నారు. ఆ నాయకుల కబంధహస్తాల్లో ప్రజలు చిక్కుకొన్నారని నమ్మకంగారాసే అమాయకులం మనం. మన అమాయకత్వంమీద పబ్లిసిటీ తెచ్చుకొనే నాయకులు వాళ్ళు. నిజానికి హోంమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్స్ ఏర్పాటు చేయలేదు. కానీ ఇక్కడున్న పెద్దల్లో కొందరు నిన్న హోంమంత్రి ప్రయివేటుగా ఏర్పాటుచేసిన మందుసమావేశంలో పాల్గొన్నారనేది నిజం. ఆ పెద్దలు నోరువిప్పి నిజం పలకరు. ఒకవేళ నోరువిప్పినా అన్నీ నీతిసూత్రాలే. అందుకే ఈ చర్చలకి అంతం ఉండదు.''

ఆ యువకుడు గంభీరంగా మాట్లాడుతోంటే కొంతసేపు నివ్వెరపోయిన సీనియర్ జర్నలిస్టులు కొందరు వెంటనే తేరుకొని తాము వాకౌట్ చేస్తున్నట్లు ప్రకటించారు.

''కొత్తగా జర్నలిజం రంగంలో ప్రవేశించి జర్నలిజంఅంటే ఏమిటోకూడా తెలియని ఒక అనామకుడు, అందునా రిపోర్టింగ్‌లోకూడా జూనియర్‌గా పిలువబడే ఒక వ్యక్తి, సచివాలయంలోని ప్రెస్‌రూంలో జరుగుతున్న సమావేశంలో సీనియర్లను అనుమానిస్తాడా? నో.. నో వాడ్ని సస్పెండ్ చెయ్యండి. వాడు యూనియన్ సభ్యుడుకాకపోయినాసరే మనమే వాడ్ని సామూహికంగా బహిష్కరించాలి-'' అంటూ సీనియర్లు ఉరిమారు.

కొంతమంది వాకౌట్. కొందరు పనుల హడావిడి. అలా అలా ఆ సమావేశం నుంచి జనం జారుకొన్నారు. మిగిలినవాళ్ళు అరుచుకొన్నారు. ఆవేశంగా ప్రసంగించారు.

★ ★ ★

''చూడు పరమహంసా ఈసారికి ఇలా కానిద్దూ''

''లేదుసార్... నేను ఒక్కడ్నీకాదు. నాతోపాటు అయిదారుగురు ఉన్నారు. వాళ్ళందర్నీ సముదాయించాలంటే ఇది కుదరదు...'' పరమహంస వినయంగా అంటున్నాడు.

''అదేమిటయ్యా... సీనియర్ జర్నలిస్టువి నీ మాట కాదనే ధైర్యం ఎవరికి ఉంటుంది?''

''ఆ రోజులు పోయాయిసార్. ఇప్పుడు చీఫ్‌లు ఎక్కువయ్యారు. వాళ్ళని సర్దితేకానీ ఈ గొడవ సద్దుమణగదు'' పరమహంస లాలించాడు.

''ఇంకా ఎంత కావాలంటావ్?''

''ఓ ఇరవై''

''పదితో సర్దుకోరాదు''

''నా వల్లకాదు. మరెవర్నయినా మీరే పిల్చి చూడండి'' పరమహంస వాలకం గమనించి, ఎదురుతిరిగే లోపున ''సరే''నని ఒప్పుకొన్నాడు మాణిక్యరావు.

మాణిక్యరావు సమాచారశాఖ మంత్రికి స్వయానా బావమరిది. ముఖ్యమంత్రిగారు ఆ రోజు ఉదయమే సమాచారశాఖ మంత్రిని పిలిచి ప్రెస్‌కాన్ఫరెన్స్ ఏర్పాటు చెయ్యమన్నారు.

రిపోర్టర్లు రామని భీష్మించారు.

దాంతో మాణిక్యరావుని రంగంలోకి దింపక తప్పలేదు మంత్రిగారికి.

మాణిక్యరావు రంగంలోకి దిగుతూనే పరమహంస వాసన కనిపెట్టాడు.

గేలం వేసిలాగాడు.

పరమహంస జర్నలిస్టుల్లో జర్నలిస్ట్. ఏ జర్నలిస్టుకి ఏ బలహీనతఉందో ఖచ్చితంగా కనిపెట్టగలడు. చిన్నా పెద్దా రిపోర్టర్ల సంబంధాలు.. పరిచయాలు- పైరవీలు అన్నీ వివరించగలడు. అందుకే పరమహంస అంటే మిగతావాళ్ళు ఆప్యాయత నటిస్తూ భయభక్తులున్నట్లు ప్రవర్తిస్తారు. ఈ జనం ఎప్పుడైనా తనని దెబ్బతియ్యగలరనే భయంతో తనూ అప్రమత్తంగానే ఉంటాడు పరమహంస.

ముఖ్యమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్స్‌కి వెళ్ళాలా? వద్దా?

వాదోపవాదాలు నడుస్తున్నాయి. తీవ్రస్థాయిలో చర్చలు సాగుతున్నాయి. బహిష్కరించాలని అరిచేవాళ్ళు అరుస్తున్నారు. సిన్సియర్‌గా నిఖిలేష్ విషయాన్ని మాట్లాడుతూ బహిష్కరణ సాగాలి అనేవర్గం మెల్లగా వలచబడుతోంది. అప్పుడే కొందరు ప్రెస్ రూం గడపదాటడానికి ఆయత్తమవుతున్నారు.

ముఖ్యమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్సు సమయం

సమీపిస్తోంది.

పరమహంస నోరువిప్పాడు.

చాలామంది నోళ్ళు మూతపడ్డాయి.

"ఈ పరిస్థితుల్లో మనం ఒక్కవిషయం మర్చి పోకూడదు. ముఖ్యమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్స్‌ని బహిష్కరించినందువల్ల మన లక్ష్యం నెరవేరుతుందా! ఆలోచించండి. రాష్ట్ర ప్రజలందరికీ ప్రభుత్వపరంగా ఏదిచెయ్యాలన్నా నిర్ణయించేది రాష్ట్ర ముఖ్యమంత్రి. ఏ సమస్య ఎదురైనా పరిష్కరించే బాధ్యత ముఖ్యమంత్రిమీద ఉంటుంది. ఈ ప్రెస్ కాన్ఫరెన్స్ బహిష్కరించడం మంచిదికాదు. మనం ఈ సమావేశానికి వెళ్ళాలి. అసలు ఆయన ఏం చెబుతాడో విందాం. ఆపైన అక్కడే నిర్ణయాలు చేసుకోవచ్చు" అన్నాడు పరమహంస.

"అలా వీల్లేదు పరమహంసగారూ. ఒక నిర్ణయం చేసింతర్వాత దానికి కట్టుబడి ఉండాలి. అంతేగాని ఇలా నీరుకారిపోవడం మా వల్లకాదు. మీలాంటివాళ్ళు ఏంచేసినా మా కనవసరం" జర్నలిస్టుల సంఘం నాయకుడు స్పష్టంచేశాడు.

"మీరుపట్టిన కుందేలుకి మూడుకాళ్ళే అని వాదిస్తారు. మూర్ఖంగా ఆలోచిస్తే ఎవడూ ఏమీ చెయ్యలేడు" పరమహంస విసుక్కొన్నాడు.

"మీరు అనవసరంగా మూర్ఖంగా అంటున్నారు. మేము అనదలుచుకొంటే చాలా ఉన్నాయి" నాయకుడు బెదిరించాడు.

"ఏవిటీ.. ఏమి అనగలవ్... అనవయ్యా.. అను" పరమహంస రెచ్చగొట్టాడు.

"మీలో కొందరు లాలూచీపడ్డారనీ, మంత్రులతో కలిసి ఈ ఉద్యమాన్ని దెబ్బతీస్తున్నారనీ నేను ఖచ్చితంగా చెప్పగలను" నాయకుడు విమర్శాబాణం సంధించాడు.

"ఛ... మీరింతలా దిగజారతారని నేను అనుకోలేదు. చూడండయ్యా ఈ నాయకుడు మనల్ని అనుమానిస్తున్నాడు. మనం లాలూచీ పడ్డామట మంత్రులతో కలిసి. ఈ ఉద్యమాన్ని దెబ్బతీస్తున్నామట. ఇదేమయినా మహోద్యమమా. వీళ్ళకి చెప్పినా అర్థంకాదు. పత్రికలు, పాత్రికేయులు ప్రజలకు సమాచారాన్ని సకాలంలో అందించే బాధ్యత తీసుకోవాలి. అందుకే పత్రికలున్నాయి. మనమున్నాం. ఎవడు ఏమనుకొన్నా నేను ప్రజలకు ముఖ్యమంత్రి ఇచ్చే సమాచారాన్ని సేకరించడానికి వెళ్ళుతున్నాను. నా బాధ్యత... కర్తవ్యం నిర్వర్తించడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. బాధ్యతకలిగిన వారెవరయినా నాతో రావచ్చు" అంటూ పరమహంస కదిలాడు.

పరమహంసవెంట కొందరు రిపోర్టర్లు ముఖ్యమంత్రి సమావేశపుగదిలోకి ప్రవేశించారు.

అంతవరకూ "మనకెందుకులే" అని తటస్థంగాఉన్న కొంతమంది పత్రికా ప్రతినిధులు పరమహంసని అనుసరించారు.

ప్రెస్‌రూంలో మిగిలిపోయిన రిపోర్టర్లు ఆవేశంగా పరమహంసని దుయ్యబట్టారు. అసహ్యించుకొన్నారు.. ఏంచెయ్యాలనే విషయంలో చర్చలుసాగించి గంటపైగా ఏదీ నిర్ణయించలేక ఏదిచేస్తే ఏమవుతుందోఅనే ఆలోచనలోపడ్డారు. ఎటూకదలలేక ముఖ్యమంత్రి ప్రెస్‌కాన్ఫరెన్సు మిస్సయ్యారు.

ఇంత జరుగుతున్నా ప్రపంచం మామూలుగానేఉంది. పత్రికలు వెలువడుతూనే ఉన్నాయి. ప్రధాన శీర్షికలు కనపడుతూనే ఉన్నాయి. మంత్రుల.. నాయకుల... పెద్దల ప్రకటనలపరంపరలు విలేకరుల సమావేశాల్లో పొంగుతూనే ఉన్నాయి.

నిజాలను నినదించిన నిఖిలేష్ మాత్రం కొనఊపిరితోనే తెలియని మృత్యువుతో పోరాడుతూనే ఉన్నాడు. ఆ నిజాలే అతనికి అండగా మిగిలాయి. నిజం అక్కర్లేని ప్రపంచం మాత్రం నిద్రపోతోంది.

★★★

[ఈ నవలలోని అంశాలు ప్రత్యేకించి ఏ ఒక్కరినీ ఉద్దేశించినవికావు. భారత జర్నలిజం రంగంలో వస్తున్న అనూహ్యమైన మార్పులను ఆసరాగా తీసుకొని కొన్ని దుష్టశక్తులు జర్నలిస్టుల వృత్తిధర్మాన్ని కాలరాసి స్వార్థపు జెండా ఎగురవేస్తున్నాయి. ఆ దుష్టశక్తులు సాగించే అరాచకాలను ఖండించడమే లక్ష్యంగా కొన్ని సంఘటనలను పేర్కొనడం జరిగింది.]



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. "**చతుర సమీక్ష**" శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆనవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు :

1. '**చతుర సమీక్ష**' కు పంపే మీ రచన అరఠావుకుమించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈకింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై "**చతుర సమీక్ష**" కు అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపికచేసిన మూడింటిని ప్రచురించి రు. 100, రు. 75, రు. 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం.

ఇక విరివిగా పాల్గొని ఈ శీర్షికలో బహుమతులు అందుకొనేవంతు పాఠకులదే!

---

## కూపన్

జనవరి 'చతుర' నవల: నిజం

సమీక్షకుని పేరు ..............................................

చిరునామా ..............................................

..............................................

..............................................

ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''ఈనాడు భాషాస్వరూపం''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలనీ ఆశించే వారందరికీ ఉపయోగపడుతుంది.

వెల రు. **25.00**

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

**ప్రతులకు:**

ఉషోదయా పబ్లికేషన్స్
ప్రయివేట్ లిమిటెడ్
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,
హైదరాబాద్ – 500 004.




విప్పారిన కళ్లలో విస్మయం
చిరుహాసంలో చిలిపితనం
ఏమిటో అసలు విషయం

ఫొటో: సి. వి. సుబ్రహ్మణ్యం

ఫొటోఫీచర్ వ్యాఖ్యలు: స్వర్ణలత



చేరువనే ప్రాణాధార జీవధార ఫొటో: కె.వి. శ్రీహరి
అయినా చిగురించదీ మోడుబతుకు



చూపులో వెలుగుల ఆశలు
ఒడిలో పండిన కలలు

ఫొటో: అమితేష్‌బెనర్జీ



వలపు తలపుతో వాలిన కళ్లు
కన్నె కలల లోకాలకు లోగిళ్లు

ఫొటో: ఫణికుమార్



క్షణానికో సౌరభం
ఘడియకో మకరందం
అదే స్వేచ్ఛా సంరంభం

ఫొటో: ఎల్.ఆర్. గ్రోవర్



ఉషోదయపు వెలుగు
బతుకు బాటన పరుగు

ఫొటో: కె.వి. శ్రీహరి



శ్రావ్యమైన సంగీతాన్నిస్తోంది ప్రకృతి
నాగరికత పలుకుతోంది అపశృతి

ఫొటో: కె.వి. శ్రీహరి



కలిమి లేములు పంచుకొన్న జంట
చమటోడ్చి పండించుకొన్న పంట

ఫొటో: ఫణికుమార్



బీడువారిన చేనుమధ్య
దారితోచని బతుకుబండి

ఫొటో: కె. భవానీశంకర్



స్వేచ్ఛా విహంగాలే నయం క్రమశిక్షణలో
సంఘజీవులం మనకది లేదెందుకో

ఫొటో: కె.వి. శ్రీహరి

# చతుర కతలు

## పొరపాటు

**కొత్త**గా పెళ్ళి చేసుకొన్న సూర్యారావు భార్యతో సహా హనీమూన్‌కెళ్ళాడు.

నగరంలోని ఖరీదయిన హొటల్లో బసచేశారా జంట. అందమయిన భార్య! చేతినిండా డబ్బు! చూస్తేనే మత్తెక్కించే మరింత అందమయిన ప్రకృతి! ప్రపంచంలోని ఆనందమంతా తమ కోసమే ఉన్నట్లు అనుభూతి చెందిందా జంట. ఓ రోజు 'జూ'' చూశారు.

మరో రోజు గండిపేటకెళ్ళారు.

సాలార్‌జంగ్ మ్యూజియం, బిర్లామందిరం, ప్లానెటోరియం, అసెంబ్లీ, టాంక్‌బాండ్, గోల్కొండ ఇలా సిటీలో చూడదగ్గ ప్రదేశాలన్నీ చూశారు.

ఆఖర్న తమ ఊరు బయల్దేరే రోజున పబ్లిక్‌గార్డెన్‌కెళ్ళారు.

నిర్జనంగా ఉన్న ఓ ప్రదేశంలో భార్య వళ్ళో తలపెట్టుకొని పడుకొన్నాడు సూర్యారావు. అటుగా వచ్చిన మల్లెపూలవాడి దగ్గర ఓ మూరదండకొని స్వయంగా భార్య తలలో తురిమి చిలిపిగా చూశాడు.

సిగ్గుపడింది. భార్య.

కొంచెంసేపయాక ఓ అర్ధరూపాయి వేరుశెనక్కాయలు కొని నమలసాగారు భార్యా, భర్తలు.

శెనక్కాయలు నముల్తూ యధాలాపంగా ఎదుట ఉన్న బెంచీ వైపు చూసిన సూర్యారావుకి అక్కడ కూర్చొని ఉన్న రాజు కనిపించాడు. అప్పటికప్పుడే ఓ చిలిపి ఆలోచన అతడి బుర్రలో మెరిసింది.

వెంటనే భార్యని చేయిపట్టి లేపుతూ ''ఇప్పుడు నీకు బ్రహ్మాండమయిన వినోదం ఏర్పాటు చేస్తున్నాను. మాట్లాడకుండా చూస్తూండు!'' అంటూ రాజు వద్దకు దూసుకుపోయాడు.

''ఒరేయ్ రాజూ! హైదరాబాదు కెప్పుడొచ్చావు? అవునూ! ఆ వళ్ళేమిట్రా పిప్పళ్ళ బస్తాలా పెంచేసావ్....దేశంలోని కరవుకంతటికీ నీలాటి పందికొక్కులే కారణం... దరిద్రుడా! మీ బాబు సంపాదించినదంతా యిలా మింగుతూ ఉంటే యిక నీ పిల్లలకేం మిగులుస్తావ్ చెప్పు? అన్నట్లు నీకు పెళ్ళయిందా? అయినా చూస్తూ, చూస్తూ నీలాటి సోమరిపోతు వెధవకెవడిస్తాడు పిల్లని... ఏం, అలా మిడిగుడ్లేసుకొని చూస్తావేంరా? దున్నపోతూ... నాకేమన్నా భయమనుకొన్నావా? నీలాటి నలుగుర్ని మట్టి కరిపించేస్తాను...!!''

సూర్యారావు మాటలకు అడ్డువస్తూ చెప్పాడా వ్యక్తి ''బ్రహ్మ చెముడున్న మా సుబ్బరాజు అన్నయ్యనుకొని మీరిందాకట్నుండి ఏదేదో మాట్లాడుతున్నట్టున్నారు. నాపేరు కామరాజు. మేమిద్దరం కవలలం!''

కాలర్ సర్దుకొని చొక్కాచేతులు మడిచి తన భర్త మీది కొస్తున్న ఆ భారీకాయుడ్ని చూస్తూ స్పృహతప్పి పడిపోయింది సూర్యారావు భార్య.






# నమ్మకం

**తె**లుగు చలన చిత్రసీమలో మూర్తిగారికి మంచి దర్శకుడన్న పేరుంది.

ఆయన దర్శకత్వం వహించిన ఎన్నో చిత్రాలు పండిత పామరుల్ని ఒకేలా రంజింపచేయటమే కాక ఆ చిత్రాల నిర్మాతలకు కనకవర్షాన్ని కురి పించాయి.

అలాంటి సమయంలో తాతతండ్రులు పొగాకు వ్యాపారం చేసి సంపాదించిన లక్షల ఆస్తిని కోట్లలోకి మార్చాలంటే సినిమాలు తీయడమొక్కటే మార్గమని కనకారావుకి నూరిపోశారు స్నేహితులు.

అందుకని స్థిర చరాస్తులన్నీ బేరం పెట్టి చేతికందిన డబ్బుతో మద్రాసు రైలెక్కాడు కనకారావు.

మద్రాసు రాగానే రెండు తమిళ చిత్రాల హక్కులుకొని తెలుగులోకి డబ్బింగ్ చేయించి ఆంధ్ర దేశం మీదకు వదిలాడు.

పెట్టుబడిపోనూ ఐదారులక్షల లాభం కళ్ళచూశాడు కనకారావు.

తనమీద తనకి కొంత నమ్మకం కలిగిందతడికి. దాంతో ఓ తెలుగు సినిమా నిర్మించాలనుకొన్నాడు.

అనుకొన్నదే తడవుగా మూర్తిని కలిసి తన అభిలాష తెలియజేశాడు. ముందు కథ, మాటలు సమకూర్చుకొని, నటీనటవర్గం, మిగతా టెక్నీషియన్లని మాట్లాడుకొని తన దగ్గరకు రమ్మన్నాడు మూర్తి.

ఓ నెల తరువాత మూర్తి చెప్పినట్లుగానే అన్నీ చేసి అతడ్ని కలిశాడు కనకారావ్.

కనకారావ్ ఇచ్చిన స్క్రిప్టు చదవగానే చిరాకుగా ముఖం పెట్టి,

"ఫస్ట్ సీన్లో హీరోయిన్‌ను అత్తగారు తొలిసారి ఇంట్లోకి ఆహ్వానిస్తూ హారతి పడుతుందని వ్రాసారు. నా చిత్రాల్లో అలాటిపిచ్చి ఆచారాలు ఉండకూడదు!" అన్నాడు.

"దాందేముంది? ఆ షాట్ తొలగించేద్దాం!" అన్నాడు కనకారావ్.

"మరో షాట్‌లో హీరోకి జ్వరం తగ్గాలని హీరోయిన్ గుళ్ళో దేముడి ముందు ప్రార్థన చేస్తుందని ఉన్న సన్నివేశం కూడా తొలగించాలి. అలాంటి ఆస్తిక భావాలకు నేను వ్యతిరేకిని!"

దానిక్కూడా వప్పుకొన్నాడు కనకారావ్.

"మరో షాట్‌లో దేవతలకు బలులిచ్చే సీన్ ఉండకూడదు! హింసను నేను ఖండిస్తాను!" మౌనంగా తలూపాడు కనకారావ్.

"అయితే పదండి! పాండీ బజార్‌లో గొప్ప సిద్ధాంతిగారున్నారు. ముహూర్తం పెట్టమనండి" ఉత్సాహంగా లేచాడు మూర్తి.

"మూఢనమ్మకాలు లేవన్నారు... మరి...?" ఆశ్చర్యంగా అడిగాడు కనకారావ్.

'భలేవాడివే!' దేముడు లేడు. అతడికి చేసే పూజాపునస్కారాలు అన్నీ వ్యర్థం' అన్నదే మన చిత్ర సందేశం! అంత మాత్రాన ముహూర్తం చూసుకోకుండా, పూజాశాస్త్రోక్తంగా నిర్వహించకుండా షూటింగ్ ఎలా ప్రారంభిస్తాం" అన్నాడు మూర్తి!

సినీమాయా జగత్తును కొద్ది కొద్దిగా అప్పుడే అర్థం చేసుకొంటూన్న కనకారావు అవునన్నట్టు తలూపాడు మౌనంగా.

# సాక్ష్యం

కోర్టుహాలు కిటకిటలాడుతోంది జనంతో! నగరంలో ఎన్నో దొంగతనాలు చేసిందన్న ఆరోపణలతో దోషిగా బోనులో నిలబడ్డ రత్నమాలను విచిత్రంగా చూస్తున్నారు జనం.

ఇన్ని రోజులుగా ఈ ఘాతుకాలన్నీ చేసింది ఒక 'స్త్రీ' అని తలచుకోగానే అందరూ విస్మయులయ్యారు.

జడ్జిగారు తన సీట్లో కూర్చొని వాదన ప్రారంభించవలసిందిగా కోరారు.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ తన వాదనాపటిమను ప్రదర్శించసాగాడు.

తెల్లబోయి వినసాగింది రత్నమాల

నిజానికి పొట్టగడవటంకోసం వ్యభిచారిణిగా మారిన అబల రత్నమాల. గతరాత్రి లాడ్జింగ్‌లో జరిగిన రైడింగ్‌లో పోలీసులకి చిక్కిందామె.

అలాచిక్కిన రత్నమాలను చూడగానే ఇన్‌స్పెక్టర్ మనస్సులో ఓ కొత్త ఆలోచన మెదిలింది.

గతకొద్ది నెలలుగా నగరంలో ఎన్నో ఘాతుకాలు జరుగుతున్నాయి. ఈ విషయమై పత్రికలు, ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోస్తున్నాయి. పై అధికారులు తమకింది పోలీసు ఉద్యోగుల్ని సంజాయిషీలు అడుగుతున్నారు. ఈ పరిస్థితిలో చేతచిక్కిన రత్నమాలపై ఆ నేరాలన్నీ తోసేస్తే తనకు ప్రమోషన్‌తోబాటు, గొప్ప పేరు ప్రఖ్యాతులు రావటంఖాయం. పైగా ప్రభుత్వపక్షం హాయిగా ఊపిరి పీల్చుకోగలుగుతుంది.

ఆ ఆలోచనా ఫలితంగానే రత్నమాల దోషిగా నిలబడింది బోనులో

"ఇన్‌స్పెక్టర్! మీరు దోషిమీద చేసిన నేరారోపణలకు సాక్షి ఎవరయినా ఉన్నారా?" అడిగాడు జడ్జి గంభీరంగా

"ఉన్నాడుసార్!" అంటూ సోమరాజును ప్రవేశపెట్టాడు ఇన్‌స్పెక్టర్.

దొంగ సాక్ష్యాలు చెప్పడంలో సిద్ధహస్తుడు సోమరాజు.

"గతనెల పదవ తేదీన దోషి ఆంధ్రా బ్యాంకు దోచిందని ఆరోపణ! ఆ సమయంలో నువ్వామె దోపిడీ చేస్తుండగా చూశావా?" అడిగారు జడ్జి.

"చూశాను యువరానర్! ఆ సమయంలో నేను సెకెండ్ షో సినిమాచూసి వస్తుండగా పెద్ద బజారులోని ఆంధ్రా బ్యాంకులో నుంచి ఈమె హడావిడిగా పరిగెత్తుకు రావడం కళ్ళారా చూశాను!"

మెచ్చుకోలుగా చూశాడు ఇన్‌స్పెక్టర్, తన సాక్షి వంక.

"సెప్టెంబరు ఆరవ తేదీ పట్టపగలు ఇద్దరు ఆడవాళ్ళ మంగళసూత్రాల్ని నడి బజారులో గుంజుకుని పారిపోయింది ఈమె. నువ్వు చూశావా?"

"ఆ సమయంలో ఆ బజార్లో ఏవో సరుకులు కొంటున్నాను సార్! అప్పుడీమె చేతిలో రెండు గొలుసుల్తో పారిపోవటం గమనించాను" తడుముకోకుండా చెప్పాడు. సాక్షి.

ఆ తరువాత ఓ కిడ్నాపింగ్ కేసులో కూడా రత్నమాల హస్తముందని రుజువులతో సహా చెప్పాడు సాక్షి.

ఇన్‌స్పెక్టర్ కళ్ళముందు తన ప్రమోషన్ ఆర్డరు కదలాడింది.

"ఈ నేరాల చిట్టాలో ఇంకా ఒక్క నేరంమాత్రం మిగిలింది! అదికూడా ఈ మే చేసిందంటావా?" ఆశ్చర్యంగా అడిగాడు జడ్జి.

"నిస్సందేహంగా...! అలాంటి నేరాలు ఈ దుర్మార్గురాలు ఎన్నో చేసింది. అన్నిటికీ నేనే ప్రత్యక్ష సాక్షిని!" గొప్పగా చెప్పాడు సాక్షి.

"ఇక ఆపు" అరిచాడు జడ్జి "ముందు ఈ సాక్షిని అరెస్టు చేయండి!" పోలీసులకు ఆజ్ఞ జారీచేశాడు జడ్జి.

"ఎందుకు సార్...?" ఒణుకు పుట్టిపోతూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఎందుకా? మన మేయర్‌గారి ముద్దుల కూతుర్ని ఎత్తుకుపోయి రేపుచేసింది కూడా ఈ రత్నమాలే అని ఉంది నీ రిపోర్టులో. కనుక ఈ సోమరాజుతోపాటు నీకు కూడా శిక్ష తప్పదు..." అన్నారు జడ్జిగారు.

కళ్ళు బైర్లు కమ్ముతుండగా కుర్చీలోంచి నేలమీదనే కూలబడ్డాడు ఇన్‌స్పెక్టర్.

-కోనే హరిబాబు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad - 500 016, TEL: 220728. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 482

# సితార

## అభిప్రాయ సేకరణ

## ఆకర్షణీయమైన బహుమతులతో కూడిన బృహత్ పథకం!

## ప్రేక్షకులకు ఎలాంటి సినిమాలు కావాలి?

అన్నది సినిమా పరిశ్రమలోనివారికి ఎలా తెలియాలి? మాకిది కావాలి అని తెలియచెప్పే అవకాశం ప్రేక్షకులకి, వారికిది కావాలి అని తెలుసుకునే అవకాశం పరిశ్రమకి ఎలా లభిస్తుంది?? ఈ విషయమై 'సితార' ఒక బృహత్ పథకాన్ని తలపెట్టింది. సినీరంగానికి చెందిన పలు ప్రధానాంశాలమీద పలు ప్రశ్నాపత్రాలు తయారుచేసి ఒక్కొటి రెండు వారాల చొప్పున మొత్తం పదివారాలపాటు ఒక క్రమంలో ప్రచురిస్తూ తద్వారా ప్రేక్షకాభిప్రాయాన్ని తెలుసుకునే పథకమిది. ఈ పథకం కింద ఉన్న లాటరీ సిస్టంలో ప్రేక్షకులకి-అదే 'సితార' పాఠకులకి - ఆకర్షణీయమైన కలర్ టి.వి., మోపెడ్ వంటి **323** బహుమతులుకూడా వున్నాయి. మళ్ళీ మళ్ళీ రాని లక్కీ ఛాన్సిది. దీన్ని అందుకోవడం మీవంతు ఇక!

ప్రశ్నాపత్రం ఇప్పుడు మార్కెట్లోవున్న 'సితార'లో వుంది.

మీరు చెయ్యవలసిందల్లా మీ అభీష్టంమేరకు ప్రశ్నాపత్రాన్ని చక్కగా టిక్ (✓) మార్కులతో పూర్తిచేసి, మీ అడ్రస్ వివరంగా రాసి, కత్తెర గుర్తు చేసినంతమేరా కట్ చేసి పంపించడమే!

ఆలస్యం చేయక వెంటనే 'సితార' కొని 'మాన్ ఆఫ్ విజన్' అయిపోండి మరి!













CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd No. H/HD